# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్




మే 1959

సంపుటము 36 : : సంచిక 5

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## మే 1959



## జూన్‌నెల సంచికలో

# కాళిందీస్తవము

శ్రీ బూర్గుల రామకృష్ణరావు

పానముసేసి చేసి యుప
పాయము తోయ మభాగ్యకోటి కెం
దైన ననాయనమ్మయిన
యాకృతి కన్నులనించి నించి, పు
ణ్యానకు రాశి 'కృష్ణ'యను
నక్షరయుగ్మము నెంచి యెంచి, యో
భానుజ ముక్తిగాంచెదను
భక్తిజనించి చరించి నీతటిన్.

పాపఘ్నంబగు నీప్రవాహమున దా
ప్రాణప్రయాణోత్సవం
బే పుణ్యాత్ముఁ డొనర్చు దన్నికృతి నెం
తే యంతకుం డోర్చు, రా
రాపున్ మండలభేదమందు నల మా
ర్తాండుండు సైరించెడిన్
నీపైనుండిన నిండుప్రేమవలనన్
నిక్కంబు కాళిందిరో!

ఓ సంజ్ఞాపతిపుత్రి! కాలభగినీ!
ఓ కృష్ణ నిత్యప్రియా!
ఓ సర్వాఘ వినాశినీ! యమున! పు
ణ్యోదార! కాళింది! యం
చాసక్తిన్ సతిఁజేసి మజ్జనము ని
త్యశ్రద్ధ గావించు వా
డా సంబోధన సంఖ్య జన్మకృతపా
పౌఘంబు బాయున్ వెసన్.

(పండితరాయల రచనకు అనువాదము.)

# మాధవవర్మ : అతని సంతతి

## శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

ధర మాధవవర్మ ధర్మ పరిపాలనమునకు ప్రఖ్యాతి వహించిన మాధవ వర్మయే. ఈతనిని గురించి తెలుగు దేశమున పరంపరాగతముగ పురాతన కాలము నుండియు ప్రచారములోనున్న గాథలు కలవు. దూబగుంట నారాయణకవి తన పంచతంత్రమును ఈ మాధవ వర్మవంశమునం దుదయించిన బసవ భూపాలున కంకిత మిచ్చు సందర్భమునందు మాధవవర్మవంశము నిట్లభి వర్ణించి యున్నాడు.

"మును బెజవాడ దుర్గమున
ముగ్ధతనంబున మెచ్చు జేసె బెం
పున రథదంతి వాజిభట
భూరి బలంబులచే గళింగ భూ
జనపతి గ్రుంచి చేవ దవ
సంతతికై మహి బాడినిల్పి గ
మ్యన జిరకీర్తులంగనిన
మాధవవర్మ నిజాన్వయంబునన్.[1]"

బసవ భూపాలుని కొడుకును, మంత్రియునైన చెందలూరి గంగయామాత్యునికి శ్రీనాథ మహాకవి శిష్యుడును, మరదియునగు దగ్గుపల్లి దుగ్గయ్య తన నాచికేతూపాఖ్యానమును గృతి యొసంగెను. ఆ సందర్భమున దుగ్గయ్యకూడ మాధవ వర్మను

"చతురంగబలము విజయవాడ దుర్గాంబ
వరమున బడసి దుర్వారలీల
జగతీస్థలంబెల్ల సాధించి జయశాస
నములు దిగ్దంతి దంతముల జలిపి
పేద బాలునకుగా బ్రియసుతు మోహంబు
పట్టక బెజవాడ బాడి నిల్పి
కలయంగ బురమున గాంచన వర్షంబు
గురియించి దేవతాకోటి పొగడ
వసుధ నెగడిన మాధవ వర్మ—"

అని వర్ణించి యున్నాడు. పూర్వోక్త పద్యములు రెండిటివలన మాధవ వర్మను గురించి కొన్ని విషయములు తెలియుచున్నది. అతనివిడిది విజయవాడయను బెజవాడ. బెజవాడ కనకదుర్గ వరమున అతడు చతురంగ బలమును బడసి జగతీస్థలమునంతను సాధించి దిక్కులందు తన జయ శాసనములను వ్రాయించెను. అతని వీరోచిత కృత్యములలో కళింగవిజయ మొకటి. సైన్య సమేతుడై కళింగముపై దాడి వెడలి దానిని పాలించుచుండిన జనపతిని సంహరించెను. పేదబాలుని నిమిత్తము తన ప్రియసుతునిమీది మోహమును బోనాడి బెజవాడలో ధర్మము నిలిపి పురమున బంగారువాన కురిపించుట అతని ప్రఖ్యాతికి మూల కారణము. ఈ విషయములనే ఈ క్రింది చాటు పద్యములుకూడ నుడువుచున్నవి:

"ఎనిమిదివేల దొరగల
యేనుగులున్ వడి నేల ద్రొక్క ద్రొ
క్కని దశ లక్షవాజులును
గాలడుపోని (గాలునిఁబోలు)
[పదాతికోటులున్*]
ఎనయగ దుర్గ యిచ్చె ధన
మిద్ధనసంజయ భీకరాంకమున్
మనుజ వరేణ్యతం బరగు
మాధవ వర్మకు గారవంబునన్.
"కట్టెలకుండి......
కట్టెదురన్ దనపట్టి దెచ్చి య
ప్పట్టున జంపి చిత్రముని
భగ్గుడు మెచ్చి సువర్ణ వృష్టి య
ప్పట్టణ భూమిలో గురియ
బంచెను మాధవవర్మ పాడి పెం
పెట్టినొ యంచు నింద్రుసభ
జేకొని రప్పుడు దేవ సంఘముల్."

—చా. ప. మ. మం., 2 భా.

ఇంతియేకాదు, మాధవ వర్మ పేద బాలునికై తన పుత్రునికి మరణ దండన మొనర్చిన కాలముగూడ నీ క్రింది చాటువు తెలుపుచున్నది.

"ఆయతకీర్తి సజ్జనకు
లాగ్రణి మాధవవర్మ చింతలం
గాయలు కోసి యమ్మకొను
కట్టెలగుండె తనూజు చావుకై
(శ్రీయుతుడైన పుత్త్రు) తల

చేతికినిచ్చె బెజావాడె నా (?)
పాయక నిల్చె వార్ధి శశి
బాణశకాబ్దములైన కాలమున్."

—చా. ప. మ. మం, 2 భా.

అనుమకొండ పురవరాధీశ్వరుడును, కాకతి కులజుడును అయిన రెండవ ప్రోలరాజు ప్రెగ్గడ బేతరసు భార్య మైలమ క్రీ. శ. 1117 లో 'కడలలాయబసది' అను జినాలయమును అనుమకొండలో నిర్మించిన సందర్భమున మహామండలేశ్వరుడైన ఉగ్రవాడి మేళరసు కూడ ఆ జైనబసదికి కొంత భూదానము కావించెను. శాసనమునందు ఈ మేళరసు ఇట్లభివర్ణితుడైనాడు: "అష్టాదంతి సహస్రాణి దశకోటీచ వాజినాం అనంతం పాదసంఘాత మిత్యేతే మాధవవర్మ వంశోద్భవరప్ప శ్రీ మన్మహామండలేశ్వరనుగ్రవాడియ మేళరస..." (ఎనిమిది వేల యేనుగులు, పదికోట్ల గుఱ్ఱములు, అనంతమైన పదాతివర్గము గలిగిన మాధవవర్మ వంశమునందుద్భవించినట్టి మేళరసు.) మేళరసు మూలపురుషుడైన మాధవవర్మ చాటుపద్యోక్త మాధవవర్మయే.

కాకతీయుల వంశమునుగూర్చి ప్రబలమైన వాదోపవాదములు కలవు. కాకతీయులు చతుర్థకులజులని కొందరందురు; కాదు క్షత్రియులని కొందరి యభిప్రాయము. కానైతే వారు బ్రాహ్మణులతోను, క్షత్రియులతోను, చతుర్థకులజులతోను కావించిన వివాహము లున్నవి. పూర్వకాలములో నున్నతివర్ణములవారు తమ క్రింది వర్ణములవారితో వివాహములు చేసికొనుటకు ధర్మశాస్త్రమనుమతి యుండెను. ఇట్టి వివాహములకు అనులోమవివాహములని పేరు. కాకతి గణపతిదేవ చక్రవర్తి తన కూతురు రుద్రమదేవిని చంద్రవంశ క్షత్రియుడైన రాజకుమారునకిచ్చి పరిణయము కావించెను. కేవలము వివాహసంబంధములను పురస్కరించుకుని పూర్వభూపతుల కులనిర్ణయము కావించుట సముచితము కాదేమో. ప్రతాపచరిత్రమును, సోమదేవరాజీయమును కాకతీయులు మాధవవర్మ సంతతివారని చెప్పుచున్నవి. కాని యివి విశ్వసనీయములైన చారిత్రక గ్రంథములు కావు. ఈ రెండింటికిని సిద్ధేశ్వరచరిత్రము మాతృక. ఇది ద్విపదకృతి. ఇదియు పై నుడివిన గ్రంథములవంటిదే. కాని ఒకానొక ద్రాక్షారామ శాసనమువలన కాకతీయులు మాధవవర్మవంశ్యు లగుదురనుట కవకాశము కలదు. ఈ శాసనమున మొదటి రెండుపంక్తులు పూర్తిగ చెడిపోయినవి. ఇది శకవర్షము 1085 నాటి శాసనము. దుగ్గభూపాలుని భార్య బొప్పాదేవి ద్రాక్షారామ భీమేశ్వరస్వామికి దీపదానము చేసినట్లు తెలుపుటకు పుట్టినది. మూడు, నాలుగు అయిదుపంక్తులిట్లున్నవి:

"మాధవవర్మణ వంశ్యః॥ ప్రఖ్యాతాసమకొండ ప్రోలనృపతేః పుత్రోగుణశ్రీఖనిః తస్యాగ్ర్యాగ్ర్య మహిషీ బభూవ హిమవత్పుత్రీవ చండీపతేః దేవీ బొప్పమ పూర్విణ కార్త్రిణ జనతాకల్పప్రతానీస్వయం ధైర్యేణ దాక్ష్యేణ సుశీల్యేణ కార్యేణ విలసత్ చారుత్యేణ ధుర్యేణ శ్రియ్యః."

—S. I. I., iv 1071.

"ప్రఖ్యాతా సమకొండ ప్రోలనృపతేః పుత్రః" అను దానిలో "ప్రఖ్యాతాసమకొండ" అన్నది అపపాఠము—పొరపాటు పాఠమని నా యభిప్రాయము. "ప్రఖ్యాతానుమకొండ ప్రోలనృపతేః" అని యుండవలెను. ఈ యనుమకొండ ప్రోలనృపతి కాకతి కులజుడు. ఈతని కుమారుడు దుగ్గభూపాలుడు. ఇతడు మాధవవర్మ వంశ్యుడని శాసనము తెలుపుచున్నది. ఈ శాసనమునందలి తెలుగుభాగము ఇతనిని రేపల్య (రేపల్లె) దుగ్గరాజని పేర్కొనుటచేత ఇతడు రేపల్లె ప్రాంతమున కధిపతిగ నుండియుండవచ్చును. ఈ కారణముననే ఇతనికి రేపల్లె దుగ్గరాజని వ్యవహారము కలిగినది. ఇది యెట్లున్నను ఈ శాసనము ననుసరించి కాకతీయులును మాధవవర్మ వంశ్యులనుట స్పష్టము. మాధవవర్మ శ్రీగాముని కుమారుడగు కుసుని వంశము వాడని దూబగుంట నారాయణకవి తన గ్రంథమునందభివర్ణించుటచేత అతడు సూర్యవంశ క్షత్రియుడు. కాకతీయులు మాధవవర్మ వంశ్యులగుటచేత వారు సూర్యవంశ క్షత్రియులు. రుద్రమదేవి దౌహిత్రుడైన ప్రతాపరుద్ర నృపతి చంద్రవంశ క్షత్రియుడు. రుద్రమదేవి ప్రతాపరుద్రుని పెంచుకొని తన యనంతరము కాకతీయ సామ్రాజ్యమునకు పట్టము కట్టినందువలననేమో ప్రతాపరుద్ర యశోభూషణమున కాకతీయాన్వయము "అత్యర్కేందు కులప్రశస్తి" మనియు, "సోమార్కాభిజనం తి మస్య జయతి శ్రీ కాకతీయాన్వయః" అనియు వర్ణితమైనది.

మాధవవర్మ ధర్మాభిరతిని దెలుపుగాథ బెజవాడ మల్లేశ్వరస్వామి యాలయమునందలి రాతిమీద

చెక్కిన పల్ల[వ*] శేతభూపాలుని శాసనమునందు విపులముగా వర్ణితమైనది. అది యిట్లున్నది:

'శ్రీమద్విజయవాటాఖ్యపురే కృష్ణావిభూషణే ।
కలౌ శ్రీమచ్ఛాకాబ్దే ద్విశతే పాయకసంమి[తే]
రాజా మాధవవర్మా భూ ద్విఖ్యాతో ధరణీతలే ॥
తత స్వపుత్రేణ హతే తింత్రిణీ జీవిని సుతే
ధర్మార్థ సంరక్షణార్థాయ స్వపుత్ర మవధీత్స్వరాట్
తతో మల్లేశ్వరః ప్రీతః స్వర్ణవృష్టిం వవర్షణ
శిశుపుత్రికయోః ప్రాణం దత్తవాం స్తస్య కీర్తయే

—S. I. I. X 22

ఈ శాసనము క్రీస్తుశకము పదునొకండవ, పండ్రెండవ శతాబ్దములనాటిది కాదగుననుట కవకాశము కలదు. కాని కాలముమాత్రము శాసనమున నీయబడలేదు. క్రీ. శ. 11, 12 శతాబ్దాలనాటికే మాధవవర్మను గురించిన యీ గాథ ఆంధ్రదేశమున ప్రచారమునం దుండెననుట తథ్యము.

ఈ మాధవవర్మ యెవ్వరో నిర్ణయింపవలసి యున్నది. ప్రాచీనాంధ్రదేశమును బరిపాలించిన రాజులలో మాధవవర్మలొక్క విష్ణుకుండి వంశమునందే కన్పట్టుచున్నారు. పూర్వోక్త మాధవవర్మ విష్ణుకుండి వంశ్యుడే యనుటకు సందియము లేదు. పల్లవ శేత భూపాలుని శాసనమును, చాటువుకూడ మాధవవర్మ శకవర్షము 514, అనగా క్రీ. శ. 592 నాటివాడని తెలుపుచున్నవి. పూర్వాంధ్రదేశమును విష్ణుకుండి వంశజుల యనంతరమే పూర్వ చాళుక్యులు పరిపాలించిరి. కీర్తివర్మ తనయుడును, సత్యాశ్రయ శ్రీ ఇమ్మడి పులకేశి వల్లభుని సోదరుడును అయిన కుబ్జవిష్ణువర్ధనుడు పూర్వ చాళుక్యరాజ సంస్థాపకుడు. ఇతడు క్రీ. శ. 624 లో స్వాతంత్ర్యమును ప్రకటించి వేంగినామాంతర విఖ్యాతమైన మహాంధ్ర దేశమును పరిపాలించెను. అందువలన 'విష్ణుకుండి నృపతులు' 624 నకు పూర్వమునుండినవారు. విష్ణుకుండి వంశ్యులైన మాధవ వర్మలను గురించి తెలిసికొనుటకు విష్ణుకుండి నృపాలుర చరిత్రము నించుక పరీక్షింపవలసి యున్నది.

విష్ణుకుండి వంశజులవి ఇంతవరకు ఏడు శాసనములు దొరకినవి. వీనిలో నొకటి గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా వేల్పూరులోని శిలాశాసనము, మాధవవర్మది, చాల చెడిపోయినది. దీనిలో రాజుపేరు మాత్రము తెలియ వచ్చుచున్నది. మిగిలిన శాసనము లారును తామ్ర శాసనములు. వీనిలో రెండు గుంటూరు జిల్లా తెనాలి తాలూకాలో ఈపూరులో లభించినవి; మరి యొక రెండు శాసనములు రామతీర్థమున నొకటి, చిక్కుళ్ళలో నొకటి దొరకినవి. వేరొకటి పశ్చిమ గోదావరి జిల్లా పొలమూరు గ్రామమున పూర్వచాళుక్య వంశ్యుడైన మొదటి జయసింహవల్లభ మహారాజు శాసనముతో గలసి దొరకినవి. ఇవి యన్నియు ప్రకటితములైనవి. మిగిలిన యారవ తామ్ర శాసనము దాక్షారప్రాంతమున లభించినది. ఇది యింతవరకు అప్రకటితము. శిలా శాసనము పూర్తిగ చెడిపోయినందున దానివలన ప్రయోజన మేమియు లేదు. కాగా విష్ణుకుండి వంశజుల చరిత్ర తెలిసికొనుటకు గల పరమాధారము లీ యారు శాసనములే. వీనిలో రామతీర్థము శాసనము ఇంద్రవర్మ తన 27-వ రాజ్యకాల సంవత్సరమున జ్యేష్ఠ మాస శుక్లపక్ష సప్తమినాడు తైత్తిరీయ శాఖా బ్రాహ్మణుడును, మాండిరస గోత్రుడును అయిన నగ్నశర్మకు పలేకి రాష్ట్రములోని పెరువాటిక గ్రామమును దానము చేసిన విషయము తెలుపుటకు పుట్టినది. ఈపూరు మొదటి శాసనము, పొలమూరు శాసనము మాధవ వర్మ చేసిన దానములను తెలుపును. మొదటి దానిలో దత్తిని గ్రామము బిలెంబలి. దీని నతడు తన 37-వ రాజ్య సంవత్సరములో వత్స గోత్రుడైన అగ్నిశర్మ కిచ్చెను. రెండవ దానిలోని దత్తి గ్రామము పులొంబూరు (పొలమూరు). దీని నతడు ఫాల్గుణ పౌర్ణమి సోమ గ్రహణ నిమిత్తమున గౌతమ గోత్రుడైన శివ శర్మకు తన రాజ్య సంవత్సరము 47 లో నిచ్చెను. బిలెంబలి, పులొంబూరు రెండును గుద్దావాది (గుద్దాది) విషయము లోనివి. రాజ్య సంవత్సరము విషయమున అభిప్రాయ భేదములు కలవు. ఈపూరు రెండవ శాసనము నిచ్చిన వాడు మరొక మాధవ వర్మ. ఇతడు తన 37-వ రాజ్య వత్సరమున వత్స గోత్రులైన అగ్నిశర్మ, ఇంద్రశర్మ లకు దానము చేసెను. దత్తి గ్రామము తెలియదు. చిక్కుళ్ళ, దాక్షారము శాసనములలోని దాత విక్రమేంద్రవర్మ. ఇతడు తన పదవ విజయ రాజ్య సంవత్సరమున సోమగిరీశ్వర నాథునికి చేసిన దానమును చిక్కుళ్ళ శాసనమును, తన పదునెనిమిదవ విజయ రాజ్య సంవత్సరమున కౌండిన్య గోత్రుడును, ఆపస్తంబ సూత్రుడును అయిన స్వామిశర్మకు తూండి గ్రామమును దానమిచ్చిన విషయము దాక్షారము శాసనము తెలుపుచున్నవి.

రామతీర్థము, చిక్కుళ్ళ, దాశారము శాసనములలో నిచ్చిన తరములను కలిపి ఈ క్రింది రీతిని వంశవృక్షమేర్పరుప వచ్చును.




ఈపూరు మొదటిశాసనములోని సంతతిక్రమమిది :




ఈపూరు రెండవ శాసనములోని వంశావతార క్రమమిది :




విక్రమహేంద్రవర్మయు, విక్రమేంద్రవర్మయు, విక్రమేంద్రభట్టారకవర్మయు నొక్కరేయని కొందర మతము. ఈ రీతిని ఇరువురు ముగ్గురు మాధవవర్మలు, విక్రమేంద్ర వర్మలు కనబడుచున్నారు. ఈ శాసనములలోని తరముల నన్నిటిని గలిపి ఏకైకవంశవృక్షము నేర్పరచు టెట్లనునది చరిత్రకారులకు గొప్ప సమస్య యైనది. పొలమూరు శాసనములోని విక్రమహేంద్ర వర్మ చిక్కుళ్ళ శాసనములోని రెండవ విక్రమేంద్ర వర్మయగునా? గోవిందవర్మ కుమారుడు మాధవవర్మ మొదటి విక్రమేంద్రవర్మ తండ్రియగునా? ఈపూరు రెండవ శాసనములోని మొదటి మాధవవర్మ కాని, రెండవ మాధవవర్మ కాని ఈపూరు మొదటి శాసనములోని పొలమూరు, రామతీర్థము శాసనములలోని మాధవవర్మ యగునా? ఈ సంశయములను తీర్చు కీలకమేదియు కానరాక పోవుటచేత ఇంతవరకు విష్ణుకుండి చరిత్రమును గురించి వ్రాసిన వారందరు తలకొకరీతిని ఈ తరములను గలిపి వేరు వేరు విధముల విష్ణుకుండి సంపూర్ణవంశవృక్షమును తయారుచేసినారు. అయితే ఈ శాసనములలో ఒక మాధవవర్మ ఏకాదశాశ్వమేధములను, క్రతు సహస్రములను చేసినట్లు చెప్పబడియున్నది. దాని నాధారము చేసికొని డాక్టరు సర్కారుగారు ఈ క్రింది వంశవృక్షము నిచ్చియున్నారు.




ఈ వంశవృక్షములో మొదటి మాధవవర్మ ఏకాదశాశ్వమేధయాజి, క్రతుసహస్రయాజియును. కాని రామతీర్థము శాసనమువలన దీనికొక యపవాదము సంభవించుచున్నది. ఈ వంశవృక్షము ప్రకారము ఇంద్రవర్మ పితామహుడు మొదటి మాధవవర్మ. కాని రామతీర్థము శాసనము అతడు ఏకాదశాశ్వమేధములు, క్రతుసహస్రములు చేసినట్లు చెప్పదు; ఈ శాసనము ప్రకారమివియన్నియు చేసినవాడు, దాత, ఇంద్రవర్మ తండ్రి విక్రమేంద్రవర్మ. విష్ణుకుండి వంశజుల ఏయితర శాసనమును విక్రమేంద్రవర్మ (II) ఇన్ని క్రతువులను చేసినట్లు చెప్పదు.

ఈ పై వంశవృక్షముతోపాటు ఈ క్రిందిదియు కొందరి కంగీకారమయినది. దీని నేర్పాటు చేసిన వారు ఆచార్య కే. యే. నీలకంఠ శాస్త్రిగారు. అయితే దీనిని మొదటిమారు ఏర్పాటుచేసినవారు శ్రీ వడ్డాది రామచంద్రమూర్తిగారు.




ఈ వంశవృక్షము ప్రకారము మొదటి మాధవ వర్మ, మొదటి విక్రమేంద్రవర్మ, రెండవ మాధవవర్మ ముగ్గురును ఏకాదశాశ్వమేధనులు, క్రతుసహస్రములు చేసినవారగుచున్నారు. ఇది ఎంతవరకు సమంజసమన్నదిగనే ఆలోచనీయము. ఈరీతిని వంశవృక్షము నిచ్చుటకు నాకొకటే కారణము కనిపించుచున్నది. మాధవ వర్మ పొలమూరు శాసనము పూర్వచాళుక్య జయసింహ వల్లభుని పొలమూరు శాసనముతోపాటు దొరికినది. జయసింహవల్లభుని పొలమూరు శాసనములోని ప్రతిగ్రహీత గౌతమగోత్రుడు, తైత్తిరిక సబ్రహ్మచారిఅయిన శివశర్మ పుత్రుడు రుద్రశర్మ. ఈ రుద్రశర్మ తండ్రి శివశర్మకే మాధవవర్మ ప్రాగ్దిశను జయించు కోర్కెతో గోదావరి నదిని దాటి పొలమూరుగ్రామమును దాన మిచ్చెను. అందువలననే జయసింహవల్లభుని పొలమూరు శాసనములో ప్రతిగ్రహీత రుద్రశర్మ పూర్వాగ్రహారికు డనబడినాడు. విష్ణుకుండి నృపతులను జయించి ప్రాగాంధ్రదేశమును పరిపాలించినవారు పూర్వ చాళుక్యులు. జయసింహవల్లభుని తండ్రి కుబ్జ విష్ణువర్ధనుడు తన యగ్రజుడైన సత్యాశ్రయ రెండవ పులకేశి వల్లభుని ప్రాగాంధ్రమును జయించిన పిమ్మట కొంతకాల మతని ప్రతినిధిగ పరిపాలించి తరువాత క్రీ. శ. 624 లో స్వాతంత్ర్యమును ప్రకటించి పదునెనిమిదేండ్లు రాజ్యమును పాలించెను. అటువెనుక ఈ రాజ్యము నేలినవాడు జయసింహవల్లభుడు. ఇతని అయిదవ విజయరాజ్య సంవత్సరములో నిచ్చినదే పొలమూరు శాసనము. జయసింహవల్లభుని నాటికే విష్ణుకుండి రాజ్యము చాళుక్యాక్రాంతమగుటవలన సర్కారుగా రిచ్చిన వంశవృక్షములోని మొదటి మాధవవర్మయే పొలమూరు శాసనదాతయైనయెడల విక్రమేంద్ర వర్మాదులు లేకుంట కవకాశ మేదియని శంకించుకొని కాలనిర్ణయమునకు సంబంధించిన చిక్కును తొలగించుట కీరీతిని రెండవవంశవృక్ష మేర్పాటుచేయబడి నట్లు నే నూహించుచున్నాను.

ఎట్లయినను విష్ణుకుండి వంశవృక్ష కాలనిర్ణయములు ఇంకను సమస్యలుగనే యుండిపోయినవి. మొత్తముమీద ఈ మాధవవర్మలలో ఒకడు సుప్రఖ్యాతుడు, ఏకాదశాశ్వమేధయాజి, క్రతుసహస్రయాజి, ఎవరో ఒక మాధవవర్మ తూర్పుదేశమును జయించుటకు, అనగా ప్రాయికముగా కళింగమును జయించుటకు గోదావరిని దాటి వెళ్ళెననుటకు పొలమూరు శాసనమే ప్రమాణము.

విష్ణుకుండి నృపులు క్రతుకర్మానుష్ఠానపరులు, వేదధర్మావలంబకులు, పురుషమేధ సర్వమేధములను కూడ ఆచరించినవారు.

[సశేషము]

# క్రొత్తపాట

శ్రీ బొడ్డు బాపిరాజు

1

ముగ్ధ జలజాధరదళమ్ము ముద్దువెట్ట
కరిన హేమంత హిమవాలుకాపథమ్ము
లవతరించివచ్చు నవారుణాంశువట్లు
క్రొత్తపాట నన్ను వెదకికొనుచు వచ్చె.

2

కన్నెమొడంత తొ్రటువడు కమ్మని కాంతులవోలె, మబ్బులో
నన్నగజారు వెన్నెలల జాలుల రీతి, నవోదయంబులో
క్రొన్నన తేరు తేనె నురుగుల్ వలె, భావఝరీతరంగ నం
ఛన్నములైన కల్పనలు సందడి సేయును క్రొత్తపాటకై.

3

అలస సమీరచంచల తృణాంచల చారు తుషారబిందు, వు
జ్జ్వల లవలీలతా చికురజాత దరస్మిత కుట్మలంబు, కో
మల లలనాదృగంత వలమాన ముదశ్రు కణంబు లీల కాం
తిలు నవగీతి మద్వదన దేహళి నూయెలలూగు చెల్వుగన్.

4

భూమికి ప్రావృడంబుధరముల్ దిగి
వచ్చిన పూలవాన చి
న్కై - మధురాత్మ మానవ మనోహరు
నంకము జేరు అప్సరః
కామినియో - హిమాచల శిఖా
నిలయమ్ముల డిగ్గు పావన
వ్యోమనదంబొ నాగ పొదువున్
మృదుభావ వినూత్న గీతియున్.

5

మందానిల బృందాశ్రిత
సుందర మందార కుసుమ సురభిళ మధురా
నంద మధుపూరములు మా
అందమ్ముల క్రొత్తపాట లలరుండోటల్.

# విశ్వనాథవారి ప్రణయదర్శనము

శ్రీ సాళ్వ కృష్ణమూర్తి

## 1

"బాలకులు మూగి వెన్నెల వత్తికొనుట
శిష్టదృష్టులు వెదుకాడు చందమునను
ముగ్ధహృదయులు నా మిత్రులు మదీయ
గీతి కార్థమ్ములకు వెదకెదరు దేవి!"

అవును. నేనీ కావ్యమునిట్లె చదివితిని, ఏదో "వెన్నెల వత్తి"కై వెదకొంటిని. నాకేదియు దొరికిన దనుకొంటిని. ఆ గీతికలమాటున కవి నిక్షేపించినదియు నేకన్నదియు నొక్కటియగునో కాదో నాకు తెలియదు. ఆయాట గెలుపోటములతో నాకు పనిలేదు. క్రీడా వినోదఫలము మాత్రము నాకబ్బిన జాలును.

"గిరికుమారుని ప్రేమగీతాలు" విశ్వనాథ సత్యనారాయణగారి అలనాటి తొలినాళ్ళ రచన. కవితా సాధనోద్యుక్తులై క్రీ. శ. 1902-28 మధ్యకాలమున వ్రాసినది. అదియు 'గిరి కుమారుడు' ను గుప్తనామముతో వెలసిన రచన. ఆ వయసునకు అప్పటి యొడుదుడుకుల భావ వేగమునకు ఆపేరు తగినది.

ఇందాయన యన్నియు గీతములే వ్రాసినారు. ఒక్కొక్క భావము సాధారణముగా రెండుమూడు పద్యములలో చెప్పబడినది. పెంచుటయన్నదే లేదు- తనకుతోచిన యూహ ఎక్కడాగిపోవునో పద్యము గూడ అక్కడి కాగిపోవును. ప్రాయికముగ ముందటి రెండుమూడు పద్యముల భావమును చివరి గీతి శకలమున చెప్పివైచును. ఇంక శిల్పముపై దృష్టియు గాన్పింపదు. భావమును దీర్చుటయందు గూడ మెలకువకై ప్రయత్నము లేదు. అప్పటి కాయన వట్టినగ్నమతి. కాని ఆగిలేని దూకుడాయనచే నా గీతముల జెప్పించినది. ఆ వేగాతిశయము పెట్టినవగా మిఱ్ఱుపల్లముల నోరసి పారునది గాదు. ఎగసి మిఱ్ఱులమాత్రము తలదన్నుచు బోరెడి ప్రవాహ వేగము-ఆ మిఱ్ఱుల బరికింపగా నా ప్రవాహ వేగ స్వభావములు దాని కంటెనంతవరకు మనకు తెలియగలవు. ఈ కావ్య పుట్టియొక యుదాత్తతను బోధివి కొన్నది.

ఆధునిక కవిత్వమునకు ప్రాయికముగా క్లిష్టత యొక లక్షణము. అట్టిక్లిష్టత ఈ కావ్యమున గూడ నున్నది. వేరు వేరు సమయములందాయన మనసున నాడిన భావము లిందులోనున్నవి. ఆ యా భావ సమీకరణమున కొక క్రమము నప్పుపోతగా దెచ్చి పెట్టుట సాధ్యము కాని పని. లేక ఈ కావ్యము పరమార్థ మిదియని నిగ్గుదేల్చుటకును వీలుచాలదు. ఈ సర్వ భావముల సమసంధానముచేసి చూచినచో నందు స్థూలముగ గాన్పించు ఒకటి రెండు ముఖ్యవిషయముల ముందుగా మనవి చేయుదును. తరువాతి పని యాయన భావ ప్రవాహము వెంటబడి మనసును ఆ మిఱ్ఱుల నోరయుచు బోవుటయే. సెలయేటి యొడ్డు వెంట నడలెడి వాహ్యాళి శిశిరశీకరాపాది గదా!

ఇది సాధనకావ్యము. దీనిని జదువుకొనుటకు కవి మనస్సంస్కారము నొకింత యెఱుంగవలెను. వారి యిలువేల్పులైన అంబికావిశ్వేశ్వరు లీ సంస్కార ముఖమున వెలసినవారు. ఆయన అద్వైతి.

ఈ కావ్యమున విశ్వనాథ కవితాకళను సాధింప బూనినారు. ఆ సాధనలో నద్వైతరూపమును ప్రణయ తత్త్వ మానుషంగికముగ సిద్ధించినది. కవితా పరమార్థము ఆనందము. లేదా ఆనందరూపమగు చిత్కళనే కవిత్వ మావిష్కరించును. దీనికధిష్ఠాత్రి ఆనందభైరవీ రూపమునను యంబిక. కవితాకళను సాధించుట కాదేవినే యుపజీవింపవలెను. ఆమె సర్వరసాత్మక మూర్తి.

'శివే శృఙ్గారార్ద్రా తదితరజనే కుత్సనపరా
సరోషా గఙ్గాయాం గిరిశచరితే విస్మయవతీ,
హరాహిభ్యో భీతా సరసిరుహ సౌభాగ్యజయినీ
సఖీషు స్మేరా తే మయి జనని దృష్టిః సకరుణా.'

యని శంకర భగవత్పాదుల సౌందర్యలహరీ శ్లోకము. విశ్వనాథ రచనలోని 'దేవి' సంబుద్ధి ఇతరకవులు చేసెడి గౌరవ మాత్రవ్యంజకమగు 'దేవి' సంబుద్ధివంటిది గాదు. దేవి యనగా నంబికయనియే కవిహృదయము.

కవి తన కవితాసాధనకై దేవి నుపాసించుటలో చోదకశక్తిగా ప్రియురాలు నిలచినది. కావ్యమున మన కొక్కొక్కచో కవి యంబిక నుద్దేశించి యనుచున్నాడా, ప్రియురాలి నుద్దేశించి యనుచున్నాడా యను సందేహము గలుగును. లౌకికమగు రత్యాదుల స్పర్శయున్నచే ఇది శృంగారమని యెఱుగదగును. దేవీగతమైనరతి భక్తిరూపముగ భాసించును గదా! ఉత్తమ ప్రకృతుల శృంగార ముదాత్తదశలో స్థిమిత ప్రసన్నమై సాత్త్వికముగ వెలయుననుటకు పెద్దలు ప్రమాణము; అట్టి లౌకికమగు రీత్యాదులస్థితి యెక్కడిది? 'యద్విశ్రామో హృదయస్య'. కాగా నీకావ్యమున దేవీ దయిత లిరువురు నొక్కొక్కచో గలసి పోయి నట్లును, ఒక్కొక్కచో విడివిడిగను గాన్పింతురు. తల్లియగు దేవి త్రిమూర్తులకు తానె కారణ మయ్యు పరమేశ్వరుని భర్తగా గొన్నదిగదా. ఆ మార్గము నిట యనుసంధింపవలెను. అంబికా పరమేశ్వరులకు వలెనె ఇట కవికిని దేవీ—దయితా రూపమునకును శేషశేషిభావము. ఏమనగా కవి తనకు జ్ఞానశక్తి నాపాదించుకొన్నాడు. చూడుడు.

ఆ పయోరాశిలో త్రిలోకాతి భీక
రముగ విషవహ్ని హాలహలము సముద్భ
వించె నది యోర్పుగలిగి దేవీ! గళమ్ము
నందు నిలిపితి నేను జ్ఞానాకృతినయి.

మూలముగ నీ కావ్యమునగల ముగ్గురు పాత్రల సంబంధము నిట్లు చెప్పవచ్చును.

కవి——కవిత——దయితలు

జ్ఞానము—క్రియ—ఇచ్ఛ యను నంశలు.

జ్ఞానశక్తి నాపాదించుకొన్న కవి ఇచ్ఛాశక్తి రూపమగు దయిత చోదనశక్తిచే కవితయను నానంద రూపమగు క్రియాసిద్ధిని భజించుచున్నాడు.

ఇదియంతయు కావ్యమునుబట్టి నాకు దోచిన భావారోపణమే గాని మఱియొకటి గాదు; తంత్ర విద్య యంతయు నీ కావ్యమున నిట్లు నిక్షిప్తమైనదని నా వాదమును గాదు. ఇంక కావ్యము ననుసరింతము.

**2**

అస్మదీయ కంఠమునయం దాడుచుండె
నొకయెద్దో గీతి బయటికి నుబికిరాగ
చొచ్చుకొని లోనికింబోదు త్రచ్చిపోయె
నా హృదయ మీ మహా ప్రయత్నమ్మునందు.

ఈ కావ్యమున నిది తొలిపద్యము. కవి కవితావాణి యావిష్కృతి నందలేదు. కృత్యాద్యవస్థకంటె వేయిరెట్లు కష్టమైన పురిటినొప్పులివి. వేదనాకలితుడైన కవి యా వాణి నావిష్కరించుట కెంతయో కష్టపడినాడు. తన శక్తిప్రయత్నములు ఫలింపలేదు. ఆ బాధచే గుండె వ్రీలునంత పనియైనది.

విఫలిత పునఃపునః కృతి వివిధయత్న
భావిత ప్రచండబాధా తథా విదారి
తాస్మదీయ హృదంతరం బందు దోచె
స్ఫురిత సంఫుల్ల నవజపాశోణ సంధ్య.

కవి గుండె వ్రీలగా నవతరించిన జపాశోణ సంధ్యలో కావ్యారంభము. అవును. ఈ జపాశోణ సంధ్యఏమిటి? అంబికా తనుకాంతి ప్రసారము!

కవీన్ద్రాణాం చేతః కమలవన బాలాతపరుచిం
భజన్తే యే సన్తః కతిచి దరుణా మేవ భవతీమ్,
విరిఞ్చి ప్రేయస్యా స్తరుణతర శృఙ్గారలహరీ
గభీరాభి ర్వాగ్భి ర్విదధతి సతాం రఞ్జన మమీ.

(సౌందర్యలహరి)

అరుణ రూపిణియగు తల్లి తన కాంతిప్రసారమున కవికి వాగావిష్కృతి యైనది. శంకరులు చెప్పిన చివరి రెండు శ్లోకచరణములు విశ్వనాథయెడ ఎంత నిజమైనవి!

ఈ మహాసంధ్యలో శారదా మయూరి
రమ్య కింకిణీ కిణికిణీ రభస పాద
మంజుల విలాస నృత్య సామ్రాజ్యలక్ష్మి
యగుచు గచ్ఛపీ మృదుగీతు లనుసరించు—

దీనితో గావ్యావతరణమైనది:

ఇటనుండి కొంతదూరము కవి యావ్యవస్థ గాన్పించును. కవితవిషయమున తనలో దనకె ప్రత్యయబుద్ధి కుదరలేదు. నిలుకడ యెఱుగని వనాంత నిర్ఝరమువలె తన భావ మీ శిలాదృఢపథమున జలజల మనుచు బొంగి యెక్కడ బోకైన మిగులదేమో చివరకని జడియును. తన కోఱకైన కవితా మహాకలశమును దా నాపాదించలేక పోవుచుంటినని విచారపడును. శరీరికి బాధావిలీతమగు నానందము తప్ప అన్యపుటానంద మందదా యని విచారపడును. పట్టుదల మాపును. కాలకూటమైన గ్రోలుదు ననును. అంతర్ముఖుడగును. ప్రకృతి యెంత బలవత్తరమో ఈ కవి 'లలితసృష్టి'ని గూర్చి వ్రాయుచు నే మనుచున్నాడో చూడుడు:

ఈ లలితసృష్టి యెట్టిదో యింక మీద
బాపసెల్లా పరచి నిద్ర పట్టకున్న
బట్టివట్లు నటించు బాల్పరచు నటనె
ప్రథిత యోగ్యాంతరంగేశు పద్మనాభు.

బ్రహ్మదేవునిగన్న యీ భగవంతుడు గూడ యోగమాయకు వశీకృతుడే! మరి తాను ప్రకృతిగతుడై బాధపడుట యెంత? అందుచే గుండె రాయి చేసి కొన్నాడు. అలవాటు పడినమీదట తన గుండెపై వాడి యమ్ములైన పదును పెట్టవచ్చునట! 'మను ప్రవంతికలలో దిగుచు' 'మెయిళ్ల సంపులకు నైన పోరలుచుండిన' ముగ్ధకు, అచ్చపుజీవి బంగారి ప్రకృతితో సామరస్యమును గోరుచున్నాడు. తన కిష్టములైన కొన్నిటిని చెప్పుచున్నాడు:

ఇంతలోన వికాసమ్ము లింతలోన
మీలనమ్ము లీ శ్రావణ వేళ బ్రొద్దు
లా గగనలంబి నీరద చయముతోడ
నా మనోవికాస మీలనములు పోలుచు.

ఆంగ్లకవులలో మిల్టన్ తన కే ఋతువున భావము ప్రచలితమగునో చెప్పుకొన్నాడు. విశ్వ నాథకు వర్షర్తు విష్టమట!

ఈ యచేతన ప్రకృతిలో జలదగర్భ విద్యు ల్లతలు చూచి నీలములైన ప్రణయినీ పీతాపాంగరేఖల స్మరించినాడు కవి—కవి హృదయమున దయితా రూపముద్ర రూపు గైకొనుటకు చేతనావధి యగు మనుష్యలోకమున బయటకు నిదియే మొదలు—అంతే కాదు. మెయిళ్ల గర్భఘూర్ణిత మంథరగర్జలు వినగా కవి హృదయమున ప్రణయ మధురగీతములు శోభిల్లి నవి. ఆ గర్జలు సాంధ్యనృత్య దీశ్వర మురజముల చప్పుళ్లవంటి వంట—ప్రకృతి పురుష మనుస్యూతధిగ నున్నదీ భావము—పూర్తిగా లోకమున బడని కవి స్థితి రాహుగ్రస్తమగు చంద్రార్ధబింబమువలె నున్నదట!

ఈ పువుందీగె బోదెలో నిట్టముకుచు
కొని భుజగమనై నిదురపో గోర్కి గలుగు
ఓలిగా సొగసు నా ప్రియురాలివోలె నీ ప్ర
సూన వనలత నాకు శుశ్రూష చేయు.

తరువాత గ్రీష్మ వర్షర్తు వర్ణనలలో నా ప్రియు రాలి స్వరూప మించుక జెప్పినాడు కవి. జ్యేష్ఠ మాసపు తొలి సంజరేకలలో గాసెడు పలుచని వెన్నె లలు సీమంతినీ చారు మందహాసముల వంటివట. సాంధ్య శీతలమైన చల్ల గాలి ముద్దుటిల్లాలి నర్మోక్తిని మురస్క రించునట. వర్షర్తువున ప్రియురాలి నల్లగలువలవంటి కనులలోని కౌటుకవలె నాకసముగ్రమ్మిన యాషాఢ జలదుని గొడుగుసీడల యొదిగి లోకముతో ప్రకృతితో స్నేహము భుజించుచున్నాడు కవి.

కవి తాను సమీర బాలుడట. కవిత పూవట. పరస్పర స్పర్శమాత్రమున వారు పులకిత బ్రహ్మపదమున బోవుదురు. దిగంతములందలి మరుదంకురముల దెచ్చి పూచిన మొక్కకు అతడు వీవ జేయును. ఆ పూచిన పూవులోని తుసారబిందువు లమృతమని తల్లి చెప్పినది. అది యామె యాయువట!

ఒక్కచో నామె వనదేవత. ఆమె యిచ్చిన యమృతపుబూవు మానుసా స్వాదనచే వాడిపోయినది! ఒకసారి ఇరువురు ప్రయాణమై పోయిపోయి చంద్ర బింబమున నమృత ప్రవాహమునబడి దాని తుది మొద లెరుగలేక పోయిరట! ఐందవకళ అఖండత్వమును చెప్పుచున్నాడు కవి.

ఆమె కన్నులలో నతనికి విశ్వమంతయు గాన్పిం చును. అందులో మరల తనహృదయమే ప్రతి ఫలిం చినది.

అనంతత్వ గర్భితమగు మధురభావమునకు తన తనువు జన్మస్థలము. ఆ భావ మీ విశ్వమును ప్రతిఫలిం చును. తాను తనతల్లి కడుపున కల్పవృక్షమువలె పుట్టెను. ఇట్టి తనవంటి రేణుసహస్రముల దాల్చిన తల్లి యనంతరూపము అవగతమే కాదే!

ప్రణయ పయోరాశి నాళయను కవ్వపు కొండ తో జిలుకగా హాలాహలము పుట్టినదట. దాని నాతడు జ్ఞానాకృతియతి గొంతులో నిముడ్చుకొనెను. దానితో నామెయు తానును నొకరైరట! తలపై శశికళ శిశిరకాంతులు తాండవించె నట! కవి తనజీవితానుభవమును జెప్పుచున్నాడు. ఈ యద్వైతభావమును లోకమున నెంతమంది సాధింప గలరు? ఇచట నేను చెప్పినదానికన్న చెప్పని దెక్కువ. ఇటనుండి కవి గృహస్థుగా భాసించును. కవితా విషయమున సుండెదిటవు వచ్చినది. అతడు సూర్యుడు - ఆమె ప్రొద్దుపొడుపు పూవు. వారి పర స్పరాలోకన మధుర సుందరాపాంగ సూత్రములచేత అనిల పథములలో పృథివ్యాకాశములకు తేజోమయ ములైన ముళ్లు పడినవట!

ఆమె సుధాస్రవంతిక. తానామెను గలసిన చోటు సురుతే. అధిక మాత్రయగు తాను ప్రవహించుచుండగా నామె యేమాయెనో తెలియదట. తాను శారద స్వచ్ఛ విజ్ఞానమూర్తి—ఆమె తన యట్టడుగున నణగియున్న చిక్కని శ్యామ జంబాలమూర్తి. ఆమె కాన్పింపగు. సముద్రతీర కళికల బంగరు పచ్చ కంకులు వడలిన రాజనాల పైరులో నామె ముమ్మూర్తుల గాన్పించునట. ఆమె నిజస్వరూపము నకు వెదకి వెదకి విశ్వవస్త్వంతరములందు కనుగొనలేక చివర కాత్మకోటరమున నున్న సూక్ష్మాకృతిగ దెలిసికొన్నాడు.

'ఎపుడు నీ పాటలే నాలపించ లేదొ
రిపులుకొను నాదు హృదంతరమున యందు
నీ వియోగాగ్ని యపుడు—'

కవితా దయితల కిరువురకు సమానముగ నన్వయించును దీ మాట.

ఇట్లు వశిచిన కవి సాధన దేవి కృపాబలము నెఱిగినది.

నీ వనంత భావాలవై విశాల
భావ సామ్రాజ్య మేలుచున్నావు దేవి!
నీ కృప నదెంత భావమేనియును సుపరి
చితము యట్లుల దోచు, నా చిత్తవీథి

మరి ఈ సాధన ఫలమేమియని యాశంకించుకొని కవి యనుచున్నాడు.

నీ పయిన బాడినట్టి నా నిభృతగీతి
పాటయె పరమార్థ మూలైన దేవి
అందు ప్రత్యక్షరమ్ము నీ మందహాస
బాలచంద్రాతపములలో బ్రజ్వలించు.

దేవిని గురించిన యనంతభావనల దలపోతతో కనులు మూసిన కలత నిద్దురలో నామె యాకృతి ఇట్లు సాక్షాత్కరించినది:

పృథివి యంతయు నీ పాదపీఠముగను
సలవరిచి యనంతాకాశ మావహించి
అనిలవీచికా స్తంభిన మాచరించు—
నిన్ను సేవించుచుందు రగ్నివరుణులు.

భూతత్త్వము గలది మూలాధారము. వాయుతత్త్వము గలది యనాహతచక్రము. ఆకాశతత్త్వము గలది విశుద్ధము. జలతత్త్వము గలది మణిపూరకము. అగ్నితత్త్వము గలది స్వాధిష్ఠానతత్త్వము. వీని కన్నిటికి పైన సహస్రారమందున్న తల్లియే యిట్లు స్తుతింపబడినది.

## 3

ఈ కావ్యమున విశ్వనాథ దర్శించినది కులపాలికా ప్రణయము. ధర్మపుబాటున పెరిగి పూచి పండిన దా లత. ఆ పూల వాసనలే యాపండ్ల మధురిమలే ఈ కావ్యమున గుబాళించుచున్నవి.

విశ్వనాథ తీర్చిన ప్రణయము లోకము చాలన నడిచినది. అంతకంటె లోతైనది. లోకమున సర్వులకు సుసాధ్యమైనది. భార్య, గోవు, దైవము, ధర్మము మన కెందు దర్శన మిత్తురు. మన జీవితములకింత సన్నిహితముగనున్న ఈ ప్రణయమాధుర్యము మనురాతి మధురమనుటలో సందేహమేమి? ఆ తీర్చిన విధము నించుక చూతము.

లోకమున వివేకులవలె నాయనయు భార్యను గురించి మెడకు కట్టిన బండ యనుకొన్నాడు. అప్పటి కాయనకు తనపురాకృతి పుణ్య మింతయని తెలియదట!

అస్మదీయ పురాకృతమైన పుణ్య
మింతయని యిట్టిదని నాకు తెలుగబడని
వేళలో నీవు మత్కంఠ విదళన క్రి
యార్థ కల్పిత శిలవని యనుకొంటి.

ఇది యొక యుదాత్త మధురము చిత్తశుద్ధి విషయము. ఆనాట యనిపించుకొన్న ఇల్లాలి సౌభాగ్య సౌష్కల్యమునకు మేరలున్నవా?

ఆమె యపాంగరేఖా చలన్మందహాస వాహినీ తరంగాల నాతని గుండె చలించి ప్రేమ గీతములు వ్రాసినాడాయన. తామిరువురు కృష్ణలోని జమిలి నావలవంటివారట. ప్రణయభావావిష్టుడై కవి 'ఇరలక్ష్మీదయితు'డైన తన్నుదానె ప్రతిష్ఠించుకొని పూజించుకొనును!

ఆ ప్రణయమిట్లు సాగినది. అతడాకాశమువంటి వాడు. ఆమె పృథివి వంటిది. అతడు సాగరునివంటి వాడు. ఆమె సాధుజలసరిత్తు. వారి కలయికలోని యాతిని యాక్రమణము ఆమె ఒదుగుదల కవికి అందమైన నిశావేళ నూహకువచ్చును. ఇట్టి విలోచనార్ధ మీలన సౌఖ్యము లెన్నియో!

ఉండి యుండి తమ ప్రేమబంధమంత దృఢతరముగా నగుటకు కారణము వెదకినాడు కవి. ఆమె సౌందర్య శీలములాదిగా నెన్నియో చెప్పకో దలచి తోలుత తోలుతనె త్రోసిపుచ్చెనట! చివరకు దెలిసినది పసితనపునాటి పిత్రాజ్ఞ నెంచి జనని యను మతి గని విధేయమై తన యెడ యుండుటయే యని. కవి ఈ కావ్యమునందంతటను స్త్రీయాత్మనే గవేషించుచున్నాడు.

తమ వివాహాని కచ్చునోసిన జన్నియావును నియతభావుడై యొసలు నిమురుచు, నిత్యప్రసన్నముఖ దాని మూపు లెట్లో దాని పాలు పట్టినని తల

పోయును. పరస్పరము సేవించు తన ఇల్లాలిని అవును జూచి కవి ఏమనుచున్నాడో చూడుడు—

ఉజ్ఝితాఘ దివ్యమ్మూర్తులౌ మథియసంస్థ
లను బరస్పర సేవా విలాస నేత్రి
లను భవల్లితాపాంగ పయఃప్రవాహ
వీచికా సుఖస్తిమిత విలోచనుడను!

జీవితమున ప్రసన్నత శాంతి యనువానివలన గలుగు నానందను మరి జీవితో గలుగును? ఈ పద్యము గార్హస్థ్య ధర్మ నిర్వహణ పరాకాష్ఠలో గలుగు ప్రశాంతత నొడిచిపట్టినది. నాగరిక కృత్రిమజీవనులకు ఈ భావమునకు ఎంత దవ్వు!

కాక మలినభావ సమావృత జీవనులకీ యద్వైతజీవన సాధన సాధ్యపడు నేమో చూడుడు: కార్తీకమాసమున కలిసి యుపవాసములు చేసిరి. కాళ్ళు తూలిపోయినవి. సంధ్యాకాల నవాంబువు లాతని మేన గందనమువలె నైతిబడినవి. కన్నులు నిప్పులు గ్రక్కుచున్నట్లున్నవి. సహధర్మచారిణీకటాక్ష సంతాన లహరి శివశిరః ప్రదేశ కృతాభిషేకమువలె చల్లనైనట!

మరియొకసారి ఉషఃకాలమున చల్లగాలిలో నిద్రలేచి కృష్ణలో స్నానమాడి శివార్చన కుపవాసమూనిరి. ఆనాడాసంఖ్యముగ శివున కభిషేక విధి నిర్వర్తించినారు. కర్పూరహారతి పూనినారు దంపతులు. అప్పటి యా దంపతుల చరితార్థత యాయన నోటనే వినవలయును.

'ఆ మహాఖండ హారతియందు దీప్త
మైన యిలువేల్పు విశ్వేశ్వరాచ్ఛలింగ
మందు ప్రతిఫలించిన మన యాకృతులివి
అర్ధనారీశ్వరభ్రాంతి నావహించు'

అది యొక నిత్యప్రత్యగ్రమగు నద్వైత భావసాధన.

పత్నీ సాహచర్యమున ఆయన చిత్రములగు నూహల కెన్నింటికో సమాధానములు వెదకికొనును. నిర్భుక్తి చిక్కణమూర్తులగు నామెయు నిసువులు నిన్ని సుఖము లెట్లు దాగియున్నారనుకొనును. తమ ప్రేమ బలముచేత భవిష్యత్ప్రజా ప్రణయ చరితలు పాలింపవలెనని యూహించును. జీవనమార్గమున మలుపు మలుపున గాన్పించి నీవింతదూరము వచ్చితివని యామె చెప్పునట!

ప్రణయగీతములకు గూడ నామె యామోదముద్ర వలసినదే. దాని నొకసారి యరమూత కనులతో ననుమతించును. ఒకసారి మొగ్గలుగ కనులు మూసి నిద్రించును. అయినచో మరునాటివంకు దాని నాపవలసినదే—

ఇంక నొక్కచోగవి ధర్మాచరణవ్యగ్రుడు. భార్యతో నేమనుచున్నాడో చూడుడు.

పాలతి మనపెండ్లికట సాక్షిభూతుడైన
గార్హపత్యాగ్ని మఱల నా కరమువెంట
నక్షతలచేత హవ్యకవ్యములచేత
నర్చితుడు కానె లేద. యేమనగవలయు.

కాని యామె కారణముగా నీ దోషమంతయు దొలగినదట! ఎట్లు?

నీవు నా నుండె గదలించినావు దేవి!
దేవి! త్రితయ్యలను సర్వదేవతలును
అనభిహూతములు హవ్యకవ్యములుపొంది
నా యకర్మిష్ఠిత క్షమించినారు దేవి!

ఒక్కచో గవి కృతజ్ఞతా మూర్తియై భార్య నిట్లనును.

అతివ! ఈ కుండమూది నిత్యాగ్నిహోత్రి
నైన నాదు కర్మిష్ఠితకు సహాయ
పడెద వీ పాగపోయి నా పలిత నేత్ర
కోణములు జ్యోతులై వెలుంగు గృహలక్ష్మి!

ధర్మసంవలితమైన యిట్టి నైష్ఠిక జీవితమున గవి యెన్నో మధురానుభూతుల నెమకికొన్నాడు. పున్నమ నాటి వెన్నెలలో ప్రియురాలుపరచిన వెల్ల సెజ్జపై పరుండి కనులు మూసికొని యామెను తలుచుకొనును.

యాని వచనాని వయమతి
జల్పామః తాని జల్పతి జనోపి,
తాన్యేవ తేన ప్రజ
ల్పితాని హృదయం సుఖయంతి.

(గాథాసప్తశతి. 7-49)

ముగ్ధనాయికా పరముగ నీ మాటలెంత హార్దికమయములో! నాయక పరముగ పయిజెప్పిన మాటలు గల దయితా చింతన మంత మధురము.

చంద్రకలితమగు నాకాశము మబ్బుపట్టుట యెట్లున్నదనగా నల్లని తాను తన యురమున నాన్చిన ముఖముగల ప్రియురాలి నాక్రమించకొన్నట్లున్నదట.

ఈ కావ్యమునకు ప్రాణప్రదమైనది చిత్తశుద్ధి. కుహనాభావకల్పనమిందు లేదు. ఉన్నదంతయు నుదాత్తము గంభీరము. అధికారిభేదమునుబట్టి మధురమును. చాలని వారి కిది చాలదు.

విశ్వనాథ దర్శించిన ఈ కులపాలికా ప్రణయము ధర్మము నుపజీవించును. ఇహపరముల సాధించును. అద్వైతసిద్ధి దానిలక్ష్యము. తెలుగున అమలిన శృంగారము, భావకవుల ప్రణయము, కులపాలికా ప్రణయమునను మూడు మార్గములు. ఈ కులపాలికా ప్రణయమునకు విశ్వనాథ ప్రవర్తకుడని చెప్పవచ్చును. చిన్నతనపు ఈ రచనకంటె కరుణారసాంభోధి కేతనులైతిన 'వరలక్ష్మీ త్రిశతి' ఈ మార్గమున పతాక. వత్సలా సౌభద్రుల ప్రణయము నాయని సుబ్బారావుగారి కృతి. విశ్వనాథ ఈ కావ్యమున దానిని పేర్కొని వదలినాడు. 'సౌభద్రుని ప్రణయయాత్ర' మేల్పడిన వారి యెడదలో తలు ద్రవ్వను—ఈ మార్గమున సంయోగ శృంగారమునకిదియు విప్రలంభమునకు 'వరలక్ష్మీత్రిశతి'యు హృదయావర్జకములు. 'గిరికుమారుని ప్రేమగీతాల'కు దర్పణతుల్యమను ప్రశస్తిని చెప్పకొనవచ్చును.

# దులుపు బూజు

శ్రీ శ్రీరంగం నారాయణబాబు

కనుక
పాటలకారు గనుక,
మాకంఠము మరి మరి
మకరంద ఝరి,
మధుకర వనప్రియా మధురగీతి కాలహారి!

పిమ్మట
కష్టకాలపు వేసగి చెమ్మట!
తరువాత
మరిలేనె లేదు వరువాత!
అహోరాత్రు లదేపనిగ
వానకారు వలపోత!
బ్రతుకుటింటి మింటిపైన
కారుమొయిలు మసిపూత!

అందుచేత
మాకంఠము ఒకొకప్పుడు
చలిపిడుగుల చప్పుడు!
చల జ్వాల చ్చంచల అప్పుడప్పుడు!

కానరాదు నేడు ఋతువుకు
ఋతువుకు నడుమ నేల!
కనుక నేలేదు నారాయణ
బాబులకున్న శరద్వేళ!
వచ్చిపడెను ఒక్కసారి
హానమృత్యు ప్రతీహారి!
మ్రోడు సీతువు
పాడు తీతువు!
కంఠమిప్పుడు
చీకురాయి!
చీకటి నూయి!

అయితే నేడు కవితాకామినికే
వచ్చింది ఖాయిలా!
అసలు గూటిలోనుంచే అదృశ్య
మైందా కోయిలా?

కల్పనకిది కానిరోజు
కవి కంఠంలో పట్టింది బూజు!
కలదింకా నీ కొకరోజు, దులుపు బూజు!

అలవోకగా చెప్పినట్లున్న దీనియందు దధి కనబడదు. దీనిలోనున్న కూర్మము మన కైకగవ్యము.

అనంతరదశ యిట్లభివర్ణితమైనది. కృష్ణుడు మరి కొంత పెరిగెను. సంగడీండ్రు పలువురు కూడిరి. కేళీలోలసులై తన్ను పొదివికొని వారెప్పుడు తిరుగ బల్లిదుడై నెలెడల వాసిజొచ్చెను. ప్రేతలు తన్ను పట్టి తెచ్చి తల్లికి ఒప్పించు వరకున్న వెళ్ళినది. వేడికొని వెన్నలు తినవలసిన అగత్యము తీరెను. గడిదేరెను. నిండియున్న పనటులలో మూతులిడి పాలు నేయి పుక్కిలించి ఎల్లెడల నుమియును. దోయిలించి వదజల్లును. మంటి పాలొనర్చి త్రొక్కి తెలిగన్నుల మెఱుగులపేర తాండవించును. తిరుగబెట్టిన బానలలోని పెరుగులు మునునుండక తానే గిలకరించి మరుగులు గటుచు చేర్చిన వెన్నలు వలచినంత త్రోలి - ఆవల ఉక్కిపుడై బానలను ఉగులదన్నికొనుచు పోవును. క్షీరాంబుధి మథించి సురలకు అమృతసంతర్పణము చేసిన అట మొదలిడి ఆరంగాగిన పాలమీగడలు ఇకు గేల జేని తెచ్చి లీలారమ్యముగ చెచ్చెలులకు పెట్టును. తాను ఆరగించును. ఓలిగట్టిన ఉట్టలకరికి పెద్దపెద్ద బానలలోని వెన్నలు బాదికొని తినును ఉట్లు త్రెంచి బానలను ఉరుల ద్రోసి చెలులకు మూటవిడిచి ఆచటినుండి కనుమాటగును.

ఈ యల్లరియందును దిశాభేదము ననుసరించి శిల్ప భేదము కలదు. స్వేచ్ఛాపారణమునకు వెనుక శిష్ట గోరసములను వినియోగమునకు పనికిరాకుండ చేయుట- అందొకటి. కడవలపాలు పగుల పలుకు త్రాగి నీళ్ళు తెచ్చి అన్నింటనించును. అంత పెరుగు త్రోలి ఆవల బానఃనిండ ప్రాచి చల్లలుంచును. పేడలు కొని పోయి నిప్పులపాలు చేసి ఒండొండ మంటలు విగిడించును. పెరుగులో పాలు వెన్నలో పెరుగు చల్లలో వెన్న నేతిలో చల్లయులు కలుపును. ఇంకొకటి - గోరసాదియుతాలనునకే ఘాత కల్పించునది. తలుపులూడ్చి పెయ్యలనెల్ల తల్లులకు విడుచును. కొన్నింటిని పలుగపెల దోలును. దామెనకొయ్యలు పెఱికి పారవైచును. కావళ్ళ ఉట్లను వచ్చి త్రెంచును.

జీవనద్రవ్యములయందలి గాఢ సంగము సంస్కృతి నిమగ్నత కుపలక్షణము. ద్రవ్యహానికి ప్రాణహానికంటె ఎక్కువ శోకింతురు. ప్రాణులెల్లగాను ద్రవ్య నిష్ఠులను సంస్కృతి నిమగ్నులును. ద్రవ్యములయందు నిర్మమత్వమును శిక్షించుట పరమేశ్వరు కేళియందలి రహస్యము.

తాను పెరుగుచున్నది మందలో. మందవారి జీవనము గోరసములు. తత్పరిపాలనాభిని వేశ మేకూర్పెన వారు గోపికలు. వారి చిత్తములలో...జీవనాధారములైన గోరసములయందలి మమకారమునకును—తన యందలి ప్రీతికిని నడుమ పరమేశ్వరుడు స్పర్ధ యుదయింపచేసెను. పురుషులు ఉదాసీనులు. ఆ గోడెల్ల గోపికలకే పట్టినది. యశోదయొద్దకు వచ్చి గోపికలు కృష్ణుని చేని వికలితములైన తమ సంసార కథలెల్ల చెప్పకొని చివరికందరు ఏకవాక్యముగ నిట్లనిరి.

"అమ్మా! నీవే గారాబమైన కొడుకును కనలేదు. మా పశుమన్న పాటు చూడవు. చిన్నవాడని నమ్మి యిన్నకుండుటయా? ఎంత కలవారైన తగవు పాటింపరా! మేము పేదవారము. ఇంతటి పీడ పడినాము. మా కొలది కిదియే చాలును. దీవనవిమిములైన మాకింక బ్రతుకు తెరువేది? నీ కొడుకు కడుపులో ధూర్తము లున్నవి కొవలయును. ఇవి శిశువునకు అనువులు కావు. ఉన్న పాలములెల్ల నితడే పాడుపరచలేదుకదా! ఇదిగో! మేమీ పల్లెను విడ్చిపెట్టిపోవుచున్నాము. మంగు మా పశులని ఒకటి మిగిలియున్నచో మేమెచ్చటనైన ఎట్లైన బ్రతుక లేకపోముకదా! ఇంక నిర్విచారముగ నిచ్చట నీవును నీగారాబు కొడుకును ఒక్కరై యుండుడు."

యశోద వారికథలెల్ల విని ఒక్కొక్కరుగ వారిని సందిటిని అనునయించి "మీ నేరములెల్ల తీర్చెదను. మీరు లేక మాకు తెల్లవారుటెట్లు? ఆసురకృత్యము లివి ఈ శిశువు చేసెను చేయడు. ఇది నిజముల! మీరు అసత్యమాడితిరని యొప్పజాలము? ఇక చూచికొనుదును. ఇతనిచెట్లు శిక్షింతునో! నిర్విచారముగ మీరిండ్లకు పొండు." అని పంపెను.

ఇచ్చట భాగవతసందర్భమునకు హరివంశమునకు ఎంతో భేదమున్నది. ఈ రుకుమించిన కృష్ణుని వరోక్తులు లేవు. తేళ్ళను పట్టి కుట్టించుట, పాములను మీద వైచుట మున్నగునవి లేవు. హరివంశము మొత్తము మీద కృష్ణుడు మాటాడిన సందర్భములే మిక్కిలి కొలది. ఇందతని అల్లరి పాడికి సంబంధించినంతవరకే. భాగవతము చదివియున్నవారిది చదివినచో ఇందలి నాగరికత్వము ఔచిత్యము తెలియగలవు.

కొంచెంత నిందమోసిన కొడుకువంక తల్లి చూచెను. ఊరెల్ల ఒక్కటైవచ్చి నానావిధముల ఆడిపోసికొనిరి. లేక లేక కలిగి గంపెడులుగ పెంచి బ్రతికిన బిడ్డని కింత అరడియా! ఇన్ని మాటలాడిపోయిరి. తిరిగి చూచిన అందఱును చుట్టములే. కిల్లనికింత ఘోష తగులరాదనుకొనెను. అరడిపాలైన బాలునిపై తల్లి హృదయమునందలి ప్రథమ చిక్కిన జాలి. జాలి పాల కడలియై ఆమె హృదయమున పొంగెత్తెను. ఉత్తాలమైన ఆ సముద్రములో విశ్వంభరుడు శిశువై తేలియాడు చున్నచో, అతని అల్లరియును, ఊరిమాటలును అంగు అడుగంటెనను మాట చెప్పనేల? అచట మందయును లేదు. అల్లరియును లేదు. గోపికలును లేరు. పరిమిత మానవభావములనెల్ల కబళించి దేశకాలముల పొలిమేరలను దాటి అనంతపాత్సీరము వెల్లివిరిసెను. అది ఒక

సమాధికంటె సితి. అందు శిశువు తల్లి అయ్యెనో! తల్లి శిశువయ్యెనో!

మును జననీ స్తనంబులకు
  మోవఁ బ్రేఁగయి యున్న యట్టి యా
విన్నుతపయస్సు లన్నియును
  వేడుకతో గడుపార వారగిం
చిన ప్రియమంది నందసతి
  చెక్కులు నొక్కుచు మస్తకంబు మూ
ర్కొనుచును ముద్దులాడి మఱి
  కొండొక సేపునకున్ బ్రియంబునన్.

ఆ స్థితి విశిష్టమైనది. మంద గుర్తుకు వచ్చెను. గోపికలకు తానిచ్చిన మాట తలపున బాఱెను. ఊరిలో కృష్ణుని అల్లరి నానాటికి మితిమీఱి పోవుచున్నది. ఆమెకు శిక్షావసరము తోఁచెను.

'అయ్య గృహకును క్లేశించి.
వలువాతి లేచి నీదగు
కొఱగాముల నెల్ల దోచికొనఁబోయె దినం
బలుగుబడి ననియె నీపను
లఱాతివి నిన్ను నేమియన నేస్తా! సుతా!
విడిచిన నెప్పటిదని యా
గడములు చేసెదవు నిన్ను గాచుట మాకుం
గడు బ్రేఁగు దుర్జనునిల
దడయక రోలుకి మెయి ద్రోపు తగు మందెందుఁగ.

ఇంగు రమ్మనుచు మెత్తని జంకెతోడి బింకంబునం గొడుకుం గేలుపట్టి యమ్ముట్యాన దివిచికొనిపోయి పెఱ్ఱదామెన త్రాటంగొని శకటసమీపంబున బలితంబుగ ఱోల నుదరంబు బంధించి మున్న నిలుగోలచేతంగొని:

కదలిన మొత్తుదు నెచ్చట
గదలెదవ? వటు గఱగులాడ! కదలుము! యేజా
తెఱ నంచు.బోయి యిమ్ముల
మఱితి విజకుటుంబ కార్యముల దత్పరయై
యున్నంతి'—

అభిమర్శితములై కాని భస్మాకృతులగు దైవములు ప్రజ్వలితములు కావు. అట్టి అభిమర్శ అది రాత్రమునందు పూతనవలన జరిగినది. విరిక్తమైన వేళ శకటుని వలన జరిగినది. వారిద్దరు రాక్షసులు. రాక్షసు లభిమర్శించు స్తోమలును—అప్పటి ప్రజ్వలన స్వభావమును వేఱు. ఇది యట్లుకాదు. ఇచ్చట గోపికలు బంధుస్త్రీలు. యశోదతల్లి. వీరు ప్రాకృత భావవశంవదులై తనయందు శిశుత్వ భావన కలిగి యున్నన్ని నాళ్ళు శిశునిలీనమైన దైవమునందు కదలిక కలుగలేదు. నేడు కలిగినది. గర్భిత మహిమము లయిన శిశుక్రీడలకు తాళఁజాలక గోపికలు వచ్చి యశోదను రారాపుపెట్టిరి. ఆమె ఆత్మీయా సంభవతా బుద్ధిని ప్రవృద్ధమైన మమతాబంధనముతో బంధువుల మెచ్చుదలకు కుమారుని ప్రాకృత మార్గమున శిక్షించెను. భూమి ప్రీతి మందవాకిట నున్న జమిలిమద్దులు వేళ్ళతో పెళ్ళగిల్లి కూలెను. ఆ ధ్వని కుదిరిపడి పాలములలో నున్న గొల్లలెల్లరును వచ్చి కూడబడిరి. గోపిక లదిచూచి పఱతెంచి యశోదతో నిట్లనిరి.

'ఎక్కడి బిడ్డ! నీకు!
  నీటు లెంతయు గట్టడి వే యుగంబులన్
బొక్కడి జోటితో చలియ
  బుత్రుని బ్రాఁకుల గట్టు వాడు వా
రక్కట! కల్గరే! వినఁగ;
  వాఱడి బోరు కుమారు డేపునన్
మిక్కుటమైన బ్రాఁకులవి!
  మీద బడ వ్వడిదా చెడంగదుఁగ.
నేరుపు గలవనుచు నహం
కారమ్మున మిడిసిపడితి! క్రమ్మన జని బం
గారము బోలెడు కొడుకు ని
కేమాపున నైన బాపువి సంకటమున్'

అంతర దృష్టిని—శిశు ప్రశయము వలన ద్రవద్గతాభినివేశ విశ్లథలై క్షాళిత చిత్తవృత్తులైన గోపికల—యీ కరుణా క్రోశములో యశోదయొక్క మాతృత్వాహంకార మధిక్షేపింపబడుచున్నది. మానవభావపరిధిలో పాపనిపై నేరములు మోపి శిక్షింపచేసిన ఆత్మకృతమునకు ఈయుత్పాతము తమకు దైవ మొసగిన శిక్షగా గైకొని అనుతాప వహ్నిలో గోపికా హృదయ నవనీతములు క్రాగి యశోదాధిక్షేప రూపమున పరిమళించుచున్నవి. పొలములనుండి నందాది గోపకులును ఇండ్లనుండి యశోదాది గోపికలును మందవాకిలికి వచ్చి కలిసికొనిరి.

'కూలిన చెట్ల నడుమ మేఘచ్ఛాయ విద్యోతి శీతాంశు బింబమువలె అలోల లోచనముల సుధాసేచన కోమలకర మందస్మితానన మండలమున అగ్ర చూడా మండనము కదలియాడ ఉదర నిబద్ధోలూఖలము నీడ్చి కొనుచు నంద నందనుఁడు' కనబడెను.

నందుడు చేరబోయి కొడుకు కటుపునకు పెనచి యున్న కట్లు మెల్ల విప్పి ఎత్తుకొని 'ఇదియేమి చందంబు? ఈ బాలు నుదరంబు ఱోల నేల కట్టితివి? ఇంతదూర మెట్లీడ్చె? ఇమ్మహీరుహంబు లెప్పగిదిం గూలె?' అని నిజకళత్రమును ప్రశ్నించెను. అతని ప్రశ్నలు మూడు. మొదటిది బంధన నిమిత్తము. దానికి యశోదనుండి సమాధానము వచ్చినది. ఈ బాలుడు అంతఱోలు ఇంత దూర మెట్లీడ్చినన్నది అతని కాశ్చర్య స్థానము. మహీరుహ నిపాతమునకు హేతువున్న పొలము దస నతనిబుద్ధి ప్రసరింపదు. అతని ప్రమేయ పరిధిలో శిశువునకును చెట్లు కూలుటకును కార్యకారణ సంబంధ స్ఫురణయే లేదు. అది మనుష్యబుద్ధికి అవలి భూమి. అతని నివేదనకు లోనై పొసగిన అంశ మొక్కటియే. అది ఇంత దూరము ఱోటినీడ్చుట. కావున అది పరమాశ్చర్యము. ఉలూఖలాకర్షణ పర్యాప్తమైన కొడుకుబలమున కతడు హర్ష విస్మితుడయ్యెను.

# సమర్థుడు

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

"బి. ఏ. కాగానే ఏ రివిన్యూ డిపార్టుమెంటులోనో గుమాస్తాగా చేరవలసింది...పొరపాటున బి. యిడి. లో చేరాను. అనుభవిస్తున్నాను" అన్నాడు రాఘవయ్య ఒకసారి.

"మీరే అలా అంటే మేమెవరితో చెప్పుకోవాలి? మీరలా అంటారు గాని మీకు వచ్చిన లోటేమిటి? మీ కున్న పలుకుబడి, శక్తి సామర్థ్యాలు ఎవరికి ఉన్నయ్..."అంటూ రాజు ముఖస్తుతి ప్రారంభించాడు...బొత్తిగా వ్యక్తిత్వం లేనిరాజు...నాకు విసుగుపుట్టి అక్కడినుంచి తప్పుకున్నాను...కాని ఆ ముఖస్తుతి వట్టిదికాదని నాకూ తెలుసు. రాఘవయ్య సమర్థుడు, ఉపాయశాలి, బలవంతుడు...కాబట్టే అతనంటే నాకు అసహ్యం, భయం.

రాఘవయ్యకు యిరవై ఏళ్ల అనుభవం వుంది—ఒక ఉపాధ్యాయత్వంలోనే కాదు; లౌక్యంలో, ముందుకు నెట్టుకొని పోవటంలో, పనులు నెరవేర్చుకోవటంలో... అతనే రాజకీయాల్లో ప్రవేశించివుంటే తప్పకుండా యీపాటికి మంత్రిగానో, మాజీ మంత్రిగానో వుండేవాడు. సందేహంలేదు!

రాఘవయ్య మా స్కూల్లో ఫస్ట్ అసిస్టెంటు—అంటే హెడ్‌మాస్టరు తర్వాత హెడ్‌మాస్టరు. హెడ్‌మాస్టరుగారికే రాఘవయ్యను చూస్తే భయం. రాఘవయ్య మాత్రం ఆయనతో చాలా 'స్వేచ్ఛ'గా చనువుగా వుంటాడు. ఉపాధ్యాయవర్గంలో చాలామందికి రాఘవయ్యమీద భక్తి; నాకూ, నాలాంటివాళ్ళొకరిద్దరికీ మాత్రం అసహ్యం, కోపం; పైకి ఒప్పుకోకపోయినా లోపల తగనిభయం, ఎక్కడ మా కొంపలు తగల బెట్టేస్తాడోనని! మిగతావాళ్ళపట్ల రాఘవయ్య ఎలావున్నా, మా ఒకరిద్దరితో ముఖ్యంగా స్నేహపూర్వకంగా వుండాలని తన ఉద్దేశమైనట్లు ప్రవర్తిస్తాడు. తను ఏ కార్యంచేసినా, అందరిపొగడ్తలూ ఒకవైపు అలావుండగానే, ముఖ్యంగా మా అభిప్రాయాలకోసం తాపత్రయ పడటం మేము గమనిస్తూనేవుంటాము. అతనంటే మాకు పెద్దగా సద్భావంలేదనీ, గౌరవంలేదనీ ఎక్కడో అతని మనస్సులో ఒక చిన్న అనుమానం వుండివుండాలి; అందరినీ గెలిచిన తను మమ్మల్ని గెలిస్తే ఎంతబావుంటుందనీ, అందర్నీ గెలవటం ఒక ఎత్తు సులువుగా లొంగక తప్పించుకొనే మమ్మల్ని గెలవటం ఇంకొక ఎత్తు అనీ, ఏదో తెలిసీ తెలీని ఉద్రేకం బహుశా అతన్ని ప్రేరేపిస్తూవుండాలి. కాని అతని ప్రయత్నాలుమాత్రం సర్వథా వృథా అవుతూనే వచ్చాయి. అందుకు చాల కారణాలున్నాయి:

రాఘవయ్య గణితంలో బి. ఏ., బి. యిడి.; అదే అతను బోధించేవిషయంకూడా. కాని ఏడెనిమిదేళ్ల క్రితం అతను ప్రయివేటుగా తెలుగులో ఎం. ఏ. ప్యాసయ్యాడు. అప్పటినుంచీ తనకు తెలుగుమీద సర్వాధికారం (ఎవరూ యివ్వకుండానే) వచ్చిందని అతని భావన. అంతేకాదు, తెలుగులో కవిత్వం, ముఖ్యంగా నాటకాలు, వ్రాయగలశక్తి తనలో కుసుమించి, వికసిస్తూవుందనీ, ఆ పరిమళంతో తెలుగు జగత్తుని పులిమి పునీతం చెయ్యటం తన విధ్యుక్తధర్మమనీ అతని గాఢ విశ్వాసం...దాని తాలూకు ప్రభావం నామీదే ప్రసరిస్తూ వుంటుంది తరచు!

నాలుగేళ్ళయింది నేను తెలుగు బోధించటానికి నియమించబడి; తెలుగులో ట్యూషన్ చెప్పమని ఎవరూ నాదగ్గరకురారు. సాధారణంగా తెలుగులో పరీక్ష తప్పేవాళ్లు చాలతక్కువ; తప్పినా ట్యూషన్ కావాలనుకునేవాళ్లు మరీ అరుదుగావుంటారు. అలాంటిది నా అదృష్టం (!) నేను వచ్చిన రెండవ ఏడాది, నలుగురు స్కూలుఫైనలు తప్పిన విద్యార్థులు, ట్యూషన్‌కోసంవచ్చారు. వచ్చారో లేదో పదిరోజులు తిరక్కుండానే వెళ్లిపోయారుకూడా...అంటే రాఘవయ్యదగ్గర తెలుగు, లెక్కలుకూడా నేర్చుకోవటానికి వెళ్లిపోయారు! వెళ్లితేవెళ్ళారు, అందులో అన్యాయం ఏమీలేదు అనుకోవాలి...కాని వాళ్లు పరీక్ష నెగ్గటం మాత్రం తెలుగు నేర్చుకునికాదు ... రాఘవయ్యని

"చైత్రయాత్ర" పంపి, మార్కులు వేయించుకొని, కష్టంలేని సులభమార్గంలో 'ఉత్తీర్ణు'లయ్యారు!

రాఘవయ్య శక్తిసామర్థ్యాలు ఏమిటో నాకే విశదంగా అనుభవమైన తర్వాత నేనా మనిషిని ఎలా గౌరవించగలను? అతనంటే ఎలా భయపడకుండా వుండగలను?

రాఘవయ్య నన్ను చూడగానే చిరునవ్వు నవ్వుతాడు—"ఏమండీ శాస్త్రిల్లూ!...ఈ నాటకం కాస్త దిద్దిపెట్టవయ్యా! ఈసారి స్కూలు వార్షికోత్సవానికి వేయించక తప్పదని హెడ్‌మాస్టరుగారి ఆజ్ఞ! అయినా మీ అందరి పనులు నాతలమీద రుద్దటం ఆయన కిష్టం...ఏంచేసేది, మొహమాటం!... 'ఇది నా పనికాదు, తెలుగు మేష్టరుది' అని చెప్పలేక పోతున్నాను." అంటాడు. 'ఫరవాలేదు, మీ కంటేనా?' అని నా నోటినుండా వినాలని ఎదురుచూస్తాడు; కాని లాభం లేదు! ఇక ఆ నాటకం విషయంకూడా నేను దాన్ని నిజంగా దిద్దిపెట్టాలని అతని అభిప్రాయంకాదు. దాన్ని చదవమనీ, మెచ్చుకోమనీ, పొగడమనీ ఆదేశం! అది గ్రహించే, కిక్కురుమనకుండా తీసుకుని, రెండు రోజులతర్వాత భద్రంగా తిరిగి యిచ్చివేస్తాను; ముక్తసరిగా 'బాగుంది' అంటాను. ఏమిటి బాగుందో తెలుసుకోవాలని, నానోటిముత్యాలు రాల్చాలని తాపత్రయ పడతాడు మానవుడు!

ఒకసారి డి. యి. వో. గారొస్తే వెరైటీషో ఏర్పాటుచేశాము. మా హిందీ టీచరుకి మాతృభాష తెలుగుమీద చెప్పరాని అభిమానం. ఒక హాస్యనాటిక వ్రాసి, ప్రదర్శనానికి తయారుచేశాడు. అది నిజంగా బాగుంటుందని మేమందరూ అనుకున్నాము; స్టూడెంట్సుకూడా సరదాపడ్డారు. డి. యి. వో. గారు తను ఎనిమిదింటికి సరిగ్గాలేచి వెళ్లిపోతామని ముందేచెప్పారు.. ఇక చూడండి...రాఘవయ్యవ్రాసిన సోది నాటకమే ఎనిమిదిదాకా సాగింది. హిందీ టీచరు నాటకానికి ఛాన్సురాలేదు. డి. యి. వో. ఆవులిస్తూ కునికిపాట్లుపడి (అంతపెందలాడే నిద్రా?) 7-50 కే వెళ్తామని లేచారు. రాఘవయ్య ఏంచేశాడు?... నాటకాన్ని అలానే మధ్యలో ఆపుచేయించి, డి. యి. వో. గార్ని స్టేజిమీదికి రమ్మని ఆయనతో రంగంమధ్యనుంచుని ఫ్లాష్ కెమెరాతో ఫోటో తీయించుకుని మరీ పంపాడు! ఇక డి. యి. వో. ను మెప్పించదలుచుకున్న హిందీ టీచరు దిక్కులేకుండాపోయాడు.

రాఘవయ్యకు ముందుకు నెగ్గుకొని పోవటంలో అమోఘమైన ప్రతిభవుంది. ఆ మధ్య యూనివర్సిటీ సెనేట్‌కి రిజిష్టర్డ్ గ్రాడ్యుయేట్సు నియోజకవర్గం నుంచీ పోటీచెయ్యాలని సర్వసన్నాహాలుచేశాడు. కాని దైవం అనుకూలించలేదు, వెంట్రుకవాసిలో తప్పిపోయింది ఆ యోగం...డిస్ట్రిక్టు బోర్డువారు—ఈయనకు యూనివర్సిటీతో ప్రమేయం లేదనే కారణంతో ననుకుంటాను— అనుమతించలేదు. ఎటొచ్చీ మరి యీయన జిల్లాబోర్డు టీచరే కదా!

ఇప్పటికి ఏడాదినుంచీ రాఘవయ్యకు హెడ్‌మాస్టరుగా ప్రమోషన్ వస్తుందని అందరూ అనుకుంటున్నారు...అందులో ఆశ్చర్యం ఏమివుంటుంది? ఇంతకుపూర్వమే రాకపోవటమొక్కటే నిజంగా ఆశ్చర్యపడదగ్గ విషయమని అనుకున్నాను...

నాలుగైదురోజులుగా రాఘవయ్య కనిపించలేదు...బహుశా బోర్డు స్పెషల్ ఆఫీసర్ని, డి. యి. వో. గార్ని కలుసుకుని ఆర్డరు వేయించుకోడానికి వెళ్లివుంటాడని ఊహాగానంచేశాము. కాని, ఒక సినిమా నటుణ్ణి మా స్కూల్లో ప్రదర్శనకి ఆహ్వానించటానికి మద్రాసు వెళ్లాడని ఎవరో అన్నారు.

నిన్నటిరోజు మద్రాసునుంచి తిరిగివస్తాడని అందరూ ఎదురుచూశారు...రాలేదు...బహుశా ఆ సినిమానటుడు "రేపు ఒక్కరోజు మా ఆతిథ్యాన్ని స్వీకరించి వెళ్లండి రాఘవయ్యగారూ!" అన్నాడేమోలే, పాపం, ఎలా నిరాకరించగలడు మానవుడు! అనుకున్నాం.

ఇవాళ తెలిసింది...పిడుగులాంటి వార్త... రాఘవయ్యకు పక్షవాతం వచ్చింది, హాస్పిటల్లో చేర్చారు అని.

"నేను వెళ్లొచ్చానండి...మనిషి చాల దిగాలు పడిపోయాడు...సెలవుసంగతి చూడమని మీతో చెప్పమన్నాడండి" అన్నాడు రాజు హెడ్‌మాస్టరు గదిలో ప్రవేశించి...నే నక్కడేవున్నాను.

రాఘవయ్యకు పక్షవాతమా! అనుకున్నాను.

"పాపం!... రెండునెలలుగా మనోవ్యాధితో సతమత మవుతున్నాడు... 'ఎందుకయ్యా యింతబాధ పడతావు, వచ్చేప్రమోషన్ ఎప్పుడో వచ్చితీరుతుంది, ఏమిటీవ్యథ?' అంటే కూడా మనసుకు దార్ఢ్యం చిక్కింది కాదు!...మద్రాసుకు వెళ్తానని సెలవుపెట్టిన

వాడు వెళ్ళనే లేదు...ఈ నాలుగురోజులు యిల్లుకదల్లేదట...మనిషి ఇంతగా చెదిరిపోతాడని నేనెన్నడూ అనుకోలేదు"అని నిట్టూర్చారు హెడ్‌మాష్టరుగారు.

"ఏం జరిగిందండీ మేష్టారూ?" అన్నాను. రాఘవయ్యకు మనోవ్యాధి ఏమిటో నాకు బొత్తిగా అర్థంకాలేదు.

"ప్రమోషన్ వచ్చే ఆశ లేదని రెండు నెలలప్పుడు తెలిసింది...మొన్న, అంటే నాలుగురోజులప్పుడు రాఘవయ్య జూనియర్ సుబ్బారావుకి ఆ వేకన్సీ యిచ్చారు...ఇక దాన్తో రాఘవయ్య గుమ్మందాటి బయటకు రాలేదు." నా సందేహాలు తీరలేదు. కాని హెడ్‌మాష్టరుగార్ని గుచ్చి గుచ్చి ప్రశ్నించే తాహతు లేదు నాకు.

"వెళ్ళిచూచిరావాలి; మనమంతా వెళ్ళి ధైర్యం చెబితేగాని లాభంలేదు...పాపం పిల్లలుగలవాడు!" అన్నారు హెడ్‌మాష్టరు.

రాఘవయ్యకు ప్రమోషన్ రాలేదా! తను ప్రయత్నించికూడా సాధించలేకపోయాడా! ఆశ్చర్యంగావుంది! ఒకచేత్తోచేస్తే ఇంకోచేత్తో అనుభవిస్తారంటారు...కాని, ఇలా అనిపించిందో లేదో, మళ్ళీ ఏమైనా పక్షవాతం రావటంమాత్రం చాలఘోరం_ అనుకున్నాను. మనిషి ఎలాంటివాడైనా, అందుకు అతని పెళ్ళాంపిల్లలు శిక్షింపబడటం, అది ఊహింపరాని అన్యాయం కదా! రాఘవయ్యచాలమంది మనసు నొప్పించాడు; అయితే అన్యాయానికి, అవినీతికి ఎక్కడో ఒక అవధివుంది! ఇన్నాళ్ళకు ఆ శక్తిసామర్థ్యాలు బోర్లపడ్డాయన్నమాట!

ఆరునెలల్క్రితం తెలుగు సంస్కృతి సంఘంవారు నిర్వహించిన వ్యాసరచనపోటీలో నాకు బహుమతి రావటం, రాఘవయ్య రహస్యంగా పంపిన రచనకు బహుమతి రాకపోవటం—అది రాఘవయ్య మొదటి భంగపాటు..."నాకు తీరికలేక ఏమీ వ్రాసిపంపలేకపోయాననుకో!...ఎలాగైనా మన స్కూలుకే ఆ గౌరవం దక్కింది నీ మూలంగా...కంగ్రాచులేషన్స్, శాస్త్రుల్లూ!" అన్నాడు రాఘవయ్య, తన మామూలు చిరునవ్వులో. బహుమతి తనకురావాలని రాఘవయ్య తొక్కిన అడ్డదార్ల వివరాలన్నీ ఆ సంస్కృతిసంఘం తాలూకు మిత్రుడొకడు నాకు అప్పటికే తెలియజేశాడు. నిజం ఏమిటో ఎరిగున్న నాకు రాఘవయ్య బుకాయింపుమాటల ధోరణిలోని నటనకౌశలం ఆశ్చర్యాన్ని కలుగజేసింది. ఎలాంటి అపజయాలైనా, లోటుపాట్లైనా క్రమ్ముకుని రాగలశక్తి రాఘవయ్యలో ఏదోవుందని అనాడు గట్టిగా నమ్మాను!

అలాంటివాడు—చెట్టంతమనిషి—ప్రమోషన్ రాకపోవటంతో...మనోవ్యథతో...కుప్పకూలిపోతాడా?

"ఆఁ...మనోవ్యథ ఏమిటోయ్...ఆ మనిషికి డయాబెటిస్ ఎన్నాళ్ళనుంచో వుంది...ఈ మధ్య న్యూరాల్జియాతో బాధపడుతున్నాడు... అందువల్ల వచ్చిందికాని, పక్షవాతానికి, ప్రమోషన్‌కి సంబంధమేమిటి?" అన్నాడు సందేహంగా నా మిత్రుడు... రాఘవయ్యని అసహ్యించుకునే వారిలో ఒకడు.

"ఏది కారణమైనా, ఆ కుటుంబం సంగతి ఆలోచిస్తే దారుణమనిపిస్తోందోయ్...మనం ఒకసారి హాస్పిటలుకు వెళ్ళిరావాలి. ఏమంటావ్?" అన్నాను.

"అలాగేలే...శత్రువైనా ఆపదలోవున్నప్పుడు పరామర్శించటం మానవధర్మం...ఇంతకూ రాఘవయ్యంటే మన కిష్టంలేదుగాని, అతను మనకు శత్రువేం కాదుగా!" అన్నాడు మిత్రుడు.

హాస్పిటలుకి వెళ్ళాము.

తలగడలమధ్య, చలనం, చైతన్యం లేకుండా, మాసిన తెల్లటిగడ్డంతో నిస్సహాయుడుగా పడివున్న రాఘవయ్యను చూస్తే జాలివేసింది... గుర్తుపట్టాడు, భావమరది మేము వచ్చామని దగ్గరగావంగి చెప్పిన తర్వాత.

ఇప్పుడు కొంత స్పృహగావుందనీ, టెంపరేచర్ తగ్గిందనీ అన్నారు...కాని విపరీతమైన తలపోటు వుందట. "అంతా మనోవ్యథ...ఏంచెయ్యను చెప్పండి" అన్నాడు రాఘవయ్య భావమరది. డాక్టరూ అదే అన్నాడట! "మీరు ధైర్యంగా, ప్రశాంతంగావుంటే కొంతవరకు మళ్ళీ కోలుకునే అవకాశంవుంది!" అని రాఘవయ్యకు దగ్గరగావంగి, మేమూ అదేమాటలు చెప్పాము.

"మీకేమిటండీ లోటు? మీకు జరిగిన అన్యాయాన్నిగురించి యిప్పుడాలోచించటం దేనికి? అందువల్ల మీకు మీరే మరీ అన్యాయం చేసుకుంటున్నారు. మనసు మరల్చుకోండి...మీరు ధైర్యంగా, ఉత్సాహంగావుంటే ఆరోగ్యం కుదురుతుంది, అన్నీ చక్క—

బడుతాయి; ప్రమోషన్ మాత్రం రాక ఎక్కడికి పోతుంది?...ఇది మామూలు పక్షవాతంకాదు; మానసికమైన కారణాలవల్ల వచ్చిందంటున్నారు; భగవంతుడిమీద భారంవేసి ధైర్యంగావుండాలి...ముందు ఆలోచించటం మానుకోండి!"

"అన్యాయం... చేశారు... లాభంలేదు...నా పని..." అయిపోయింది అన్నట్లు తల ఆడించబోయి విఫలుడయ్యాడు రాఘవయ్య. మాటలు అస్పష్టంగా వున్నాయి.

"మేం వెళ్తాం...మళ్ళీ కలుసుకుంటాం" అని చెప్పగానే "ఏమో...మా వాళ్ళని...చూడండి" అని కళ్ళనీళ్లు పెట్టుకున్నాడు.

ప్రమోషన్ రాకపోవటంతో ఏమంత నష్టం వచ్చిందని రాఘవయ్య యిలా కూలిపోయాడో మాకు అర్థంకాలేదు...ట్యూషన్‌ల మూలంగా, మార్కులు వేయించేమూలంగా, హెడ్‌మాష్టరుజీతంకంటె చాల ఎక్కువే గడిస్తున్నాడు. హెడ్‌మాష్టరు పదవి వస్తే యీ రెండువిధాల డబ్బు గడించటం బహుశా వీలు కాకపోవచ్చుకూడా. కాబట్టి ఆర్థిక దృష్ట్యా, ప్రమోషన్ రాకపోవటంవల్ల, రాఘవయ్యకు నష్టమేమీలేదే!

మరి కారణమేమిటి?

యూనివర్సిటీ సెనేట్ ఎలెక్షన్లలో స్పెషల్ ఆఫీసరు బంధువొకాయనకి రాఘవయ్య ప్రత్యర్థి అవుతాడని అప్పుడు అనుమతి నిరాకరించారట; అందుమీద రాఘవయ్య ఆ వ్యక్తి ఓడిపోవటానికి బాగా కృషి చేశాడు. రాఘవయ్య యిలాచేశాడని స్పెషల్‌ఆఫీసరు, డి. యి. వో. కూడబలుక్కొని ప్రమోషన్ లేకుండా చేశారు. మార్కులువేయించే అలవాటుందనీ, ట్యూషన్‌లు చెబుతున్నాడనీ డి. యి. వో. వ్రాసిపెట్టాడట...కాని యిదంతా ఒకరిమీదొకరు ఎత్తుకుపైఎత్తు వేసే చదరంగం ఆటలాంటిది...ఎవరైనా సరే గెలుపు ఓటమి, రెండింటికీ సిద్ధంగావుండాలి... రాఘవయ్య మాత్రం ప్రమోషన్ విషయంలో తనకుతగిలిన దెబ్బకు తాళుకోలేకపోయాడు! ఎందువల్ల?

'పదవీ వ్యామోహం' అటువంటిది అంటే...అది అంతగా చావుబ్రతుకులకు ముడిపెట్టుకున్న విషయమా! ...నాకు నమ్మకం కలగటంలేదు! రాఘవయ్య జీవితమంతా ఒక్క 'హెడ్‌మాష్టరు గిరీ' అనే లక్ష్యం చుట్టూనే తిరిగిందా యిన్నాళ్ళూ? పోనీ అలానే అనుకున్నా, ఆ లక్ష్యసాధనలో ఆటంకం కలిగినప్పుడు దాన్ని తొలగించటానికి అతను చెయ్యవలసిన ప్రయత్నం ఏదీ? అతని తెలివీ, శక్తిసామర్థ్యాలు ఏమైపోయినట్లు?

రాఘవయ్య సమర్థుడు, బలవంతుడు, నీతి—అవినీతి అనే భయం అతనికిలేదు, ముందుకు పోవటానికి ఎన్ని సందుదార్లు అడ్డదార్లువున్నాయో అవన్నీ తెలుసు, తనకు ఎదురువచ్చిన వాళ్లెవరైనాసరే వాళ్ళ అంతు చూడగలడు—ఇదీ అతన్నిగురించి మాలో స్థిరపడిన అభిప్రాయం...కాని రాఘవయ్య ప్రస్తుత, పరిస్థితి అతను బలహీనుడు, పసిపిల్లవానికంటె బలహీనుడు, అని నిరూపణచేస్తోంది.

అవినీతి, అడ్డదార్లు అనేవి 'బలా'నికికాదు, 'బలహీనత'కే చిహ్నాలుకాబోలు! రాఘయ్యకు నిజంగా తెలుగులో పాండిత్యమూ, ప్రతిభా వుంటే, అతను మంచినాటకాలే వ్రాయగలిగితే, అతను విద్యార్థులకి బాగా చదువేచెప్పగలిగితే—తన బుకాయింపుతో, డిప్లొమసీతో, చిలనవ్వులో, సన్నాయి, యితర్లని బాన పెట్టే అవసరమే వుండేదికాదు కాబోలు! అతనిలో నిజంగా లోపించింది సామర్థ్యమే! ఇక ఆత్మవిశ్వాసం మాత్రం ఎలావస్తుంది? అంతే అనుకోవాలి, లేకపోతే మనిషి యిలా కుప్పకూలిపోతాడా?

*　　*　　*

రాఘవయ్య పోయాడని తెలిసింది.

ఒక్కొకసారి మనం గమనిస్తూనే వుంటాము... పసిపిల్లలు పెద్దవాళ్లగా నటించటం...బలప్రదర్శన చెయ్యటం...అలవిగాని పనుల్ని చెయ్యగలిగినట్లే ప్రయత్నించటం...చివరకు ఏ కుర్చీయో, ఊయో, తగిలితే చప్పున దతికిలబడి, పెద్దగా ఏడుపు లంకించుకోవటం...అప్పుడు ఎవరైనావచ్చి ఎత్తుకొని లాలించి, ఆ పసివాడికి వాని పసితనాన్ని రుజావు చేస్తేగాని ఓదార్పు అంటూవుండదు...రాఘవయ్యలాంటి వాళ్ళ వ్యక్తిత్వంయొక్క పసితనానికి దెబ్బతగిలినప్పుడు ఓదార్పు ఒక్క భగవంతుడే ప్రసాదించగలడు!

# మన వ్యవసాయ ప్రణాళికలు

శ్రీ బులుసు వేంకటసుబ్బారావు

గడచిన మూడునాలుగు దశాబ్దాల కాలంలోను మన దేశంలో పారిశ్రామిక పురోగమనం చురుకుగా సాగుతూన్నప్పటికీ, ఇదివరలో వ్యవసాయానికి కల ప్రాముఖ్యంమాత్రం తగ్గలేదు. మొత్తం జనాభాలో వ్యవసాయంపైన ఆధారపడే వారి శాతం దాదాపు నిలకడగానే ఉంది. కాబట్టి వ్యవసాయ ప్రణాళికల ప్రాముఖ్యంకూడ జాతీయార్థిక రంగంలో ఏమీ తగ్గలేదు. నిజానికి ఎక్కువౌతోందనే చెప్పాలి. విపరీతంగా పెరిగిపోతూన్న జనాభాకు మన వ్యవసాయదారుడు ఆహారం సరఫరాచేయలేక వెనుబడిపోతున్నాడు. ఆహారోత్పత్తి పరిమాణం పూర్వంకన్న అనేక సంస్కరణలవలన, ప్రభుత్వకృషివలన పెరుగుతూన్నప్పటికీ, జనాభా పెరుగుదల రేటుతో సమస్థితి నందుకొనలేకపోవడం వలన మన ఆహారధాన్యాలను విదేశాలనుండి దిగుమతి చేసికొనవలసిన అవశ్యకత ఏర్పడుతోంది. ఈ అధిక విదేశీమారక ద్రవ్యవ్యయంవలన మన ఆర్థిక ప్రణాళికలు అనుకున్నంత చురుకుగా సాగడంలేదు. ఇంతేకాక మన దేశంలో వ్యవసాయ ప్రణాళికలకు ప్రాముఖ్యం రావడానికి మరొక ప్రధానకారణం వ్యవసాయపు ధరల ప్రత్యేకత. ధరల అదుపు విషయంలో వ్యవసాయ రంగానికి పారిశ్రామిక రంగానికి చాల వ్యత్యాసం కనబడుతూంది. దీనికి కారణం పారిశ్రామిక వస్తువుల ధరలు చాలవరకు గిరాకీపై ఆధారపడుతూండగా వ్యవసాయవస్తువుల ధరలు ఆ విధంగా ఆధారపడకపోవడమే. పారిశ్రామికరంగంలో అధికసంఖ్యాకమైన వస్తువులవిషయంలో, సరఫరా తక్కువఅయి, ధరలు పెరిగిపోతూంటే ప్రజల గిరాకీతగ్గి దీర్ఘకాలికంగా సమస్థితి ఏర్పడుతుంది. కాని వ్యవసాయ వస్తువుల ధరల విషయంలో ఈసూత్రం వర్తించదు. ఉత్పత్తి తక్కువగా ఉన్నా, ఎక్కువగా ఉన్నా, గిరాకీ పరిమాణంమాత్రం దాదాపు స్థిరంగా ఉంటుంది. అనగా, ధరలు తక్కువగా ఉన్నాయని మనం ఇప్పుడు తినే అన్నం కన్న రెట్టింపు తినలేము! అలాగే ధరలు మండిపోతున్నాయని పూర్తిగా మానివేయలేము. బియ్యపు బస్తా పదిరూపాయిలైనా వందరూపాయిలైనా, మనం కొనుక్కు తీరవలసిందే! కాబట్టి ఆహారోత్పత్తి కొద్దిగా లోటువచ్చేసరికి హఠాత్తుగా ధరలు అన్ని హద్దులను దాటి తాళప్రమాణానికి లేచిపోతాయి. దాంతో మనదేశం లాంటి బీదదేశంలో ఆహారధాన్యాల ధరలు పెరిగినాకూడ ధాన్యపు సరసరా తరుగుతూనే ఉంటుందట. ఈ సూచన చేసినవారు సుప్రసిద్ధ మేధాశాలి అయిన అశోక మెహతా. ఆయనమాటలు పైకి విపరీతంగా కనబడినప్పటికి, పరమ సత్యాలు. ఏమంటే, ఇప్పటివరకు అధమ ధాన్యాలను తింటూ ఉత్కృష్ట ధాన్యాలను విక్రయిస్తున్న రైతు ధరలు ఎక్కువైతే ఉత్కృష్ట ధాన్యోత్పత్తిలో కొంతభాగంమాత్రమే విక్రయించినా పూర్వపు రాబడిరావడంవలన, తాను అధమ ధాన్యాలను మాని, ఉత్కృష్టధాన్యాలనే వాడి, మిగిలిన భాగాన్నిమాత్రమే విక్రయార్థం తీసుకవస్తాడు.

ఇట్టి క్లిష్టసమస్యలతో కూడుకున్న వ్యవసాయార్థికరంగంలో అభివృద్ధికి అతి విపులమైన ప్రణాళిక అవసరం. ప్రతిచిన్న అంశంపైన పూర్వాపరాలను అతి సూక్ష్మంగా పరిశీలన జరిపినపైన గాని అట్టి ప్రణాళిక సాధ్యంకాదు. ఎన్నో సంవత్సరాలు శ్రమించి, ఎంతోమంది నిపుణుల సలహాలను సేకరించి, పరిశోధనలుజరిపి, పరిశీలక సంఘాలను నియోగించి, తయారుచేసిన ప్రణాళికలుసైతం, తీరా ఆచరణలోనికి వచ్చేసరికి అర్థాంతరంగా అంతరించడం జరగవచ్చు. మన వ్యవసాయార్థిక ప్రణాళికలను పరిశీలన జరపడానికి, అందులో, ఇంత చిన్న వ్యాసంలో, చర్చించడానికికాదు. వాని ముఖ్య విభాగాలనుమాత్రంసర్తించి, కేవలంవిహంగమదృష్టితో చూడవలసి ఉంటుంది. కాబట్టి మన వ్యవసాయ ప్రణాళికలో ముఖ్యభాగాలైన ఈ క్రింది అంశాలను మనం పరిశీలనచేద్దాం. మొదటి అంశం: వ్యవసాయోత్పత్తి లక్ష్యాలు, అంచనాలు, ఫలితాలును. రెండవది: భూసంస్కరణముల పథకాలు. మూడవది: నీటిపారుదల సౌకర్యాలు. నాలుగవది: వ్యవసాయ పరపతి పథకాలు. అయిదవది: వ్యవసాయ వస్తువుల ధరల అదుపు

విధానాలు. పై విషయాలను స్థూలంగా పరిశీలనచేస్తే మన వ్యవసాయ అభివృద్ధిపథకాలను - తత్సానేక బాధకాలను ఒక్కసారి మననం చేసినట్లౌతుంది.

ప్రణాళికా లక్ష్యాలదృష్ట్యా, ప్రథమప్రణాళికలో వ్యవసాయరంగంలో మనం ఘనవిజయాన్ని సాధించామని ప్రభుత్వపక్షీయులు తెలుపుతున్నారు. ప్రథమ పంచవర్ష ప్రణాళిక ముఖ్య ఆశయాలలో వ్యవసాయోత్పత్తిలో అభివృద్ధి ఒకటి. ఈ ప్రణాళికలో అంత్య సంవత్సరాంతానికి ఆహారధాన్యాల ఉత్పత్తి లక్ష్యం 61.6 మిలియను టన్నులు. అయితే 1953-44 లోనే ఉత్పత్తి, లక్ష్యాన్ని దాటిపోయి 68. 7 మిలియను టన్నులైంది. అంటే ప్రణాళిక మూడవ సంవత్సరంలోనే అయిదుసంవత్సరాల లక్ష్యాన్ని 7.1 మిలియను టన్నుల అధిక ఉత్పత్తితో మించిపోయింది అసలు ఉత్పత్తి. కాని ఈ అత్యధికోత్పత్తి (68.7 మి. ట.) స్థిరంగాలేదు. మరుసటి సంవత్సరం అంటే 1954-55 లో 66.6 మిలియలుటన్నులకు, ఆ మరుసటి సంవత్సరం 1955-56 లో 65.3 మిలియను టన్నులకు పడిపోయింది. కాని మొత్తంమీద లక్ష్యాలను ఛేదించడమే కాక, ఉత్పత్తి బాగా అధికంకావడం చాలా ఘన విషయం. ఇదేవిధంగా ఆహారేతరములైన వాణిజ్యపుపంటలలోకూడ 1954 నాటికే లక్ష్యాలు సాధింపబడినాయి. ప్రత్తి ఉత్పత్తి 45% వృద్ధిఅయింది. చమురుగింజల ఉత్పత్తిలో 8% అభివృద్ధివచ్చింది. ఆహారోత్పత్తిలోని వృద్ధి 20%.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ఆఖరు సంవత్సరాంతానికి ఆహారధాన్యాలలో 75 మిలియను టన్నులు, చమురుగింజలలో 7 మిలియను టన్నులు, ప్రత్తిలో 5.5 మిలియను బేళ్లు, జనపనారలో ఐదు మిలియను బేళ్లు, పొగాకులో 2.5 లక్షల టన్నులు, టీలో 700 మిలియన్ల పౌండ్లు ఉత్పత్తి లక్ష్యాలుగా పెట్టుకొనబడ్డాయి. అనగా ఈ అయిదుసంవత్సరాల కాలానికి, ఆహారధాన్యాల ఉత్పత్తివిషయంలో 15%, చమురు గింజల ఉత్పత్తిలో 27%, ప్రత్తిలో 31%, జనపనారలో 25% అభివృద్ధి కాగలవు. తృతీయ పంచవర్ష ప్రణాళికాంతానికి దేశంలో ఆహారోత్పత్తి రెట్టింపు కావాలని లక్ష్యప్రాయంగా మనప్రభుత్వం పెట్టుకొన్నది.

అయితే, మనం పెట్టుకునే లక్ష్యాలకు, మనం వేసే అంచనాలకు, యథార్థంగా అవుతూన్న ఉత్పత్తికి చాల వ్యత్యాసం కనబడుతుంది. 1953-54 లో కలిగిన మహాభివృద్ధి కేవలం ప్రణాళిక కృషివలనేనని చెప్పడానికి వీలులేదు. మనదేశపు వ్యవసాయరంగంలో "పాటు, పోట్లన్నీ" ఋతు పవనాలమీద ఆధారపడిఉంటాయి. ఆ ప్రత్యేకసంవత్సరంలో మన వ్యవసాయదారులకు ప్రకృతిసహకారం విరివిగా లభించడం వల్లన ఆహారోత్పత్తి అత్యున్నత శిఖరాన్ని అందుకుంది. కాని తరువాతి రెండుసంవత్సరాలలో అది క్రమంగా దిగిపోయింది. తిరిగి 56-57 సంవత్సరాలలో ఉత్పత్తి బాగా పెంపొంది 68.7 మిలియన్ టన్నులకు పెరిగింది. ఈ పరిస్థితులలో ద్వితీయప్రణాళికాంతానికి మరొక 15 మిలియన్ టన్నుల అధికోత్పత్తి సాధ్యమౌతుందని భావించడంలో యదార్థత్వాన్ని నిర్ణయించడం కష్టం. ఉత్పత్తి అభివృద్ధివిషయంలో మన అదుపులో లేని శక్తులు అనేకం అర్థాంతరంగా వచ్చి మన అంచనాలను తారుమారు చేస్తూంటాయి.

వ్యవసాయరంగంలో భూ సంస్కరణలకు అధిక ప్రాధాన్యం ఉంది. ఏనాడో ప్రారంభింపబడినప్పటికీ మన దేశంలో భూ సంస్కరణల విషయంలో ఏమీ ఒక స్థిరాభిప్రాయం ఏర్పడినట్లు తోచదు. భూమి కమతాల పరిమాణానికి ఒక గరిష్ఠ పరిమితిని నిర్ణయించి, సాధ్యమైనంతవరకు రైతుకు, ప్రభుత్వానికి మధ్య పరాన్నభుక్కుల నందఱను తొలగించి, ఒక సమతను ఏర్పాటుచేయాలని మనవారిఆశయం. గరిష్ఠ పరిమితులను నిర్ణయించిన మీదట మిగులుభూమిని ఇంతవరకు భూమిలేని హాలికులకు పంచియిస్తామని తన ఎన్నికల ప్రణాళికలో కాంగ్రెసు ప్రభుత్వం హామీ ఇచ్చింది. అయితే మిగులుభూమి వంతను సమష్టి వ్యవసాయం క్రిందకు తీసుకొనిరావాలనే మరొక తీవ్రకాంక్ష కాంగ్రెసు పెద్దలలో బయలుదేరింది. సమష్టి వ్యవసాయం మనకు పనికిరాదని చెప్పిన పెద్దలంతా నిక్షేపంలా కాంగ్రెసును వదలి, తమదారి చూసుకోవచ్చునని మన ప్రణాళికా రథసారథి అయిన నెహ్రూగారు ప్రకటించారు. నెహ్రూగారి సదుద్దేశాన్ని అటుంచితే, ఆయన ఉద్యమాన్ని వ్యతిరేకించిన శ్రీయుతులు మున్షీ, రంగా, సంతానం ప్రభృతుల వాదంలోని ఔచిత్యం గోచరమౌతుంది. మార్చినెల భారతిలో సమష్టి వ్యవసాయం మనదేశానికి ఏవిధంగా అసమంజసమో విపులంగా చర్చించాము. రాజకీయ, సాంఘిక, ఆర్థిక శ్రేయస్సుదృష్ట్యా ఆ విధానం మనదేశానికి ఆచరణసాధ్యం

కాదు, అభిలషణీయం కాదు. అది నియంతృత్వ దేశాలకు మాత్రం సాధ్యమయ్యే విధానం. అయితే, రష్యాపాలకులకు ఆ మార్గం పూలమార్గంగా కనబడింది కనక మనం చేయకల్గినది ఏదీలేదు. అభియంకర్ నగర్ కాంగ్రెసు తీర్మానంప్రకారం 1959 సంవత్సరాంతానికి గరిష్ఠ కమతాలకు సంబంధించిన శాసనాలన్నీ ప్రతి రాష్ట్రంలోను ముగిసిపోవాలి. ప్రతిగ్రామంలోను వ్యవసాయరంగమంతా సమష్టిగా పాలనచేయబడాలి. అంటే అందరిభూములు ఒక క్షేత్రంగా సమైక్యపరుపబడి సభ్యులందరి సహకారంతో సాగుచేయబడతాయి. భూమిపై హక్కులమాత్రం ఏ మార్పులు లేక యథాతథంగానే ఉంటాయి. సమష్టి వ్యవసాయసంఘాల యందలి సభ్యులు రెండుతరగతులవారుంటారు. మొదటివారు భూములు కలిగి, వానిని సహకార క్షేత్రంలో లీనపరచినవారు. వీరికి సహకార వ్యవసాయఫలితంలో తమ వాటా భూమి ననుసరించి భాగం వస్తుంది. రెండవతరగతివారు భూమిలేని వ్యవసాయ శ్రామికులు. వీరికి వారి కృషి ననుసరించి ఫలితంలో భాగం లభిస్తుంది. అయితే గ్రామస్థులందరూ సహకార సంఘంలో చేరాలనే బలవంతంలేదు. విత్తనాల సరఫరా, నిపుణుల సలహా గైకొనే శక్తి, పరపతి సౌకర్యం, నూతనాలైన ఎరువుల పంపిణీ మొదలైన సౌలభ్యాలకొరకు అనేక గ్రామసహకార సంఘాలు కలసి ఒక సమితిగా ఏర్పడుతాయి. ఈ విధమైన సహకారసేద్యంవలన గ్రామంలో సఖ్యం, సమైక్యభావం, పరస్పర సహకారం ఏర్పడడమేగాక, భారీ వ్యవసాయంవలన కలిగే లాభాలు అనేకం కలుగుతాయి. చాలా పరిమాణంకల ఎరువుల నన్నింటినీ ఒక్కమారు కొనడంవలన రుసుము లభిస్తుంది. పరపతిని వాంఛించేది ఒక వ్యక్తికాక ఒకసంఘం కావడంవలన అది సునాయాసంగా లభిస్తుంది. రకరకాలైన వ్యవసాయపు ఇబ్బందులన్నీ ఒక్కనిమీదగాక సంఘంపైన వికేంద్రీకరింప బడతాయి. ట్రాక్టర్లు, ఎరువులు, నిపుణుల సలహాలు, పారుదల సౌకర్యాలు వగైరాలన్నీ కొల్లలు కొల్లలుగా లభించడంవలన ఉత్పత్తి బాగా పెరిగిపోయి ప్రతివాడికీ కడుపునిండా తిండి దొరకడమేకాక విదేశీయులకు ఉత్పత్తిచేసి మనకు కావలసిన వస్తుసంచయాన్ని ఇంకనూ దిగుమతిచేసికొన గలిగినశక్తి సామర్థ్యాలు ఏర్పడతాయి. ఇంతఎందుకు? ప్రతీగ్రామం ఒక చిన్నతరహా స్వర్గంక్రింద మారుతుంది. ఇదే భారతీయ భూ సంస్కరణల పరమావధి—అని అభయంకర్ నగర్ భూ సంస్కరణ ప్రణాళికావాదుల ఊహాచిత్రం. అయితే సహకార వ్యవసాయంవలన ఉత్పత్తి పెరగదనే విషయం అటుంచినా ఆచరణలో ఎన్నో ఇబ్బందులను ఎదుర్కొనవలసి వస్తుంది. ఈ ఇబ్బందులేమిటో, ఎందుకు ఎదుర్కొనవలసి వస్తుందో మొదలైన విషయాలనన్నింటిని నేను ఆ వ్యాసంలో పూర్తిగా వివరించాను.

భూ సంస్కరణల క్రిందకు వచ్చే మరొక ముఖ్య విషయం మనదేశంలో తరతరాలుగా ఏర్పడ్డ కౌలుపద్ధతి లేక కైవస్నీవిధానం. ఈ కౌలుపద్ధతివలన చాలా అరిష్టాలు ఉన్నాయని అందఱూ అంగీకరించారు. ప్రథమంగా కౌలుదారుకు (Tenant) యజమానికి ఈయవలసిన అద్దె ప్రమాణం. మనదేశంలో మొత్తంమీద సరాసరిని చూస్తే భూస్వామి కీయవలసిన పంటభాగం నూటికి ఏభై, అరవై వంతులవరకు ఉంది. ఈ అద్దె కొన్నిచోట్ల పంటలో భాగంగాను కొన్నిచోట్ల ఒక నిర్ణీతమైనవాటాగాను వసూలుచేయబడుతోంది. మొదటిపద్ధతి ప్రకారం కౌలుదారుకు ఎక్కువ పంటపండితే, భూస్వామికి కూడా ఎక్కువభాగం ఈయవలసి రావడంవలన, అతని ఉత్సాహం దెబ్బతింటుంది. రెండవపద్ధతిప్రకారం ఒక నిర్ణీతభాగం చెల్లించడంవలన, ఏ ఆవాంతరాలువచ్చి పంట నాశనమైనా, కౌలుదారుకు భూస్వామికి ఆ భాగాన్ని ఇచ్చితీరవలసిన విషమస్థితి ఏర్పడుతుంది. అద్దెవిషయం తరువాత, కౌలుదారుడు భూస్వామి క్రింద కేవలం ఒక కూలీగా ఉండవలసి వస్తుంది. భూస్వామి తన ఇష్టంవచ్చినప్పుడు కౌలుదారుని మార్చివేయవచ్చును. కాబట్టి కౌలు స్థిరత్వంపోయి అతడు అనేక కష్టనష్టాలకు గురికావలసివస్తుంది. ఈ దోషాలను తీసివేయడానికి భారతదేశంలో దాదాపు అన్ని రాష్ట్రాలయందు భూసంస్కరణలు జరిగాయి. చాలాచోట్ల ప్రభుత్వం న్యాయమైన అద్దె నిర్ణయించింది. ఇది సరాసరిన మొత్తం పంటలో నాలుగు లేక అయిదవ వంతుంటుంది. అదేవిధంగా కౌలు స్థిరత్వానికి అనేక శాసనాలు చేయబడ్డాయి. ఏమైనా, పెక్కుమంది భూ సంస్కరణ నిపుణులు తెలిపినట్లు మన రైతులు నిరక్షరకుక్షులు కావడంవలన ఈ సంస్కరణల విషయమే వారు పట్టించుకొనక భూస్వామి దాస్యంలోనే క్రుంగిపోతున్నారు. అందువలన ఈ కౌలువిధానానికి సంస్కరణకాక, పూర్ణంగా ఆ విధానాన్నే

మార్చివేసి, క్రమంగా దున్నేవానికే భూమిపంపకం జరగాలని అభిజ్ఞులు సూచించినారు. ఈ సందర్భాలలో భూమి కమతాలు మూడు తరగతులుగా విభక్తమైనాయి. మొదటిది కనీసపుపరిమాణంకల కమతం (Basic Holding). రెండవది కుటుంబపు కమతం (Family Holding). మూడవది వ్యక్తిగత కమతం (Individual Holding). మొదటిరకంలో కమతంపై ఒక కనీసపు పరిమితి నిర్ణయమవుతుంది. తత్ప్రకారం అంతకన్న చిన్నకమతం, ఆర్థికదృష్ట్యా సేద్యానికి నష్టకరమని, కాబట్టి అటువంటి చిన్నవాటి నన్నిటిని ఈ కనీసపు పరిమాణానికి తీసుకొనిరావాలని సంస్కర్తలఅభిలాష. రెండవది కుటుంబపు కమతం. అంటే ఒక రైతుకుటుంబమంతా శ్రమించి సేద్యంచేయడానికి తగిన కమతం. ఇది కృషినిర్ణీతమైనదైనా కావచ్చును, లేక దాని మూలంగా వచ్చే ధనాన్నిబట్టి. అయినా నిర్ణీతం కావచ్చును. మూడవది ఒక వ్యక్తి కృషిచేయడానికి తగిన పరిమితికలది. గరిష్ఠ కమతాలను నిర్ణయించడంలో సంస్కర్తలకు ఒక సందేహం జనించింది. గరిష్ఠ కమతం, కుటుంబకమతాల సంఖ్య నిర్ణయించాలా, వ్యక్తిగత కమతాల సంఖ్య నిర్ణయించాలా అని. ప్రణాళికాసంఘంచే నియుక్తమైన భూసంస్కరణ పరిశీలకసంఘం ఈ పరిమిత కుటుంబ కమతాల దృష్ట్యా నిర్ణయమవాలని తేల్చినారు. ఒక కుటుంబమంటే— భార్య, భర్త, తత్పోషణక్రిందే ఉన్న కుమారులు, కుమార్తెలు, మనుములు, మనుమరాళ్లు కలదిగా అసంఘసభ్యులచే నిర్వచించబడింది. అయితే కడపటికి, కుటుంబంపై విధించాలో, వ్యక్తిపై విధించాలో నిర్ణయించే అధికారం వివిధరాష్ట్రప్రభుత్వాలకే విడిచిపెట్టబడింది. అలాగే, కుటుంబ కమతపు పరిమాణం కూడ అనేక పరిస్థితులను పరిశీలించినమీదట నిర్ణయింపవలసినదిగా కేంద్రప్రభుత్వం, రాష్ట్రప్రభుత్వాలనాదేశించింది. గరిష్ఠపరిమితి మూడు కుటుంబ కమతాలుగ నిర్ణీతమైతే బాగుంటుందని సూచింపబడింది. పచ్చిక బీళ్ళు, చెరకుతోటలు, కాఫీ, టీ, రబ్బరు తోటలు మొదలైన కొన్ని క్షేత్రాలు ఈ గరిష్ఠపరిమితి నిర్ణాయక శాసనాలనుండి తొలగింపబడినాయి. గరిష్ఠ పరిమితుల నిర్ణయం పూర్తిఅయినతర్వాత–అంటే 1959 వ సంవత్సరాంతానికి, మిగులు భూములన్నీ సహకార సేద్యానికి సమ్మతించి, తదనుగుణంగా వ్యవహరించగలమని హామీ ఇచ్చే భూమిలేని రైతులకు పంచియివ్వడం జరుగుతుంది అనీ నిర్ణయం అయింది. అయితే అభయంకర్ నగర్ తీర్మానంప్రకారం, అవి రైతులకు ఇస్తారో, లేక సంఘాల అధీనంలోనే ఉంచుతారో మొదలైన విషయాలన్నీ ఇంకా స్పష్టపరుపబడలేదు. అయితే ఈ భూ సంస్కరణలన్నీ సహకార సేద్యంతో ముగుస్తాయనిమాత్రం స్పష్టమయింది. ఈలోగా కమతాలను స్థిరీకరించడానికి, గ్రామాభ్యుదయానికి, చిన్నతరహా నీటిపారుదల సౌకర్యాలకు, జాతీయ వికాస కార్యక్రమాలు (N. E. S.), సమాజాభివృద్ధి కేంద్రాలు చురుకుగా పనిచేస్తున్నాయి. మొత్తంమీద ఒక్కముక్కలో చెప్పాలంటే మన సంస్కరణల ప్రధానలోపం స్పష్టతలేక పోవడమే!

భూమిలేని వ్యవసాయకూలీల విషయంలేనిదే ఏ వ్యవసాయసంస్కరణ ప్రణాళికా సంపూర్ణం కాదనే చెప్పాలి. ప్రణాళికా సంఘపు అంచనాల ప్రకారం, మనదేశంలోని వ్యవసాయ శ్రామిక కుటుంబాలలో పదిహేనువంతులు భూ రహితమైనవి, ఇంకొక పదిహేను వంతులు చాలీచాలని భూవసతి కలవి. మన ఊహల నన్నింటిని మించి పెరిగిపోతున్న జనాభా ఈ సంఖ్యలను మరింత పెంపొందిస్తోంది. పది పదిహేను సంవత్సరాలలో వీరిసంఖ్య మరొక 33 మిలియన్లు పెరిగిపోగలదని అంచనా వేయబడింది. గ్రామీణ పరిశ్రమాభివృద్ధి, సమాజ వికాసాది కార్యక్రమాల వలన వీరికి ఇతర వృత్తులు కల్పింపబడతాయనీ, సహకారసేద్యం అమలు జరుగుతే వారి జీవనప్రమాణం పెంపొందగలదనీ ప్రణాళికాసంఘం సూచనచేసింది. అయితే ఈ సందర్భంలో జనించే ఒక్క సందేహం ఏమంటే సహకారకృషి నూతనవ్యవస్థలో భూ వసతికల శ్రామికుల స్థితి అసలు లేని కూలీలతో సమమాతుందేమోనని! అలాంటి దేమీ జరగదని, భూమిలేని కూలీలస్థితి, భూవసతికలవారి స్థితితో సమమాతుందని, సహకార సేద్యాభిలాషుల వాదన! ఏదైనా, సమత్వంమాత్రం సిద్ధిస్తుంది!

ఇక మూడవఅంశమైన నీటిపారుదల పథకాలను గురించి పరిశీలనచేద్దాం. మనదేశంలో నదులు బాగా ఎక్కువే అయినప్పటికీ మనం వాటి జలాలను వ్యవసాయ అభివృద్ధికి వినియోగించుకొనలేక పోతున్నాం. 1951 నాటికి నదీజలాలలో నూటికి అయిదున్నర పాళ్ళుమాత్రం మనం వ్యవసాయరంగానికి తరలించినాము. ప్రథమ పంచవర్ష ప్రణాళికాంతానికి మరొక 4.4 పాళ్ళను వినియోగింప కలిగినాము. ఒక్క

1950-51 సంవత్సరాంతానికి చిన్న, పెద్ద నీటిపారుదల పథకాలనుండి మొత్తం 51.5 మిలియన్ల ఎకరాలకు నీటివసతి ఏర్పాటైంది. అంటే మనకున్న వ్యవసాయ క్షేత్రంలో మొత్తం 16 వ వంతన్నమాట. ప్రథమ పంచవర్ష ప్రణాళికాంతానికి ఈ వసతి 51.5 మిలియన్ల ఎకరాలనుండి 67.8 మిలియన్ల ఎకరాలకు పెంపొందింది. ఈ మొత్తం 67.8 మిలియన్ల ఎకరాలలోను ప్రభుత్వపు కాలువలద్వారా 32.0 మిలియన్ల ఎకరాలు, స్వంత కాలువల ద్వారా 3.3 మిలియన్ల ఎకరాలు, చెరువుల మూలంగా 10.1 మిలియన్ల ఎకరాలు, బావులమూలంగా 16.4 మిలియన్ల ఎకరాలు, ఇతరత్రా 6.0 మిలియన్ల ఎకరాలు నీటిపారుదల సౌకర్యాలు పొందగలిగాయి. ద్వితీయ పంచవర్ష ప్రణాళికాంతానికి మరొక 21 మిలియన్ల ఎకరాలకు నీటి వసతి కల్పించాలని అంచనా వేశారు. దీనిలో 21 మిలియన్ల మధ్య తరగతి, పెద్ద, నీటిపారుదల పథకాల మూలకంగాను, మిగిలిన 9 మిలియన్లు చిన్న పథకాల ద్వారాను నీటి వసతి కల్పింపబడతాయి. పెద్ద పథకాల మూలంగా నీటి సౌకర్యం కల్పింపబడే 12 మిలియన్ల ఎకరాలలో 9 మిలియన్ల ఎకరాలు ప్రాజక్టుల మూలకంగాను, ఇతర 3 మిలియన్లు క్రొత్త ప్రాజక్టుల ఫలితంగాను నీటి సౌకర్యం పొందుతాయి. నీటి సౌకర్యానికి ద్వితీయ ప్రణాళికలో మొత్తం కేటాయింపు 380 కోట్ల రూపాయలు. అయితే ఆ కాలంలో రూ 172 కోట్లు మాత్రం వ్యయింపబడతాయి. సింధునదీజలాల వినియోగానికి రూ 35 కోట్లు, ప్రథమ పంచవర్ష ప్రణాళికలో తయారుచేయబడిన పథకాల వినియోగానికి రూ 209 కోట్లు వ్యయింపబడతాయి. అంటే మొత్తం ఖర్చు రూ 416 కోట్లు. ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో చిన్న, పెద్ద పథకాల మధ్య అభిలషణీయమైన సమతకొరకు కృషి చేయబడింది. మన వ్యవసాయ ప్రణాళికలలో చాలా నిరాతంకంగాను, విజయవంతంగాను నడపబడుతున్నవి నీటిపారుదల పథకాలు.

మన వ్యవసాయాభివృద్ధి ప్రణాళికలందు మరొక ముఖ్యమైన విభాగం వ్యవసాయదారులకు పరపతి విస్తరణ కార్యక్రమాలు (Agricultural Credit Development Programmes). మన వ్యవసాయదారులకు మూడు విధాలైన పరపతి కావలసి ఉంది. మొదటిది దీర్ఘకాలిక పరపతి (Long Term Credit). రెండవది అల్పకాలిక పరపతి (Short Term Credit). మూడవది అంత దీర్ఘము, అంత అల్పము కాని కాలానికి లభించవలసే పరపతి (Medium Term Credit). ఈ అవసరాలను పూర్వం చాలవరకు గ్రామీణులైన వడ్డీ వ్యాపారస్థులు (Village Money Lenders) తీర్చేవారు. అప్పులైతే విరివిగా ఇచ్చేవారు. కాని వీరు విధించే వడ్డీరేట్లు, చూపించే ప్రభావం, వీరికి చిన్న రైతుల నందరనూ కేవలం బానిసలనుగా చేసివేసింది. స్వతంత్రం రాక మునుపు, వచ్చిన తరువాత కూడా ఈ దోపిడీ దార్లని అణచడానికి, ప్రభుత్వం కృషిచేసింది. వడ్డీ రేటు 6¼% కంటె ఎన్నడూ మించరాదని శాసనం చేయబడింది. కాలక్రమాన వారి పలుకుబడి తగ్గిపోతూన్నప్పటికి, వారిస్థానంలో సులభంగాను, తక్కువ రేట్లకూ రైతులకు అప్పులిచ్చే మరొక సంస్థ ఆవశ్యకత ఏర్పడింది. అప్పటికి అంటే 1961 నాటికి సహకార సంఘాల ద్వారా కేవలం 3% మాత్రమే అప్పులుగా రైతులకు లభిస్తున్నాయి. 1904 లోనే స్థాపింపబడిన సహకార పరపతి సంఘాలు గ్రామీణ వ్యవసాయరంగానికి చెప్పుకోదగ్గ సేవ ఏమీ చేయలేకపోయాయి.

ఈ గ్రామీణ పరపతి పరిస్థితి నంతనూ అతి విపులంగా పరిశీలించిన మీా నట రిజర్వుబ్యాంకువారొక సమగ్ర నివేదికను తయారుచేసి 1954 లో ప్రభుత్వానికి సమర్పించినారు. వీరి నివేదిక ప్రకారం సహకార సంఘ సంస్థలే గ్రామీణ పరతి సౌలభ్యానికి మూలకందాలు. అయితే ఇంతవరకు అవి తమ కర్తవ్య నిర్వహణలో బాగా వెనుకంజ వేసినవి. ప్రాథమిక సంఘాలు అటు కేంద్ర సహకార బ్యాంకులవద్దనుండి, ఇటు రాష్ట్ర సహకార బ్యాంకులనుండీ కూడా ఉపకారం పొందలేక గ్రామాలలోని సంకుచిత రాజకీయాలలో నలిగి పోయాయి. పూర్వం రైతులకు అప్పులిచ్చి, వారిని పీడించి, వారి ఆస్తులను లాక్కొని నాశనంచేసిన పెద్దలే గ్రామీణ సహకార పరపతి సంఘాలకు నాయకత్వం వహించారు. దానితో ఈ సంఘాలఆశయాలే చెరచాయి. రైతులకు అటు ప్రభుత్వం, ఇటు వడ్డీ వ్యాపారస్తులు కూడ దూరమయారు. కాబట్టి దేశంలో సహకార పరపతి సంఘాల పునర్నిర్మాణం జరిగి ప్రభుత్వకృషి అధికతరం కావాలని ఈ నివేదిక సూచించింది. అనేక పరపతిసంఘాలమధ్య తక్కువ అమ్మకం–కొనుగోలు సంఘాల నడుమకూడ సహకారం పెంపొందాలని సూచించింది. ప్రాథమికసంఘాలు బాధ్యత (Liability) తగ్గివిస్తృతం కావాలని, జాతీయ, రాష్ట్ర

య వేర్ హౌసింగు సంఘాల సహకారంతో దేశమంతటా గోడౌన్లు, నిలవచేసే గృహాలు నిర్మింపబడాలని, సహకార సంఘంలో పనిచేసేవారికి తగినశిక్షణ ఇచ్చేందుకు ప్రత్యేకసంస్థలు నెలకొని, విరివిగా శిక్షణ ఈయబడాలని విజ్ఞప్తిచేసింది. అంతేకాక ఇంపీరియల్ బ్యాంకు ప్రభుత్వపరమై, విస్తృతశాఖలతో సహకార సంఘాలకు చేయూతగా ఉండవలెనని సూచించింది. రాష్ట్రీయ, సహకార పరపతి ధనాగారాలలోను, తనఖా బ్యాంకులందు, వాటికి యేభై ఒకవంతులు ప్రభుత్వపు వాటాతో పెట్టుబడి విస్తరించాలని అదే విధంగా ప్రభుత్వపుబ్యాంకుకూడా వాటాలను కలిగి ఉండాలని సలహా ఇచ్చింది. ఈ ధనసహకారానికి రిజర్వుబ్యాంకు జాతీయ వ్యవసాయిక పరపతి నిధి ద్వారా సహకార బ్యాంకులకు దీర్ఘకాలిక ఋణాల నొసగాలని, ఆ నిధికి ప్రథమంగా రిజర్వుబ్యాంకు ఐదు కోట్లు కేటాయించి, ప్రతిసంవత్సరం అంతే మొత్తాన్ని ఇస్తూండాలని సూచనచేసింది.

భారత ప్రభుత్వం ఈ సూచనలను దాదాపు పూర్తిగా అంగీకరించి తత్ప్రకారం గ్రామీణ పరపతి విస్తరణకు ఒకపథకాన్ని తయారుచేసింది. ప్రథమంగా ఇంపీరియల్ బ్యాంకు ప్రభుత్వ బ్యాంకుగా పరివర్తింపబడింది. 10 కోట్లు మూలధనంతో జాతీయ వ్యవసాయ పరపతినిధి ఏర్పరుపబడింది. దీనికి రిజర్వు బ్యాంకు ఏటా ఐదు కోట్లు ఇస్తూంటుంది. అవగా పంచవర్ష ప్రణాళికాంతానికి ఈనిధి 35 కోట్లవుతుంది. గ్రామీణ ప్రాంతాలలో మరి 400 శాఖలు స్థాపింపబడి ప్రభుత్వం బ్యాంకు వృద్ధిపొందుతుంది.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో గ్రామీణపరపతి విస్తరణకు మొత్తం 10,400 భారీ సహకార సంఘాలను, 1,800 క్రయ విక్రయ సంఘాలను, దేశమంతటా నెలకొల్పాలని, ఉన్న వాటిని సక్రమ విధానం క్రిందకు తీసుకొనిరావాలని, మొత్తం 350 నిలవవుంచే గృహాలను, 5,500 గోడవునులను నిర్మించాలని ప్రభుత్వం సంకల్పించింది. రాబోయేపంట సాధారంగా చేసుకొని రైతులకు ఋణసౌకర్యం చేయబడుతుంది. దీర్ఘకాలిక, అల్పకాలిక, మధ్యకాలిక ఋణాలకు 225 కోట్ల మొత్తం కేటాయింపబడింది.

ఈ భారీవిస్తరణ కార్యక్రమంలో అంతర్భూతమైయున్న విషయం ఒకటుంది. ఈ కార్యక్రమాన్ని అమలుజరుపుతూ ప్రణాళికా సంఘం పాటించిన విధానం ఒక్కొక్క గ్రామానికి ఒక్కొక్క సహకార సంఘం అనేపద్ధతికి విరుద్ధంగా 'అనేక గ్రామాలకు కలిపి ఒక పెద్దసహకార సంఘం' అన్నది. అంతవరకు అమలులోనున్న విధానం—అనగా ఒక్కొక్క గ్రామానికి ఒక్కొక్క సంఘం అన్న పద్ధతి అనభిలషణీయమైనదని ప్రణాళికా సంఘం పేర్కొంది. ఏమంటే, అది మన దేశంలో విజయవంతం కాలేదు. అటువంటి చిన్న సంఘాలలో సభ్యుల పరస్పర సహకారం వృద్ధిపొంది, గౌరవోద్యోగుల సేవఫలిస్తుందని అనుకున్న ఊహలు సరికావని, అందువల్లనే ఆ సంఘాలు మనకు పనికిరావని, ప్రణాళికా సంఘం తీర్మానించి, చాలా గ్రామాలకు కలిపి ఒక భారీసంఘం నెలకొల్పబడాలన్న సిద్ధాంతాన్ని బలపరచింది. ఈ సంఘాల పరిమితిని నిర్ణయిస్తూ కనీసపు సభ్యతా సంఖ్య 500, మూలధనం 15,000 ఉండాలని, సభ్యులబాధ్యత వారివారి వాటా పెట్టుబడులకు అయిదురెట్లుండాలని తెల్పింది.

ఐతే అందరినీ ఆశ్చర్యమగ్నులను కావించిన విషయమేమంటే గత నవంబరునెలలో జాతీయాభివృద్ధి సంఘం (National Development Council) క్రొత్తఢిల్లీలో సమావేశమై ఇంతవరకు అమలులోనున్న విధానం-అంటే చాలా గ్రామాలకు కలిపి ఒక పెద్ద సహకారసంఘం ఉండాలన్నది మన పరిస్థితులకు, అభివృద్ధికి అనభిలషణీయమైనదని, కాబట్టి దాన్ని తత్క్షణం వదలిపెట్టి 'ఒక్కొక్క గ్రామానికి ఒక్కొక్క సంఘం' అన్న విధానాన్ని అమలులో పెట్టాలని తీర్మానించింది! ఇది చాలా హఠాత్పరివర్తన. ఎన్నోవత్సరాల కఠిన కృషిమూలకంగా నిర్ణయింపబడిన విధానాన్ని మొదలంటా త్రుంచి, తిరిగి ప్రాతపద్ధతిని అవలంబించడం కష్టమైనపని. పోనీ ప్రస్తుతవిధానం అవలంబించడంవలన గత మూడుసంవత్సరాలలోను అభివృద్ధి జరగలేదా అంటే, అలాగనడానికి వీలులేదు. మొదటి రెండువత్సరాలు ఎన్నికలతోనూ, రాష్ట్ర పునర్వ్యవస్థీకరణతోనూ గడచినా, ఆ విధానంక్రింద చాలా అభివృద్ధి కనబడింది. 1956-58 లో మొత్తం 4,470 నూతన సంఘాలు ఏర్పాటైనాయి. 1,800 సంఘాలు స్థాపింపబడుతున్నాయి. అంటే ఈ రెండేళ్లలో 6,270 సంఘాలు నెలకొల్పబడినాయి. అయిదుసంవత్సరాలకు లక్ష్యంగా నిర్ణయింపబడినవి 10,400 సంఘాలు. 725 క్రయవిక్రయ సంఘాలు (లక్ష్యం-1800) నెలకొల్పబడినాయి. ఇవికాక 1950 గోడవునుల నిర్మాణం జరి

గింది. 1955-56 లో-అంటే ప్రథమ ప్రణాళిక అంత్య వత్సరంలో సరఫరాచేయబడిన మొత్తం పరపతి 53 కోట్లు. 1956-57 లో అది 5 కోట్లకు, మరుసటి వత్సరం 1957-58 లో 100 కోట్లకు పెరిగింది. 1958-59 లో ఈ పరపతి మొత్తం 140 కోట్లు. సభ్యులసంఖ్యలో కూడ ఇదేవిధమైన అభివృద్ధి ఉంది. ఈ విధంగా అన్ని అంశాలు తగినంత విజయం సంపాదించి నప్పటికీ ఆ విధానాన్ని త్రోసిరాజనడం చాలా ఆశ్చర్యకరమైన విషయం. వారి మనసులలో మెదులుతూన్న భయమల్లా ఒక్కటే- ఈ సంఘాలు బాగా విస్తృతాలై అత్యధికమై పోతాయేమోనని. ఉత్తర ప్రదేశ్ లో సగటున ఒక్కొక్క సంఘం 31 గ్రామాలకు, ఆంధ్రప్రదేశ్ లో 8.6 గ్రామాలకు, మద రాసులో 5.6 గ్రామాలకు, ఉత్కళలో 20 గ్రామాలకు, రాజస్థాన్ లో 20 గ్రామాలకు విస్తృతిమైయున్నాయి. ఇంతపెద్దవైతే ఏదో పెద్దవ్యాపార సంస్థలవలె ఉండడమే తప్ప పరస్పర సహకారానికి, సభ్యులనడుమ సమైక్యానికి తావుండదని వారివాదన. అయితే ఈ దోషాలను పోగొట్టడంకోసం విధానాన్నంతను పూర్తిగా మార్చివేయ నవసరంలేదు. ఆయా రాష్ట్రాలలో తగుమార్పులు గావిస్తే చాలును. ఏమైనా దీని విషయంలో పునఃపరిశీలన అవసరం.

ఇక మనం పరిశీలించవలసిన మరొక ముఖ్య విభాగం ఆహారధాన్యాల ధరల అదుపు విషయం. ఈ ఆహారధాన్యాలధరలకు జాతీయార్థిక రంగంపై ఎట్టి పటుతరప్రభావం కలదో ప్రారంభంలోనే పరిశీలించినాము. 1958 వ సంవత్సరపు ప్రారంభదశలో 2.74 మిలియను టన్నుల ఆహారధాన్యాలను భారతప్రభుత్వం దిగుమతిచేసింది. తరువాత ఆహారధాన్యాలను విరివిగా కొని లాభంపొందేవారికి—రిజర్వుబ్యాంకు ఋణాలియ్యడం బాగా తగ్గించింది. దేశానికంతకు ఆహారధాన్యాల ధరలవిషయంలో ఒడుదుడుకులు రాకుండా ఉండడానికి ఒక పెద్ద రిజర్వుఏర్పాటు చేయబడుతున్నది. తత్ప్రకారం సుమారు 10 కోట్ల విలువచేసే రెండు మిలియను టన్నుల ఆహారధాన్యాలు ప్రభుత్వంచే రైతులవద్దనుండి క్రయింపబడి, ఒక పెద్ద రిజర్వుగా ఏర్పాటుచేయబడతాయి.

ఆహారధాన్యాల క్రయవిక్రయ విషయంలో ప్రభుత్వ యాజమాన్యం (Sfate Trading in Food Grains) ధరలను చాలవరకు అదుపులోనికి తేవచ్చును. అయితే ఆ విధానంలోకూడ అనేక సాధక బాధకాలున్నాయి. ప్రభుత్వం వాణిజ్యం చేయడంలో నష్టాన్ని పొందవచ్చును. కొనేసరుకు నాణ్యాన్ని నిర్ణయించడమనేది ఒక పెద్దసమస్య. తరువాత దాన్ని నిలువచేయడం మరొకసమస్య. ప్రభుత్వ వ్యాపారంలో ఆహారధాన్యాల ధరలు ప్రభుత్వంచేతే స్థిరీకరింపబడుతాయి. కనక రైతులలో ఉత్సాహం నశిస్తుందని కొందరివాదన. అంత భారీ వ్యాపారంలో వ్యర్థంగా చాలా సొమ్ము నష్టమౌతుందని మరికొందరి వాదన. అయితే ప్రాథమిక దశలో కాకపోయినా క్రమంగానైనా ఆ విధానం అవలంబించడంవలన దేశీయార్థిక స్థితిలో ఒకవిధమైన స్థిరత ఏర్పడవచ్చును. అయితే ఈలోగా తాత్కాలికంగా ధరలను తగ్గించేదుకు వీలైన కట్టుబాట్లు చాలా అవసరం.

# లవంగీ జగన్నాథము

శ్రీ భట్టారం మల్లికార్జున కవి

విలువల్ గట్టగరాని మేలి సకిషీ విన్నాణముల్ నించు కెం
పులు దాపించిన చందువాలు నెఱసొంపుల్ గుల్కఁ, బన్నీటి చి
న్కులు సాంబ్రాణి పొగల్ బుగుల్కొనఁగ, నిగ్గుల్ దేఱు గందంపు బూ
తలు తావుల్ విరజిమ్ముచుండ మొగలాయ్ దర్బారు చెన్నొందెడున్.

విడుపు దోపసీని వేనవేల్ నీలాల
చెక్కడంపు బనుల నుక్కమీఱు
సింహపీఠమందు చెలువారె అక్బరు
సీలిమబ్బు మీఁద నెల విధాన.

కడలం గొల్వున అర్ధచంద్ర వలయాకారంబునం దీర్పగా
బడి యున్నట్టి మహాసనంబుల పయిన్ బంధుల్ సఖుల్ మంత్రు: లా
నడుమన్ చారుసువర్ణపీఠములపై నానా కళాసీమలన్
గడులన్ దాటిన మేటులున్ సభ కలంకారంబులై రమ్యెడన్.

తంబూరా జతియించి పంచమగతిన్ తాన్ సేను దర్బారి రా
గం బాలాపము సేయ, నచ్చటికి జింకల్ మేతలన్ మాని వ
చ్చెం బండల్ పులకించె మోళ్లు చివురించెన్; సభ్యు లవ్వేళ నే
త్రంబుల్ మూసిరి పారవశ్యమున నాదబ్రహ్మ లీనాత్ములై.

కట్టుం బొట్టును హైందవుం డగుట వక్కాణింపకే చెప్ప గ్రాం
బట్టుం దుప్పటి వల్లెవాటుల పయిం బాటాకు మైచాయ రా
కొట్టం బైడి మెఱుంగు, జవ్వనపు నిగ్గుల్ సీటులుం గూడి క
న్పట్టన్ మీనపుకట్టులో, సభకు శోభం గూర్చె నొక్కం డటన్.

సతతారాధిత శారదా చరణ పూజాసక్త సత్సాహితీ
వ్రతనిష్ణాతుడు, శాస్త్ర పారగుడునై, ప్రత్యర్థి మత్తేభ సం
హతి కంఠీరవుడై, కవీంద్రమకుటంబౌ ఆ జగన్నాథ పం
డితరాయండు రసాబ్ధి నిర్మథన శౌండీర్యాస్పదుం డాతడే.

లలితకళాభిమాని మొగలాయివిభుండు కవీంద్రవహాళి కం
జలి ఘటియించి యిట్లనియె "సత్కవితాశ్రవణోత్సుకుల్ సద
స్యులు — బహుభాషలన్ రసమయోక్తి చమత్కృతి గల్గినట్టి వా
రలు గద మీర — లీ యవసరంబున దీర్పుడు మా యభీష్టమున్."

అని అక్బర్ వినయంబు మీఱ బలుకన్ హాసాంకురశ్రేణి యా
నన సీమన్ దులకింపుచుండగ జగన్నాథుండు గంభీర గుం
భన శబ్దార్థరసాచితిప్రచురభావస్ఫోరక స్వీయ వా
గ్ధుని వీచీప్లవమాన హంసగతులన్ గూర్చెన్ సదస్యాళికిన్.

ఊఱుము వినిన వనమయూరాల చందాన
జెలగి రెల్లవారు గొలువునందు:
ఉర్వివిభుడు మాటి కుబ్బితలూగె ఆ
నందవార్ధి తరగలందు దేలి.

"సరసాలాపవిలాస విభ్రమ కళా సామ్రాజ్యలక్ష్మీ ధురం
ధరులౌ మీకు గజాశ్వ రత్న కలధౌత స్వర్ణ పీతాంబరా
భరణైక క్షితిపాలమాత్రుడను సంభావింపగా నేర నే
కరణిన్ సంస్కృతి సేయనౌనొ" అని అక్బర్ పాదుషా పల్కనన్.

"స్తంబేరంబులు ఘోటకంబులు మణుల్ సౌవర్ణభూషల్ దుకూ
లంబుల్ నాకొక లెక్కగావు నరపాలా! కమ్మ కస్తూరితో
గంబూరా వలపుల్ గుబుల్కొనెడు బాగాల్ రాగ మూరించు మేల్
తాంబూలంబు నొసంగుమా యదియె సత్కారంబు మాబోంట్లకున్.

"రసికుడైన కవికి రాచకొల్వులలోన
నింతకంటె నేమి యీయదగును
మావి చివురు గాక మధుని వేఱొక్కటి
కోరబోదు మత్తకోకిలంబు."

కవిచూడామణి పల్కులన్ విని రసజ్ఞశ్రేష్ఠుడైనట్టి య
య్యావనాధీశుడు కన్నునన్న నొక లావణ్యస్త్రీని రప్పించి "సీ
వవరోధంబున కేగి నేటి సభ వృత్తాంతంబులన్ రాణికిన్
సవిశేషంబుగ దెల్పి రమ్మ"నుచు నాజ్ఞాపించె దా నయ్యెడన్.

ఆటవెలది యరిగె నంతఃపురమునకు
మఱు నిమేషముననె మబ్బుమీద
మెఱుగు లట్లు వెల్గు తెరలపై బర్వెను,
ఘల్లుమనియె కాలిగజ్జె రవళి.

కుసుమ పూవుల రంగు కోక నెమ్మేనిపై నంజ కెంజాయల నవురు గూర్ప
చేర కొత్తకు మీఱి చెలువారు కందోయి కాటుకల్ మొలకచీకట్లు నింప
నడుముపై నటియించు నిడువాలు జడలోని విరిమల్లియల్ రిక్క వెల్గు లీన
చిఱునవ్వు గుంపులై చిందులాడెడు మోముపంపు వెన్నెల రుచుల్ నిండజేయ
రమణి రూపుగొన్న రాతిరి చందాన
జిలుగు తెరలదొలచి వెలికివచ్చె
మందయానవిజిత మత్తసారంగి క
టాక్ష జితకురంగి ఆ లవంగి.

సరస భోగయోగ్య సౌగంధ్య బంధుర
ద్రవ్య సంచయంబు దనరు నట్టి
వెండి పళ్లెరంబు పండితరాయని
ముందుబెట్టి నిల్చె సుందరాంగి.

తెలిదమ్మి పూవునకు బా
రులు దీరుచు పర్వులెత్తు రోలంబములన్
దలపించు వాలుజూపుల
కలభాషిణి కన్గొనెన్ జగన్నాథకవిన్.

మేలి గురాబీతావి గు
బాళింపుచు చలువ లెసగు పన్నీరంబున్
కాలాహివేణి సత్కవి
తాలంకారికుని మీద హాళిం జిల్కెన్.

రంగారు మంచిగందము
బంగారపు గిన్నెలో లవంగి యొసంగన్
శృంగారాభిజ్ఞుడతం
డంగంబుల నలదికొనియె నతిముద మొదవన్.

గుమగుమల్ గుప్పించు గొజ్జంగి పూనీటకడిగి తెల్లనియాకుమడుపుసుట్టి
బుగబుగల్ పూరించి జిగివెల్లువల్ నించు కర్పూరంపు బల్కుల గలయ గల్పి
కసటువో గరగించి గరగరల్ గావించు కస్తూరి పంకంబు గుస్తరించి
నిగనిగల్ నిండించు నాణిముత్తియంపు సున్నంబు నొక్కించుక నడుమ రాచి

ఏలకుల్ పోకలున్ లవంగాలు జాజి
పత్త్రిరియు చల్వమిరియాలు నత్తమిల్లి
కరయుగళ రత్నకంకణ క్వాణమెసగ
వీటిరొసగ లవంగీవధూటి కవికి.

తమ్ములమందియిచ్చు వనితామణికేల్ కవిరాజు స్వీయ హ
స్తమ్మున దాకినంతనె వసంత సమాగమ మాధవీ రసా
లమ్ములు పల్లవించెను విలాసములన్ దలపించు స్పర్శ సౌ
ఖ్యమ్మున సాంద్రసాత్త్వికములై తనరారె దదీయగాత్రముల్.

గగ్గురుపాటు మున్నెపుడు గాంచియెఱుంగని పూవపాయ మం
దగ్గలమైన సిగ్గు కడ లల్లన పాలగులాబిరంగు లే
బుగ్గలపై నటింప విరిబోణి తటాలున మోమువంచి యి
ల్లిగ్గులుగా నిలంబడె కవీంద్రున కించుక దూరదూరమై.

అత్తఱి నంతదాక తరళాయతలోచన మోముదమ్మిలో
నెత్తము లాడుచున్న యళి, నెవ్వన గుప్పను కమ్మగాడుపుల్
గొత్తగు తమ్ములంపుజిగి కోకనదభ్రమ గూర్ప, రాగ సం
పత్తికి మెచ్చెనో యనగ పండితరాయల మోవికైచనెన్.

పరభావజ్ఞుడు తానసేను చతురవ్యాహార మేపార అ
క్బరుతో నిట్లనె: "రాజచంద్ర! కవితావామాక్షితో నియ్యెడన్
హరిణీనేత్రి లవంగికిన్ సవతిపోరాటంబు గల్పించుటే
చరితార్థంబగునట్టి నేత — అదియే సామాజికాభీష్టమున్."

దరహాసం బిగురొత్త ఢిల్లిసులతాన్ "తానసేను డన్నట్టులే
జరుగుంగావుత — పద్మరాగమణికిన్ సౌవర్ణ సంయోగ వి
వరణిం గూర్చుట మేలు మే"లనియె: ఆస్థాని జగన్నాథుపై
సరసీజాస్య లవంగిపై గుఱిసె పుష్పవ్రాతముల్ జల్లులై.

# స్వాతంత్ర్యానంతర తమిళ సాహిత్యము

శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ

ప్రాచీన భారతీయ సాహిత్యమునకు మతము వెన్నెముక అనదగును. ఆ నాళ్ళలో సమాజమున మతమునకు విశేష ప్రాధాన్య ముండెను. కనుకనే మన ప్రాచీనకవుల రచనములలో ముక్కాలు మువ్వీసము పౌరాణిక గాథలే కానవచ్చుచున్నవి. నేటికిని పౌరాణిక గాథలు వ్యాప్తిలో ఉన్నవి. అయినను నేటి సమాజమున మతమునకు పూర్వ మున్నంత ప్రాధాన్యము లేదనుట సమంజసము.

కడమ భారతీయభాషలలోవలె, తమిళము నందును మతము నంటిపెట్టుకొనియే ప్రాచీన వాఙ్మయము వర్ధిల్లెను. తమిళ కావ్యపంచకము నందలి మణిమేకలై, కుండలకేశి కావ్యములు బౌద్ధమత పరములుగను, శిలప్పదికారం, జీవకచింతామణి కావ్యములు జైనమతపరములుగను పరిగణింపబడెను. సార్వకాలికము, సర్వజనీనము నగు తిరుక్కుఱళ్ గ్రంథమును రచియించిన తిరువళ్ళువరు జైనమతావలంబకుడనియు, కనుక అతని రచనమునందు అటనట జైనమతరహస్యములు కనబడుచున్నవనియు పండితులు కొందరు తలచుచున్నారు. శైవ వైష్ణవభక్తకవులగు నాయన్మారులు, ఆళ్వారులు మున్నగువారు వెలయించిన మధురమనోహర గీతములలో తాత్త్వికరహస్యములు అందాలు దిద్దుకొనెను. అటుపిమ్మట తమిళవాఙ్మయము రాజాశ్రయమును కోలుపోయెను. మఠాధిపతులు కొంత కాలము తమిళవాఙ్మయమును పోషించిరి. మరి కొన్నాళ్ళకు పాశ్చాత్యుల దొరతనముతోపాటు క్రైస్తవమతము కూడ మనదేశమున స్థిరపడుటతో తన్మత సంబంధమగు రచనలు కొన్ని వెలువడెను. అటులనే మహమ్మదీయ మతపరములయిన రచనలకును తమిళ సాహిత్యమున తావు లభించెను.

ప్రాచీన సాహిత్యమునకు వివిధమత సిద్ధాంతము లెటుల సహాయపడెనో, అటులనే ఆధునిక సాహిత్యమునకు కొంతవరకు వివిధ రాజకీయ పక్షముల సిద్ధాంతములు దోహదక్రియ లగుచున్నవని చెప్పవచ్చును. కాంగ్రెసు, కమ్యూనిస్టు మొదలగు పక్షముల సిద్ధాంతములను వ్యక్తీకరించు రచనలు నేటి భారతీయ భాషలన్నిటను కానవచ్చుచున్నవి. తమిళ సాహిత్యమునందు పై రాజకీయపక్షములకు సంబంధించిన రచనలే కాక ద్రావిడ కళగం (ద్రావిడ సంఘము), ద్రావిడ మున్నేట్ర కళగం (ద్రావిడ ప్రగతి సంఘము) మున్నగు సంఘములకు చెందిన రచయితల వ్రాతలు కూడ కొల్లలుగా గలవు. అందువలన ఆధునిక తమిళ సాహిత్యముపై వివిధ రాజకీయ పక్షముల ప్రభావము స్పష్టముగా గోచరించుచున్న దనుట నిర్వివాదము. ఈ కారణమును పురస్కరించుకొని కొందరు విమర్శకులు నేటి సాహిత్యమును ప్రచారసాహిత్యమని విమర్శింతురు. ఇట్లనుట సమంజసము కాదని నా యభిప్రాయము. ఏలయన మన ప్రాచీనాలంకారికులు నిర్వచించిన కావ్యప్రయోజనము వేరు; నేటి రచయిత లాశించు కావ్యప్రయోజనము వేరు. వారు స్వీకరించు యితివృత్తములు వేరు; వీరు స్వీకరించు కథలు వేరు. అటులనే భావములందును నాటి నేటి రచనలందు భేదము కనబడుచున్నది. కనుక కావ్యప్రయోజనమున దృష్టిభేద మెప్పు డేర్పడెనో అప్పుడే సాహిత్య చరిత్రలో మార్పు ఏర్పడెనని మన మూహింపవచ్చును. వివిధ సాహిత్య ప్రక్రియల ద్వారా సమాజశ్రేయస్సును సాధింపవలెనను మహత్తర కాంక్షయే నేటిరచయితల ప్రధాన లక్ష్యము. 'బహుజనహితాయ', 'బహుజనసుఖాయ' అనునవియే ఆధునిక కావ్యప్రయోజనము లనదగును.

రాజకీయపక్షముల ప్రభావము ఆధునిక తమిళ సాహిత్యముపై గోచరించుచున్నను, తమిళరచయితలకు తమ ప్రాచీన సంస్కృతియందును, చరిత్రయందును అపారమగు గౌరవము కలదు. స్వాతంత్ర్యానంతరము మన రచయితలకు ప్రాచీనాచార వ్యవహారము లందును, ప్రాచీన గాథలందునుగల గౌరవము ద్విగుణీకృత మయ్యెనని నుడువనగును. ఈవిషయము తమిళరచయితలకును వర్తించును. కాగా, ప్రాచీనసంస్కృతిలోని వైశిష్ట్యమును తెలియజేయు రచనలు, క్రొత్త

భావములలో చెప్పబడిన ప్రాతకాలపు కథలు మొదలగు నవి నేడు తమిళసాహిత్యమున స్థానము సంపాదించు చున్నవి. ప్రాచీనకాలమున వర్ధిల్లిన చేర చోళ పాండ్య మహీపతులు తమిళ భాషాభిమానులనియు, మహావీరులనియు, ధర్మప్రభావులంబు లనియు తిలచుట నేడు పరిపాటియైనది. కనుక స్వాతంత్ర్యము సిద్ధించినపిమ్మట మన ప్రాచీనసంస్కృతియందు విశేష గౌరవ మేర్పడుట మంచిదే కాని, యిది అతిగా పరిణమించుచో ఆధునిక సాహిత్యము సమకాలిక సామాజిక జీవనమును సరిగా చిత్రించజాలదు.

స్వాతంత్ర్యానంతరము ప్రచారమునకు వచ్చిన తమిళసాహిత్యము నవలోకించిన మరికొన్ని విషయములు కూడ తెలియవచ్చును. స్వభాషా సాహిత్యముల యందు ఆదరాభిమానములు కలుగుటతోపాటు, రచయితలకు అన్యభాషా సాహిత్యములను పరిశీలింప వలెనను విశాలభావముకూడ కలిగినది. ఇది యెంతయు కొండాడదగినది. స్వభాషాభిమానము అతిగా అతిశయించుచున్న యీ దినములలో అన్యభాషాపరిశీలన మెంతేని యవసరము. అట్లని రచయితలు అనువాద రచనములతోనే తృప్తిపడరాదు; సృజనాత్మక సాహిత్యమును సంతరించుటకు సన్నద్ధులు కావలెను. నేడు తమిళమున హిందీ, బెంగాలీ, మహారాష్ట్రము మొదలగుభాషలనుండి అనువాదగ్రంథము లెన్నియో వెలసినవి. కాని తెలుగు, కన్నడము, మలయాళము మున్నగు తోబుట్టుభాషలనుండి మాత్రము తమిళమున చెప్పదగిన అనువాద రచనలు వెలయకపోవుట చింత్యము!

స్వాతంత్ర్యానంతరము మదరాసు ప్రభుత్వము వారు ఆంధ్ర ద్రవిడ కర్ణాట మలయాళ భాషలందు ఆస్థానకవులను నియమించుట హర్షింపదగు విషయము. తమిళమున సుప్రసిద్ధ కవి, దేశభక్తుడునగు శ్రీ నామక్కల్ వె. రామలింగంపిళ్లై ఆస్థానకవిగా నియమితులయిరి. అంతేకాక మదరాసు ప్రభుత్వము శ్రీయుతులు పి. సంబంధం మొదలియారు, ము. వరద రాజన్ ప్రభృతులను గౌరవించి తన్ను తాను గౌరవించుకొనెను. మదరాసు విశ్వవిద్యాలయము వారు శ్రీ ఆర్. పి. సేతుపిళ్లైగారికి డాక్టరేటు నిచ్చి గౌరవించిరి. తమిళరచయితల సంఘము కూడ యథాశక్తిగ తమిళ రచయితలను గౌరవించుచున్నది. ఈ సందర్భమున కేంద్ర ప్రభుత్వమువారు దేశభాషారచయితల కిచ్చుచున్న ప్రోత్సాహము కూడ స్మరణీయమే.

1954-వ సంవత్సరమున కేంద్ర ప్రభుత్వము స్థాపించిన సాహిత్య అకాడమీ రాజ్యాంగమున పేర్కొనబడిన భారతీయ భాషల యభివృద్ధికి కృషి చేయుచున్నది. బహుముఖమైన కార్యక్రమమును నిర్వహించుటతోపాటు ఏటేట ఉత్తమ రచనలకు 5,000 రూపాయలు బహుమతు లొసగుచున్నవి. ఇంతవరకు ఈ క్రింది తమిళ గ్రంథములకు అకాడమీ బహుమతులు లభించినవి.

1. శ్రీ ఆర్. పి. సేతుపిళ్లై రచించిన తమిళిన్బం (సారస్వత వ్యాసావళి) 1955.

2. కీ. శే. 'కల్కి' రా. కృష్ణమూర్తి సంతరించిన అలై ఓసై (నవల) 1956.

3. శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులు వ్రాసిన చక్రవర్తి తిరుమగన్ (వచన రామాయణము) 1958.

దక్షిణభాషా పుస్తకసంస్థ కూడా తమిళభాషాభివృద్ధికి కృషిచేయుచున్నది. ఈ సంస్థ యాజమాన్యమున తమిళమున పెక్కు గ్రంథములు వెలువడెను.

తమిళ విజ్ఞాన సర్వస్వమును (కలైక్కళంజియం) తయారుచేయుచున్న తమిళ్ వళర్చిక్కళగమును (తమిళభాషాభివర్ధక సంఘము) గురించికూడ ప్రస్తావింప వలసి యున్నది. 1947-లో ఇది స్థాపింపబడెను. ఇప్పటికి విజ్ఞాన సర్వస్వము ఆరు సంపుటములు వెలుగులోనికి వచ్చినవి. ఈ సంఘమువారు కూడ ఏటేట ఉత్తమ రచనలకు 500 రూపాయల చొప్పున బహుమతు లిచ్చుచున్నారు.

ఈ నడుమ పుస్తక ప్రకాశకులు కొందరు చౌకధరలకు ఉత్తమ తమిళ రచనములను ప్రజల కందజేయుచున్నారు. ఇటుల వెలువడిన వానిలో తిరువాయ్ మొళి (వైష్ణవగ్రంథము), తిరువాచకం (శైవగ్రంథము), మణిమేకలై, సిలప్పదిగార కావ్యములు మున్నగునవి కలవు. వీనియందు విసంధి పాటింపబడుట గమనింపదగు నంశము. ఇంకను సుబ్రహ్మణ్య భారతి కావ్యములు, ప్రతాపముదలియార్ చరిత్రం, రాజాజీ 'వ్యాసర్ విరున్దు' వంటి యుద్గ్రంథములు కూడ చౌకధరలకు ప్రజల కందజేసిరి. సదుద్దేశముతో తలపెట్టబడిన యీ యుద్యమము విజయవంత మగుట

లోను, ప్రజాభిమానమును చూరగొనుటలోను ఆశ్చర్యము లేదు.

ఇటుల స్వాతంత్ర్యానంతరము కేంద్రరాష్ట్ర ప్రభుత్వములు, గ్రంథ ప్రకాశకులు, సంస్థలు తమిళ భాషాభివృద్ధికై కృషిచేయుచుండుట ప్రశంసార్హము. ఇక ఈ పండ్రెండు సంవత్సరములలోను ప్రచురింపబడిన కొన్ని ముఖ్య గ్రంథములను మాత్రము పరికింతము :

## కవిత :

భారతీయ సాహిత్య చరిత్రయందేకాక ప్రపంచ వాఙ్మయ చరిత్రయందును కవిత అతి ప్రాచీనమయిన సాహిత్య ప్రక్రియ. మొన మొన్నటివరకును కవులకు మాత్రమే సమాజము బ్రహ్మరథము పట్టుచుండెను. నేటికిని ఉత్తమకవితకు ప్రచుర ప్రచారము గలదు. కాని యీ నడుమ రచయితలకు ఛందస్సంప్రదాయములందు మోజు తగ్గుటవలననో, మరి యేకారణమువలననో వచనకవితలు వెలుగులోనికి వచ్చుచున్నవి.

నేడు తమిళమున వచనకవితలు పెక్కులు వెలువడుచున్నవి. అంతమాత్రమున సంప్రదాయబద్ధమయిన కవితారచన వాడుకలో లేదనుకొనరాదు. కాని ఒక్క విషయము నిశ్చయము. ప్రాచీన కావ్యములను తలపించు మహాకావ్యములు నేడంతగా వెలుగులోనికి వచ్చుటలేదు.

నేటి తమిళకవులలో శ్రీయుతులు నామక్కల్ వె. రామలింగంపిళ్ళై, శుద్ధానందభారతి, పెరియస్వామి తూరన్, 'సోము' (మి. ప. సోమసుందరం), కి. వా. జగన్నాథన్, భారతిదాసన్, త్రిలోక సీతారాం, శురైఅవన్ మున్నగువారు ప్రసిద్ధులు. తూరన్ 'ఇళం తమిళా' (1948, 136 పుటలు), కి. వా. జగన్నాథన్ 'మేఘమండలం' (1955, 120 పుటలు), భారతిదాసన్ కృతులు మున్నగు కవితాసంపుటములు పేర్కొనదగినవి. భారతిదాసన్ అభ్యుదయకవిగా గణింపబడుచున్నాడు. యువ రచయితలు పలువు రీతనిని అనుసరించుచున్నారు.

ఇటీవల సంకలనకావ్యములు కూడ వెలువడినవి. ఈ కోవకు చెందినవానిలో శ్రీ రా. పి. సేతుపిళ్ళై సంతరించిన 'సెంజొల్ కవిక్కోవై', శ్రీ త్రిలోక సీతారాం కూర్చిన 'పుదుప్పునల్ వెళియీడు' మొదలగునవి నుడువదగినవి. మొదటిది ప్రాచీన కవితాకదంబము; రెండవది నవ్యకవితా సంపుటము. తరతరాలవారి కవితలను చవిచూచుటకీ సంకలనగ్రంథములు తోడ్పడునను టలో సందేహము లేదు.

గేయఫణితిని శ్రీ కొత్తమంగలం సుబ్బు రచించిన 'గాంధి మహాన్‌కదై' (1947, 266 పుటలు) కూడ సంభావింపదగిన రచనమే.

## విమర్శ :

నేడు తమిళమున విమర్శగ్రంథము లనేకములు సంతరింపబడుచుండుట గమనింపదగు విషయము. ఉత్తమ విమర్శ కావ్య రసాస్వాదనమునకు మిక్కిలి తోడ్పడును. ముఖ్యముగా వ్యాఖ్యాసాపేక్షకములయిన ప్రాచీన కావ్యములకు చక్కని విమర్శ గ్రంథములు వెలువడవలెను.

తమిళ వేదమని వాసికెక్కిన తిరుక్కుఱళ్‌కు ప్రాచీనులు కొందరు చిక్కని, చక్కని వ్యాఖ్యానములు వెలయించిరి. అయినను, నేకుకూడ ఆయుద్గ్రంథమునకు క్రొత్త వ్యాఖ్యానములు రచింపబడుచున్నవి. అట్టివానిలో నామక్కల్ వె. రామలింగంపిళ్ళై 'తిరుక్కుఱళ్ పుదుఉరై' (1954, 850 పుటలు) ఎంతేని ప్రశంసింపదగినది. శ్రీ ము. వరదరాజన్ రచియించిన 'తిరువళ్లువర్' లేక 'వాళ్‌క్కై విళక్కం' (1948, 392 పుటలు) వళ్లువరును గూర్చిన సవిమర్శక గ్రంథము. తమిళ వేదకర్త వివరించిన జీవనవిధానమును తేటతెల్లము చేయు రచన యిది. శ్రీ టి. పి. మీనాక్షిసుందరంపిళ్ళై వ్రాసిన 'వళ్లువర్ కణ్డనాడుం, కామముం' గ్రంథమున (1954, 205 పుటలు) వళ్లువరు వర్ణించిన దేశము, చిత్రించిన ప్రేమయు వివరింపబడినవి. ఈ రచనలన్నియు తిరుక్కుఱళ్‌కు సంబంధించిన యుత్తమ విమర్శ గ్రంథము లనదగును. ఈ నడుమ ఒకరు వళ్లువరు జీవితము నాధారముచేసికొని ప్రశస్తమగు నొక బృహత్కావ్యమును రచియించిరి.

శ్రీ ఆర్. పి. సేతుపిళ్ళై తమిళసాహిత్యమును గూర్చియు, తమిళసంస్కృతినిగూర్చియు ప్రకటించిన వ్యాససంపుటి 'తమిళిన్బం' (1954, 265పుటలు) సాహిత్య రచనములలో నుడువదగినది. ఇందు 40 వ్యాసములు గలవు. శ్రీ టి. ఎ. సదాశివ పండారత్తార్ శితా

బ్దములవారీగా తమిళ సాహిత్య చరిత్రను వ్రాయుచున్నారు. ఇంతవరకు 16 శతాబ్దములచరిత్ర ప్రచురింపబడినది. శ్రీ యస్. రామస్వామి నాయుడు రచించిన తమిళిలక్కియం (1954, 185 పుటలు) కూడ తమిళ వాఙ్మయపరిశీలనకు తోడ్పడును. ఈ సందర్భమున శ్రీ మయిలై సీని వేంకటస్వామి రచించిన 'శమణముం తమిళుం' (1954, 236 పుటలు), 'బౌద్ధముంతమిళుం' 'కిఱిత్తువముం తమిళుం' మున్నగు గ్రంథములు పంభావింపదగినవి. వీనిలో జైన, బౌద్ధ, క్రైస్తవ మతానుయాయులు తమిళభాషావాఙ్మయములకు చేసినసేవ వివరింపబడినది. అటులనే తమిళ సాహిత్యమును సంపన్నము చేసిన మహమ్మదీయకవులను గూర్చిన గ్రంథముకూడ ఇటీవల ప్రచురింపబడెను. దీనిపేరు 'ముస్లిం తమిళ్ పులవర్ గళ్' (1957, 450 పుటలు). అబ్దుర్ రహీం అను ప్రసిద్ధ రచయిత దీనిని రచియించెను.

సాహిత్య విమర్శకు సంబంధించిన గ్రంథములు కూడ ఈ నడుమ వెలువడినవి. వీనిలో శ్రీ ఎ. యస్. జ్ఞానసంబంధము వ్రాసిన 'ఇలక్కియ కలై' (1953, 324 పుటలు), శ్రీ ము. వరదరాజన్ వ్రాసిన 'ఇలక్కియ త్తిఱన్' ప్రసిద్ధములు. ప్రాచీన తమిళ కావ్యములనుగూర్చి శ్రీ కి. వా. జగన్నాథన్ వెలయించిన తమిళ్ కాప్పియంగళ్ (1955, 280 పుటలు) చక్కని పరిశోధన గ్రంథములలో ఒకటి యనదగును. శ్రీ అ. శ్రీనివాసరాఘవన్ రచియించిన 'కావియ అరంగిల్' (1956, 225 పుటలు) కూడ పేర్కొనదగిన రచన. కంబ మహాకవి ప్రసాదించిన రామాయణమునందలి వైశిష్ట్యమును తెలియజేయు విమర్శగ్రంథమిది.

భాషాతత్త్వశాస్త్రమునకు సంబంధించిన గ్రంథములు కూడ ఇటీవల తమిళమున వెలువడెను. ఈ కోవకు చెందినవానిలో శ్రీ ము. వరదరాజన్ వ్రాసిన 'మొళివరలారు' (1954, 444 పుటలు). వీరిదే మరియొక రచనము 'మొళినూల్', కీ. శే. యస్. వైయాపురి పిళ్లై సంతరించిన 'సొల్ కలై విరున్దు' (1956, 183 పుటలు) మున్నగునవి ప్రశస్తరచనము లనదగును. ఇరువదవ శతాబ్దపు తమిళ వాఙ్మయమును — ముఖ్యముగా వచన వాఙ్మయమును — విశదీకరించు 'వళరుం తమిళ్' (1956, 408 పుటలు) అను గ్రంథమునుండి తమిళ వచన వాఙ్మయమునందలి తీరుతెన్నులను గ్రహింపవచ్చును. దీనికి కర్త శ్రీ 'సోమలె' (యస్. యమ్. యల్. లక్ష్మణన్ చెట్టియారు). మొత్తముమీద విమర్శ గ్రంథము లనేకములు స్వాతంత్ర్యానంతరము వెలువడెనని చెప్పదగును.

## నాటకము:

ఈనాడు నాటకములు, ఏకాంక నాటికలు, రేడియో నాటికలు పెక్కులు రచితము లగుచున్నను, వీనిలో ఉత్తమము లనదగినవి బహుళముగా లేవు. ఇతఃపూర్వము పేర్కొనినట్లు స్వాతంత్ర్యమునకు పిమ్మట చారిత్రక గాథలయందు అభిమానము అతిశయించుటచే సందర్భమున్నను లేకున్నను దేశాభిమానము, తమిళభాషాప్రశంస—మున్నగు విషయములను గురించి దీర్ఘములు, గంభీరములు నగు నుపన్యాసములను నాటకములందు చేర్చుట నాటక రచయితలకు పరిపాటియైనది. అయినను, అవ్వైయార్, రాజరాజ చోళన్ వంటి చారిత్రక నాటకములు, వేలైక్కారి, గుమాస్తావిన్ పెణ్ వంటి సాంఘిక నాటకములు మొదలగు వానికి తమిళ నాటక వాఙ్మయమునందు విశిష్టస్థానము గలదు. శ్రీ నారణ దురైక్కణ్ణన్ ('జీవా') వ్రాసిన 'ఉయిరోవియం' (1949, 186 పుటలు), శ్రీ కె. ఎ. పి. విశ్వనాథం వ్రాసిన 'తమిళ్ సెల్వం' (1955, 118 పుటలు), శ్రీ నామక్కల్. వె. రామలింగంపిళ్లై రచియించిన 'మామన్ మగళ్' (1954, 459 పుటలు) మున్నగునవికూడ చక్కని నాటకము లనదగును. ప్రస్తుతము దేశమును పీడించుచున్న ఆర్థికదుస్థితిని మనసునందుంచుకొని శ్రీ రామలింగంపిళ్లై మామన్ మగళును రచించుట మెచ్చుకొనదగిన విషయము. ధనికుడొకడు తన యావదాస్తిని బీదలకొసగి సర్వోదయసిద్ధాంత ప్రచారమునకు కడంగుటయే యీ నాటకమునందలి ప్రధానాంశము.

ఇంకను శ్రీయుతులు యస్. డి. సుందరం, సి. యన్. అణ్ణాదురై, ము. వరదరాజన్, తూరన్, అరు. రామనాథన్ ప్రభృతులు వ్రాసిన నాటకములు తమిళులను మిక్కిలిగా ఆకర్షించుచున్నవి. ముఖ్యముగా శ్రీ అణ్ణాదురై రచనలు గమనింపదగినవి. ద్రావిడప్రగతిసంఘ నాయకులైన వీరి రచనలలో రాజకీయాది విషయములకు ప్రముఖస్థానము గలదనుట నిర్వివాదము. అయినను, చెప్పదలచిన విషయమును

నూటిగా, శబ్దాలంకార సమన్వితమగు తమిళమున చెప్పుట వీరికి వెన్నతో పెట్టిన విద్యగా గోచరించును.

తమిళ నాటక పితామహు డనదగు శ్రీ పి. సంబంధముదలియారు ప్రస్తుతము వార్ధక్యముచే నాటకరచన చేయకున్నను, ఆధునిక నాటక వాఙ్మయమునకు ఆయన చేసిన సేవ కొండాడదగినది. సంగీత నాటక అకాడెమీవారు ఇటీవల వీరిని గౌరవించిరి.

## నవల:

ఒక్క తమిళ సాహిత్యమునందే కాక భారతీయ సాహిత్యమునందును నవల, నవలిక, కథ, కథానిక— వీనికిగల ప్రచారము మరి యేయితర సాహిత్య ప్రక్రియకును లేదు. పత్రికలు కూడ వీనికి ప్రాధాన్యమిచ్చుటతో వీని ప్రచారము ద్విగుణీకృతమయ్యె ననవచ్చును. గడచిన పండ్రెండు సంవత్సరములలోను పుస్తకరూపమున నైననేమి, పత్రికాముఖమున నైననేమి తమిళమున పెక్కు నవలలు, నవలికలు వెలసినవని స్థూలదృష్టికి కూడ గోచరించును.



కీ. శే. 'కల్కి' రా. కృష్ణమూర్తి వ్రాసిన అలైఓసై (1953, 828 పుటలు), పార్థిపన్ కనవు మున్నగు నవలలు, శ్రీయుతులు 'సోము' రచియించిన రవిచంద్రిక (1956, 520 పుటలు), ము. వరదరాజన్ వ్రాసిన సెంజిల్ ఒరుముళ్ (1956, 546 పుటలు), తి. జానకిరామన్ సంతరించిన మోహముళ్, 'అఖిలన్' వెలయించిన పావైవిళక్కు, సెంజిన్ అలైగళ్, ఆర్. వెంకటరామన్ వ్రాసిన అణైయావిళక్కు, ఇ. బాలకృష్ణ నాయుడు రచియించిన దనయక్కన్ కోట్టై (1955, 480 పుటలు) మున్నగు నవలలు బహుళ జనాదరమును చూరగొన్నవి.

ఇక కథాసంపుటములూ అనేకములు వెలువడుచున్నవి. కనుక కథా రచయితలుగా పేరుపెంపులు గడించిన కొందరినిమాత్ర మిట నుదాహరింతును. 'పుదుమైప్పిత్తన్' కు. ప. రాజగోపాలన్, న. పిచ్చమూర్తి, తి. జానకిరామన్, క. న. సుబ్రహ్మణ్యం, కి. అళగిరిస్వామి, తి. న. కుమారస్వామి, ల. స. రామామృతం, చిదంబర సుబ్రహ్మణ్యన్ మున్నగు వారెందరో చక్కనికథను వెలయించి తమిళకథా సాహిత్యమునకు వన్నెచిన్నెలు సమకూర్చినారు.

## ఇతరములు:

తమిళ సాహిత్యమున తొలియుగమయిన సంగ యుగమున వెలువడిన గ్రంథముల నాధారము చేసికొని శ్రీ కి. వా. జగన్నాథన్ ప్రశస్తములగు కథాసంపుటములు సంతరించుచున్నారు. కీ. శే. డా. టి. యస్. యస్. రాజన్ స్వీయచరిత్ర మగు 'నినైవు అలైగళ్' (1947, 894 పుటలు), ప్రాచీన రాజ్యాంగ విధానమును గురించి శ్రీ వె. స్వామినాథశర్మ వ్రాసిన 'పురాతన ఇందియావిల్ అరశియల్' (1954, 280 పుటలు), శ్రీ క. సంతానం కాళిదాసుని శాకుంతల మేఘదూతములకు చేసిన చక్కని యనువాద గ్రంథము, శ్రీ మ. పొ. శివజ్ఞానగ్రామణి రచియించిన వీర పాండ్య కట్టబొమ్మన్ (1949, 104 పుటలు) మున్నగు గ్రంథములు కూడ పేర్కొనదగినవి. తెల్లవారి దొరతనమునకు భరత వాక్యము చెప్పదలచిన కట్టబొమ్మన్ వీరచర్యని కమనీయగాథకు విశేషవ్యాప్తి కలుగజేసిన శ్రీ శివజ్ఞానగ్రామణి అభినందనీయులు.

ఇక శ్రీ రాజాజీగురించి పేర్కొనకున్నచో ఈవ్యాస మసమగ్రముగా నుండును. వీరి చక్రవర్తి

తిరుమురుగన్, వ్యాసర్ వితుద్దు వంటి యుత్తమరచనలీనడుమ ప్రచురప్రచారము గడించినవి. రాజాజీ వచనరచన ముఖ్యముగా పేర్కొనదగినది. నేటి పండితులు కొందరివలె ఈయన సుద్ధద్రావిడముచే గ్రంథములందుపయోగించవలెనని వాదించని సహృదయుడు. రాజాజీ వ్యావహారికభాషావాది. ఈనడుమ ఈయన బాలుర నుద్దేశించి వ్రాసిన నీతికథల సంపుటమును కర్ప్పైకొండు (కల్పనాటవి) ప్రశస్తమైన రచన అనవచ్చును. బాలవాఙ్మయమున కృషిచేయుచున్న శ్రీయుతు ఎ. యల్. వళ్లియప్ప, కల్వి గోపాలకృష్ణన్ ప్రభృతుల రచనలుకూడ గమనార్హములు.

సాహిత్యమనగా కథలు కాకరకాయలు మాత్రమే యనుభావము నేడు సనసన్నగా తొలగిపోవుచున్నది. ఆధునిక విజ్ఞానశాస్త్రమును గురించి మంచి రచనలు చేయవలెనను తలంపు మన రచయితలకు కలిగినది. కొందరు తమిళరచయితలు నిజముగానే ఉదాత్తరచనలు చేసిరి. 'కలైక్కదిర్' అను మాసపత్రిక యొకటి యిటీవల వెలుగులోనికి వచ్చినది. ఇందు కేవలము విజ్ఞానశాస్త్రమునకు సంబంధించిన విషయములే యుండుట ప్రశంసార్హము. కాని యీ పత్రికలోని భాషాశైలి వ్యావహారికమైయున్నచో ఇంకను లెస్సగనుండెడిది.

శ్రీ శివపాదసుందరం వ్రాసిన 'ఒలిపరప్పుక్కలై' శబ్దప్రసారమునకు సంబంధించిన ప్రశస్త రచన. ఇంకను శ్రీ పి. యన్. అప్పుస్వామి ప్రభృతులీతెగకు చెందిన రచనలు చేయుచున్నారు. శ్రీ ఎ. కె. చెట్టియార్ వ్రాసిన 'మలయాముదల్ కనడావరై' ఒక చక్కని ప్రయాణ గ్రంథము. ఈయన యిట్టివే మరికొన్ని రచనలుకూడ కావించిరి.

ఆధునిక సాహిత్య ప్రక్రియలను ప్రోత్సహించుచున్న పత్రికలను గురించికూడ రెండుమాటలు చెప్పుట సమంజసము. తమిళమున నేడు వెలువడుచున్న దిన, వార, పక్ష, మాస పత్రికల సంఖ్యను గమనించినచో తమిళులకు తమ భాషాసాహిత్యముల యందెంత మక్కువ కలదో ప్రత్యక్షమగును.

| | |
|---|---|
| దినపత్రికలు : | 20 |
| వారపత్రికలు : | 107 |
| మాసపత్రికలు : | 144 |
| ఇతరములు : | 62 |
| మొత్తము : | 333* |

తమిళులకంటె తెలుగువారమయిన మనము సంఖ్యలో ఎక్కువగా నున్నను తెలుగులో 145 పత్రికలే వెలువడుట చింత్యము. పత్రికాపఠనము మనదేశమున నింకను ప్రచురప్రచారము పొందలేదనుట నిశ్చయము!

ఉపసంహారమున, స్వాతంత్ర్యానంతరము మన దేశభాషలకు ప్రభుత్వాదరముతోపాటు ప్రజాదరము కూడ లభించినది. కాని విశ్వవిద్యాలయములందుమాత్ర మింకను దేశభాషలకు ప్రముఖస్థానము లభింపలేదు. ఏమయినను, ఆధునికయుగము విజ్ఞానశాస్త్రయుగమనియు, ప్రజాస్వామ్యయుగమనియు మన రచయితలు గుర్తించవలెను. లేకున్న ఆధునిక సాహిత్యము సమకాలిక సామాజిక జీవనమునకు దర్పణమై ప్రతిభాసింపజాలదు. ఈ దృష్టితో చూచినప్పుడు ఆధునిక భారతీయ సాహిత్యమున నింకను విజ్ఞానశాస్త్రమునకు సంబంధించిన రచనలు, ప్రజా సమస్యలను సజీవముగా చిత్రించు మేలిరచనలు బహుళముగా వెలువడవలెననుట సాహసము కాదు. ఈ విషయాదికము నేటి తమిళ సాహిత్యమునకును వర్తించును.

---

*ఈ వివరములు 1956 సం॥ డిసెంబరు 31 నాటివి. వివరములకు చూడుడు: Advertisers Vade mecum, P. 283.

# ప త్ర నా వ లు

"కృష్ణ మురళి"

దుఃఖా యాన్య సుఖం సుఖాయ చ పున ర్దుఃఖం పరేషాం పరం
సంతృప్తిః పరమాఢ్య చింతనవిధా నిర్లజ్జతా దుర్మతౌ,
ముగ్ధం శైశవ మాత్మ కేళిమధురం లోకార్థ మేత త్పునః
కామార్థ ప్రతిపత్తయే క్షణధియా భ్రష్టం వినష్టం కథమ్?

ఆయత మేఘమండల విహాయస మార్గమునన్ విచిత్రపుం
జాయలు నివ్వటిల్లు నెఱసంతతి కైకొనబోయి గూళ్లకై
యేమెడ జూచినం గలత నేగు విహంగము లంతిమ ప్రయా
ణాయతి వృద్ధముగ్ధ హృదయాంతర భావములట్లు తోచెడిన్.

నెమ్మది నూగి రేగి పయనించెను వాయువు నాల్గుదిక్కులన్
దిమ్మని ప్రాన్పడెన్ జగము నివ్వెఱగొల్పెడు గాలి వీవ డెం
దమ్మున నాశలన్నియు యథాయథలై వెనువడ్డ పక్షి సం
ఘమ్ముల నొందు రెండు నసుఖ ప్రతిరూపములై గమించినన్.

ఒక వచ్చిరాని చీకటి
వికటా భీలాంతరాళ విద్యోతిత కం
టకమై చనుదెంచెను సూ
ప్రకటిత సకల ప్రమాదభర భీకరమై.

కలకల లాడెడు సుమకో
మలవని ఝంఝా సమీర మందిత శోభా
విలమైన యట్లు ధరణీ
తలమెల్ల యెడల ననహాత దహతహ పడియెన్.

వాత వర్షమనుచు వాపోవ గొందఱు
విలయమనుచు గొంద ఱలసత గన
పారవశ్యమందు బాల బాలికలెల్ల
హాయి నుండి రింత యంతలోన.

గాలివేగము కొంచెము తూలిపోయె
ఘన ఘనారవ మింత కరగిపోయె
ప్రాణి హృదయాంతరాళ భీభరము వాసె
రోదసియు నించుక ప్రసన్న రుచిరమయ్యె.

చిటపట చిన్కుచప్పుడు విచిత్రలయన్ ధ్వనియింప మేఘ నం
ఘటన ఛటచ్ఛటారవ నికాయము మే మది క్షోభవెట్ట ని
స్తట జలవాయు నిస్వన విషాదము ఘూర్ణిలజేయ నొక్కరీ
తి టపటప ధ్వనుల్ వెలయ దీర్ఘములాడెను వానభూమిపై.

తెల్లవాకి వాఅమునుపె తీయగాలి తిన్నగా
నల్లవచ్చి దాగుమూత లాడి పూలతో వనిన్
బ్రల్లదంబులాడురీతి బ్రమద మొప్ప గ్రీడలం
దెల్ల బాల బాలికలకు నెంత విందో వానలో!

ధీరత యత్నించి త్వం
స్కారులమై విగళితాత్మ సహృదయ పరతన్
గూరిమి లౌకికమునకై
మారకముగ నీయ్రభీతి మాదు మనుజతన్!

ఇది మంచి యిదియు కెడుగని
మొదలో సర్వము నెఱుంగు నెల్లజనుడునున్
మొదటిది చేయడు; చేయక
వదలడు రెండవది మనుజ వర్తనమవురా!

ఆయత మోహరూప తరుణాతప పీడితనష్ట మాధురీ
హేయవిలాస శుష్కధృతిహీన మనక కుముదుండనై మెడన్
బాయక వాడు సంపదలు ప్రాయపు గోర్కులు నింద్రచాపశం
పాయుత మేఘబృంద పరిపాటి మెయిన్ గననోపనైతిగా.

చదువన్నెరనివారు ఘోర తిమిరస్థాత్యంధ లోకమ్ములం
దిద మిత్థమ్మనిలేని జీవనమునం దెక్కాల ముండంగ నా
చదువే సర్వమటంచు నెంచు జడు లత్యంతమ్ము నంధాంధమౌ
పదమందంగల రట్టె నేడె పరికింపన్ లక్ష్య మద్దానికిన్.

వాననీటిలో జిందులు వైచుచుండి
కాగితమ్ములను రకరకమ్ములైన
నావలుగ జేసి నీటిలో వైవదొడగి
పెక్కు లీలల నుండిరి పిల్లలపుడు.

కలిసి వచ్చినవాని కలిమిరీతిని బోలి
తలయెత్తి పోయెను ధన్యమొకటి
బ్రదికి చెడిన వాని భాగ్యమ్ము పోలెను
నీటి పాలయ్యెను నెట్టనొకటి
కలిమి యెక్కువయైన కామకలన పోలె
మొదలు తుదియులేక మునిగె నొకటి
పేదబ్రతుకు లోని భీదసుఖము పోలె
నూగిసలాడుచు నేగె నొకటి

లోక జనులవోలె లోలత్వముల తోడ
మిడిసి పాటుతోడ గడిమితోడ
దర్పమదము లెసగ దంద్రమ్యమాణముల్
నావ లిట్లు పోయె నేవిధముల.

జీవితసార సర్వలవ సేకరణైక విధిప్రసక్త మ
ద్భావ పరంపరాస్మృతి యుదాత్తగుణ స్ఫురణావిరోధియా
త్రోవను గ్రుడ్డిపోయెను మదోద్ధురతన్ గడు రిక్తపోయితిన్
నా వయసెల్ల మాటుపడె నావలరీతిని కాలవాహినిన్.

ఈ సంసార మహాప్రవాహమిది యిట్లున్నెల్లగా నొక్కొ వ
ర్షా సాయం సమయాతివేగ గతి ధారాప్రాప్త రథ్యావిధిన్
వేసాగున్ మఱి చిత్రచిత్రగతులన్ వేద్యంబు నింతైన నే
నీ సంపాదన చేయలేక జనులున్ వే పోదురో నావలై.

# 'వక్షోముఖాంగేషు' చింత్యమా?

శ్రీ శ్రీనివాస సోదరులు

శ్రీ వాణీ గిరిజా శ్చిరాయ దధతో
వక్షో ముఖాంగేషు యే
లోకానాం స్థితి మావహం త్యవిహతాం
స్త్రీపుంసయోగోద్భవాం,
తే వేదత్రయమూర్తయ స్త్రీపురుషాః
సంపూజితా వస్సురైః
భూయాసుః పురుషోత్తమాంబుజభవ
శ్రీకంధరాః శ్రేయసే.

అష్టభాషావాగనుశాసన బిరుదాంచితుడైన నన్నయభట్టారకుడు మహాభారతంలో కృత్యాదిని రచించిన శ్లోక మిది. ఇందులో 'వక్షోముఖాంగేషు' అన్న సమాసం చింత్యమని నేటి కొందరు వైయాకరణుల మతం. నేటి వైయాకరణులని ప్రత్యేకంగా ఎందుకన్నామంటే ఆంధ్రభోజుడైన రాజరాజనరేంద్రుని మహాస్థానంలో నానాదేశాగత విద్వద్వరేణ్యులు ఆనాడు తప్పుపట్టివుండరనీ, తప్పుపట్టినా వాగనుశాసనుడు వారి అనుమానాలు వారించివుంటాడనీ తోస్తున్నది గనుక. ఇందు కాధారం ఏమిటంటే ఆశ్లోకం కృత్యాదిని ఈనాటివరకూ యథాస్థితంగా నిలిచి ఉండటమే. నిజంగా తప్పేఅయితే అవిశృంఖల విహారులైన ఆనాటి విద్వల్లోకంలో అది బ్రతికివుండ దనటానికి సందేహం లేదు.

ఏమిటి యిందులో దోషం?—అంటే యిది "ద్వంద్వశ్చ ప్రాణితూర్యసేనాంగానాం" (పాణి. 2-4-2) అనే సూత్రానికి విరుద్ధం. ప్రాణ్యంగాలకు ప్రాణ్యంగాలతోనూ, తూర్యాంగాలకు తూర్యాంగాలతోనూ, సేనాంగాలకు సేనాంగాలతోనూ చేసే ద్వంద్వసమాసం ఏకవచనంలోనే వుంటుంది; "స నపుంసకం" (పాణి. 2-4-17) అనే సూత్రం ప్రకారం నపుంసకలింగ మౌతుంది. "ప్రాణ్యంగానాం ద్వంద్వ ఏకవ ద్భవతి. తథా తూర్యాంగానాం, సేనాంగానాం చ. ప్రాణ్యంగానాం తావత్ పాణిపాదం, శిరోగ్రీవం. తూర్యాంగానాం మార్దంగిక పాణవికం, వీణావాదకపరివాదకం. సేనాంగానాం రథికాశ్వారోహం, రథికపాదాతం" (కాశికావృత్తి 2-4-2). అని పైసూత్రానికి వివరణం చెప్పబడింది. కనుక ప్రాణ్యంగాలైన వక్షస్సు, ముఖం, అంగం అనేవాటికి సమాసం చేసినప్పుడు ఏకవద్భావం, నపుంసకలింగమూ ప్రాప్తిస్తవి. కనుక 'వక్షోముఖాంగే' అని ప్రయోగించవలసివుంటుంది. సాహసికులైన కొందరు పండితులిలా దిద్దటానికి వెనుదీయరుకూడాను.

పైగా, ప్రాణ్యంగాలకు సమాహారమందే ద్వంద్వసమాసం వస్తుందనీ, ఇతరేతరయోగద్వంద్వం రాదనీ, కాశికాకారుడు విస్పష్టంగా వ్రాశాడు. "ఇతరేతరయోగే సమాహారే చ ద్వంద్వో విహితః. తత్ర సమాహారస్యైకత్వా త్సిద్ధమే వైకవచనం. ఇదం తు ప్రకరణవిషయవిభాగార్థం. ప్రాణ్యంగానాం సమాహార ఏవ ద్వంద్వః. దధిపయ ఆదీనా మితరేతరయోగ ఏవ. వృక్షమృగాదీనా ముభయత్రేతి" (కాశికావృత్తి. 2-4-2). "ద్వంద్వసమాసం ఇతరేతరయోగంలోనూ సమాహారంలోనూ చెప్పబడింది. అందులో సమాహారం ఏకత్వావచ్ఛిన్నమే గనుక ఏకవచనం వస్తుందని చెప్పనే అక్కర్లేదు. అయితే ఈ ప్రకరణం విషయవిభాగంకోసం చెప్పబడింది. ప్రాణ్యంగాలకు సమాహారమందే ద్వంద్వం వస్తుంది. దధిపయఆదులకు ఇతరేతరయోగమందే ద్వంద్వం వస్తుంది. వృక్షమృగాదులకు ఇతరేతరయోగ సమాహారాలు రెంటియందూ వస్తుంది." ఈవిషయం భాష్యకారుడు "విభాషా వృక్ష మృగ తృణ ధాన్య వ్యంజన పశు శకు న్యశ్వ వడవ పూర్వాపరాధరోత్తరాణాం" (పాణి. 2-4-12) అనే సూత్రచర్చచివర "ఏకవచన మనర్థకం సమాహారైకత్వాత్" అనే వార్తికం పఠించి "వక్తవ్యం చ. కిం ప్రయోజనం? పూర్వత్ర నిత్యార్థం, ఉత్తరత్ర వ్యభిచారార్థం" అని తేల్చివున్నాడు. ఇక్కడ 'పూర్వత్ర' అంటే "ప్రాణ్యంగాదీనాం సమాహార ఏవే త్యేవమర్థ మిత్యర్థః" అని కైయటోపాధ్యాయుడు వివరించివున్నాడు.

ఐతే "సర్వో ద్వంద్వో విభాషయైకవద్భవతి" అని పరిభాష వుందిగదా! దాన్ని ఆశ్రయించుకొని 'వక్షోముఖాం గేషు' అనికూడా వుండవచ్చు నందామా అంటే "ప్రాణ్యంగానాం సమాహార ఏవే త్యేవమర్థం" అన్నచోట ఈ సర్వశబ్దాన్ని వ్యాఖ్యానిస్తూ నాగేశభట్టు "సర్వో ద్వంద్వ ఇత్యత్ర సర్వశబ్ద ఏతత్ప్రకరణస్థ సూత్రానుపాత్తవిషయ ఇతి భావః" (ఉద్ద్యోతం) అని చెప్పాడు. అతడే తన పరిభాషేందుశేఖరంలో ఇదే ప్రస్తావంలో "ద్వంద్వశ్చ ప్రాణి...ఇత్యాది ప్రకరణావిషయః సర్వో ద్వంద్వ ఇత్యర్థః" అని స్పష్ట పరిచాడు. కనుక ఇంక 'వక్షోముఖాం గేషు' అనే ప్రయోగం చింత్య మవటం తప్పనిసరౌతున్నట్టు కనబడుతూంది.

"విభాషా సమీపే" (పాణి 2-4-16) అనే సూత్రంపై భాష్యం ప్రారంభంలో "కి ముదాహరణం? ఉపదశం పాణిపాదం. ఉపదశాః పాణిపాదాః." అని వుంది. ఇక్కడ నాగేశభట్టు "సమాహారవిషయే ఉపదశం పాణిపాద మిత్యేవ. ఇతరేతరేతు ఉపదశాః పాణిపాదా ఇత్యేవ వేష్యతే" (ఉద్ద్యోతం) అంటాడు. భాష్యంలో తరువాత-"ఏవం తర్హి అవ్యయస్య సంఖ్యయా అవ్యయీభావో ఽప్యారభ్యతే బహువ్రీహిశ్చ. తద్యదా తావ దేకవచనం తదా అవ్యయీభావో ఽనుప్రయుజ్యతే ఏకార్థస్యైకార్థ ఇతి. యదా బహువచనం తదా బహువ్రీహి రనుప్రయుజ్యతే బహ్వర్థస్య బహ్వర్థ ఇతి" అని వుంది. అంటే "అవ్యయానికి సంఖ్యతో సమాసం చేసేటప్పుడు అవ్యయీభావమూ వస్తుంది, బహువ్రీహీ-వస్తుంది. విశేష్యం ఏకవచన మైనప్పుడు—పాణిపాదం అని వున్నప్పుడు- విశేషణం ఏకవచనంలో ఉండాలిగనుక 'ఉపదశం' అనే అవ్యయీభావం వాడుతాము. విశేష్యం 'పాణిపాదాః' అని బహువచనంలో ఉంటే "ఉపదశాః" అని బహువచనంలో ఉన్న బహువ్రీహి వాడుతాము" అని అంటాడు భాష్యకారుడు. ఇక్కడ గమనించదగ్గ అంశం విశేష్యాలుగా 'పాణిపాదం, పాణిపాదాః' అనే రెండురూపాలూ-సమాహారం, ఇతరేతరయోగమూనూ- ఉంటాయనీ, విశేషణం విశేష్యాన్ని అనుసరిస్తుంది గనుక ఏకవచన విశేష్యానికి ఏకవచన విశేషణమూ, బహువచన విశేష్యానికి బహువచన విశేషణమూ ఉపయోగించుతామని చెప్పటం. ఈ సందర్భంలోనే "తథా చేతరేతరయోగే ఉపదశం పాణిపాదా ఇత్యపి స్యాదితి భావార్థః" అని వ్రాశాడు నాగేశభట్టు. అంటే పాణిపాదాఃకు ఇతరేతరయోగద్వంద్వంకూడా వుంటుందని భాష్యకారుని అభిప్రాయమనీ, దాన్ని నాగేశభట్టు ఉట్టంకించాడనీ విదితమౌతున్నదిగదా!

ఐతే "పాణిపాదాః" అన్న రూపం "ద్వంద్వశ్చ ప్రాణితూర్యసేనాంగానాం" అనే సూత్రానికి విరుద్ధం కాదా? దీనికి సమాధానం "అధికరణైతావత్త్వే చ" (పాణి 2-4-15) అనే సూత్రం ఆశయం తెలుసుకుంటే దొరుకుతుంది. ఈ సూత్రాన్ని భాష్యకారుడు వ్యాఖ్యానించలేదు. దీని వివరణ కాశికావృత్తిలో "నేతి వర్తతే.* అధికరణం వర్తిపదార్థః. సహి సమాసస్యార్థస్యాధారః. తస్యైతావత్త్వే పరిమాణే గమ్యమానే ద్వంద్వో నైకవద్భవతి. యథాయథ మేకవద్భావః ప్రాప్తః ప్రతిషిధ్యతే. దశదంతోష్ఠాః. దశమార్దంగిక పాణవికాః" అని వుంది. అధికరణమంటే (వర్తి) సమాసపదార్థం. సమాసార్థానికి అది ఆధారం. సమాసంయొక్క పొందిక సమాసఘటక పదార్థాలమీద ఆధారపడివుంటుంది. సమాసఘటక పదార్థాలు వ్యక్తిప్రాధాన్యం లేక సముదాయార్థానికిమాత్రమే గ్రాహకాలౌతూంటే అటువంటి సమాసం ఏకవద్భావం పొందుతుంది. అంటే అక్కడ అధికరణద్రవ్యాల సంఖ్యకు,- సంఖ్యానానికి- ఇయత్తాపరిచ్ఛేదానికి- తావులేదు. సమాసఘటక పదార్థాలు వ్యక్తిప్రాధాన్యం కలిగివుంటే అక్కడ సంఖ్యకు- సంఖ్యానానికి- ఇయత్తాపరిచ్ఛేదానికి తావేర్పడుతుంది. కనుక ఏకవద్భావం రాదు- సమాహారం కాదు- ఇతరేతరయోగ మౌతుంది. అందువల్లనే సంఖ్యావిశేషణంచేత విశేష్యమైన ద్వంద్వసమాసానికి ఈ సూత్రం ఏకవద్భావాన్ని నిషేధిస్తున్నది. ఇక్కడ కాశికాకారుడుపయోగించిన "గమ్యమానే" అనే పదం గమనించదగినది. అది విస్తృతభావంకల శబ్దం. అంటే సంఖ్య ప్రత్యక్షంగా ప్రయుక్తమైనా కాకపోయినా, సంఖ్యానం- ఇయత్తాపరిచ్ఛేదం గోచరించినట్టయితే ఇతరేతరయోగం చెప్పకోవచ్చునని అర్థమౌతుంది. దయానంద సరస్వతి అష్టాధ్యాయీ భాష్యంలో ఇక్కడ "ఘ్రాణరసనచక్షుస్త్వక్ఛ్రోత్రాణి పంచేంద్రియాణి" అని చక్కని ఉదాహరణ యిచ్చాడు.

* "న దధిపయ ఆదీని" (పాణి 2-4-14) అనే సూత్రంనుండి 'న' అనువృత్త మౌతుంది.

ఈ విషయం శాకటాయనవ్యాకరణంలో "ప్రాణి తూర్యాంగం" (2-1-101) అనే సూత్రానికి చింతామణివృత్తిలో "ప్రాణ్యంగానామవయవా స్తూర్యాంగానామవయవాశ్చ ద్వంద్వ ఏకార్థో భవ త్యభేదే" అనేచోట 'అభేదే' అనే పదంచేత తెలుపబడింది. అంటే అవయవవ్యక్త్యభేదం అభిప్రేత మైనప్పుడు ఏకవద్భావం వస్తుంది. అవయవవ్యక్తిభేదం అభిప్రేత మైనప్పుడు ఏకవద్భావం రాదు. ఈ విషయం "సంఖ్యానే" (శాక. 2-1-108) అనే సూత్రం వృత్తిలో "వర్తి పదార్థానాం సంఖ్యానే—ఇయత్తాపరిచ్ఛేదే ద్వంద్వ ఏకార్థో న భవతి" అని స్పష్టం చెయ్యబడింది. ఇక్కడ ఇచ్చిన "కతి మార్దంగికపాణవికాః, ఏతావంతో గతా గవాశ్వాః" అనే ఉదాహరణాలు గమనించదగ్గవి. కనుక వ్యక్తిభేదం, ఇయత్తాపరిచ్ఛేదం, అభిప్రేత మైనప్పుడు ఏకవద్భావం రాదని తేలింది.

భాష్యంలో "అల్పాచ్తరం" (పాణి 2-2-34) అనే సూత్రందగ్గర "మృదంగశంఖతూణవాః పృథఙ్నదంతి సంసది" అని ఒక ప్రయోగం ఇయ్యబడింది. ఇక్కడ తూర్యాంగాలైన మృదంగ, శంఖ, తూణవ పదాలు కలిపి సమాసం బహువచనాంతం చెయ్యబడింది. అంటే ఇతరేతరయోగద్వంద్వం చెప్పబడింది. అక్కడే "శంఖదుందుభి వీణానాం" అని యిటువంటిదే యింకొక ప్రయోగ మియ్యబడింది.

నాగేశభట్టు తూర్యాంగా లంటే వాదకులని అర్థం చెప్పాడు. "భాష్యంలో పై 'మృదంగశంఖతూణవాః' అనే ప్రయోగం బహువచనాంతంగా ఉంది. అవి తూర్యాంగాలే అయితే ఏకవద్భావం రావాలి. పాణిని సూత్రానికి విరుద్ధంగా భాష్యకారుడు ప్రయోగం చూపిఉండడు. కనుక అవి తూర్యాంగాలక్రింద తీసుకోకూడదు. మరి తూర్యాంగా లంటే ఏమిటంటే తూర్యాంగాలను వాయించేవాళ్లు అని అర్థం చెప్పుకోవాలి." ఇదీ నాగేశభట్టు ధోరణి.

సేనాంగాల విషయంలోగూడా నాగేశభట్టు "తూర్యాంగ శబ్దంతోపాటుగానే ఈ శబ్దంగూడా ప్రయోగించబడింది. కనుక దానికీ రథాద్యారూఢులనే అర్థం చెప్పుకోవాలి" అని వ్రాశాడు. ఎందుకంటే భాష్యంలో "యేన విధి స్తదంతస్య" (పాణి 1-1-72) అనే సూత్రం మీద చర్చలో "సంగ్రామం హస్త్యశ్వరథ పదాతిభిః" అని ప్రయోగించబడింది. హస్త్యశ్వరథ పదాతులు సేనాంగాలైతే సమాసానికి ఏకవద్భావం రావాలి. భాష్యకారుడు అప్రయోగం చెయ్యటం అసంభవం. కనుక హస్త్యశ్వరథపదాతులు సేనాంగాలుకావు. తదారూఢులే సేనాంగపదవాచ్యులౌతా రని అర్థం తీశాడు. మరి హస్త్యశ్వరథాలకంటే తదారూఢు లుంటారుగాని పదాతుల గతేమిటి? పదాతులు సేనాంగాలలో చేరకపోవటం హాస్యాస్పదం కాదా?

ఐతే—"శంఖశాంఖికాది సముదాయ స్తూర్యం" (హైమ శబ్దానుశాసనం బృహద్వృత్తి 3-1-137); "సేనాంగ క్షుద్రజంతు" (శాకటాయనవ్యా 2-1-98)- "సేనాంగానామవయవాః క్షుద్రజంత్వవయవాశ్చ బహ్వర్థానాం ద్వంద్వ ఏకార్థో నిత్యం భవత్యభేదే. అశ్వాశ్చ రథాశ్చ అశ్వరథం. రథికాశ్వారోహకం" (చింతామణివృత్తి); "తూర్యాంగానాం వాదినాం గానాం — వంశీ చ వీణా చ వంశీవీణం. మృదంగశ్చ, శంఖశ్చ, పణవశ్చ మృదంగశంఖపణవం. సేనాంగానాం-హస్తిన శ్చాశ్వాశ్చ ఉష్ట్రాశ్చ హస్త్యశ్వోష్ట్రం రథశకటం." (దయానంద సరస్వతి అష్టాధ్యాయీ భాష్యం 2-4-2) ఈ విధంగా ఇతర వైయాకరణులు శంఖాదులను తూర్యాంగాల్లోనూ హస్త్యాదులను సేనాంగాల్లోనూ చెప్పివున్నారు. వీటిని తూర్యాంగ సేనాంగాలు కావని నాగేశభట్టు చెప్పటం పై భాష్యప్రయోగాల ఆశయం గ్రహించక పోవటమే అవుతుంది.

భాష్యకారుడే "విభాషా వృక్ష మృగ తృణ ధాన్య వ్యంజన పశు శకు న్యశ్వ వడవ పూర్వాపరాధ రోత్తరాణాం" (పాణి. 2-4-12) అనే సూత్రం క్రింద "బహుప్రకృతిః ఫల సేనా వనస్పతి మృగశకుని క్షుద్ర జంతు ధాన్య తృణానాం" అనే వార్తికంపై చర్చలో "సేనా—హస్త్యశ్వం, హస్త్యశ్వాః" అని వ్రాశాడు. నాగేశభట్టు ఈ విషయంకూడా గమనించకపోలేదు. అందుకే "ఫలసేనే త్యత్ర తు సేనాశబ్దేన హస్తి రథాదయ ఏ వేత్యాహుః" అని వ్రాసి ఊరుకున్నాడు. దయానంద సరస్వతి అష్టాధ్యాయీభాష్యంలో ఇక్కడ "సేనాశబ్దేన సేనాంగానాం ద్వంద్వః హస్త్యశ్వం. హస్త్యశ్వాః" అని స్పష్టంగా వ్రాశాడు.

కనుక పర్యవసానం ఏమంటే భాష్యకారుడు ఉదాహరించిన "మృదంగ శంఖ తూణవాః, పృథఙ్నదంతి సంసది" అనే ప్రయోగంలోనూ, శంఖ

దుందుభి వీణానాం" అనే ప్రయోగంలోనూ వున్న మృదంగాదులు తూర్యాంగాలే. వాటికి సమాహారానికి బదులు ఇతరేతరయోగం చెప్పబడింది. ఈ "మృదంగ శంఖ తూణవాః, శంఖ దుందుభి వీణానాం" అనే సమాసాలు చింత్యాలు కాకపోతే నన్నయభట్టు "వక్షోముఖాంగేషు" అని ప్రాణ్యంగాలకు చెప్పిన ఇతరేతర యోగద్వంద్వం చింత్యం కాదనటాని కభ్యంతరం వుండదుగదా!

మరి "మృదంగ శంఖ తూణవాః" అనే ప్రయోగం చింత్యమా? కాదు. నాగేశభట్టు చెప్పినట్లు వీటిని తూర్యాంగాలు కావనక్కర్లేదు. ఎందుకంటే- రెండో పాదం చదివితే తెలుస్తుంది. "పృథ గ్వదంతి సంపది." పృథక్ఛబ్దంచేత ఇక్కడ మృదంగ శంఖ తూణవాలు సముదాయార్థాభిప్రేతాలు గాక వ్యక్త్యర్థాభిప్రేతాలని స్పష్టమౌతున్నది. ఇయత్తాపరిచ్ఛేదం— అధికరణైతావత్త్వం గమ్యమానమౌతుంది. కనుక "అధికరణైతావత్త్వే చ" (పాణి 2-4-15) అనే సూత్రంచేత ఇక్కడ తూర్యాంగాలకు ఇతరేతరద్వంద్వం సాధువౌతున్నది. ఈ విషయం గమనించివుంటే నాగేశభట్టు, తదనుయాయులూ తూర్యాంగాలను తూర్యాంగాలు కావనీ, సేనాంగాలను సేనాంగాలు కావనీ అనటం సంభవించివుండేది కాదు.

పైగా, "సంగ్రామం హస్త్యశ్వరథపదాతిభిః" అన్నచోట వ్యాఖ్యలో కైయటోపాధ్యాయుడు "బహుప్రకృతిత్వాభావా దేకవద్భావాభావః" అనీ, నాగేశభట్టు దాన్ని వివరిస్తూ "సేనాంగత్వే దేకవత్త్వ మాప్నోతీ త్యత ఆహ— బహ్వితి. బహ్వర్థవాచి పూర్వోత్తరపదకత్వాభావాత్" అనీ వ్రాశారు. ఇక్కడ గమనించవలసిన అంశాలు రెండు. (1] హస్త్యశ్వరథపదాతులు సేనాంగాలని నాగేశభట్టు అంగీకరించాడు. అయితే దీనికి విరుద్ధంగా "ద్వంద్వశ్చ ప్రాణి తూర్యసేనాంగానాం" అనే సూత్రందగ్గరమాత్రం "సేనాశబ్దేన రథాద్యారూఢానా మేవ గ్రహణం" అంటాడు. (2) "హస్త్యశ్వరథపదాతిభిః" అనే బహువచనాంతసమాసాన్ని సాధించిన విధం చిత్రంగా వుంది. సమాసఘటక పదార్థాలు బహుప్రకృతులు కానందువల్ల ఏకవద్భావం రాలేదంటారు. 'బహుప్రకృతి' అనే పదానికి "బహవో బహుత్వసంఖ్యాయుక్తా వృత్తిపదార్థాః ప్రకృతయః కారణాని యస్య స బహుప్రకృతిః" అని కైయటుని వివరణ. "హస్త్యశ్వరథపదాతిభిః" అన్నచోట సమాసఘటకపదార్థాలు బహుప్రకృతులు కావంటే ఒక్క ఏనుగూ, ఒక గుర్రం, ఒక రథం ఒక్క పదాతితోటి సంగ్రామం జరుగుతుందని చెప్పినట్లవుతుంది. అది సమంజసం కాదు. కనుక ఇక్కడ 'హస్త్యశ్వరథపదాతిభిః' అనేది బహుత్వావచ్ఛిన్న వ్యక్తిప్రాధాన్యవిశిష్ట వివక్ష గల ఇతరేతర యోగద్వంద్వమే ననీ, "అధికరణైతావత్త్వే చ" అనే సూత్రంచేత సాధువనీ తేలుతున్నది.

ఇటువంటి ప్రయోగాలు వాఙ్మయంలో చాలా వున్నవని ముగ్ధబోధ వ్యాకరణ వ్యాఖ్యాత శ్రీరామ తర్కవాగీశుడు కొన్ని ఉదాహరణాలు "చైకార్థ్య చ్చ్వదపహోఽః" (సూ. 324) అనే సూత్రవృత్తిలో ఇచ్చివున్నాడు. "'ముఖనాసికాభ్యాం యో నిష్క్రామతి స ప్రాణవాయుః', గ్రీవా కుక్షీ లలాటేషు నిత్యం స్వేదః ప్రకాశ్యతే' ఇతి వైద్యకే. 'గండే చుంబో లలాటాక్షి కక్షోరు భగమూర్ధసు" ఇతి కామశాస్త్రే. 'నేత్రాస్య నాసికా బాహు హృదయేభ్యః' ఇతి చండీ." అయితే ఆయన వీటిని "దధి పయ ఆదుల" క్రింద జమకట్టుకున్నాడు. ("న దధిపయఆదీని" పాణి. 2-4-14) అయితే గణపాఠంలో ఎక్కడా ఈ ప్రయోగాలు కానరావు. కనుక ఇవి పైని చెప్పినట్లు వ్యక్తిప్రాధాన్యవివక్షగల సమాసాలు — ఇతరేతరద్వంద్వాలే నని స్పష్టమౌతున్నది. వ్యక్తిప్రాధాన్యవివక్ష లేకపోతే—"గండే చుంబో" అన్నచోట 'లలాటాక్షి కక్షోరు భగ మూర్ధసు' అని గనక సమాసం లేకపోతే—భావమే కుదురదు.

శ్రీమద్రామాయణంలో "తురంగఖుర విధ్వస్తం రథ నేమి సముద్ధితం। రురోధ కర్ణ నేత్రాణి యుధ్యతాం ధరణీరజః" (యు. కాం. 44 సం. శ్లో 10) అనే శ్లోకంలో 'కర్ణ నేత్రాణి' అనే ఇతరేతరయోగ ద్వంద్వం ప్రయోగించబడింది. 'యుధ్యతాం' అన్న పదంవల్ల బహుత్వం కర్ణనేత్రపదాలకు అనుక్లృప్తమై అధికరణైతావత్త్వం గమ్యమానమైనందువల్ల సమాసం బహువచనాంతంగా—ఇతరేతరయోగద్వంద్వం సుప్రయుక్తమైంది.

వైశేషికదర్శనంపై ప్రశస్తపాదభాష్యంలో "అక్షరాణీంద్రియాణి ఘ్రాణరసన చక్షుస్త్వక్ శ్రోత్ర మనాంసి" అని వుంది. తర్కసంగ్రహం వ్యాఖ్యానమైన న్యాయబోధినిలో "ద్రవ్యగ్రాహకాణీంద్రి

యాని చక్షుస్త్వగ్జిహ్వానాంపి త్రీణ్యేవ. అన్యాని ఘ్రాణరసనశ్రవణాని సుగ్రాహకాణి... రసన ఘ్రాణయోస్తు రసగంధ తద్గతజాతి గ్రాహకత్వేన ద్వితీయతృతీయయోః సంనికర్షయో రేవ తత్ర హేతుతా వాచ్యా" అని ప్రత్యక్షపరిచ్ఛేదంలో ఉన్నది. ఇక్కడ గుర్తుపెట్టిన సమాసాలన్నీ ప్రాణ్యంగాలకు సంబంధించిన ఇతరేతరయోగద్వంద్వాలే.

ఇదేవిధంగా నన్నయభట్టారకుడి శ్లోకంలో "తే వేదత్రయమూర్తయః స్త్రీపురుషాః" అనే దాన్నుండి త్రిత్వానుగతివ్యక్తిప్రాధాన్యం వక్షోముఖాంగ పదాలకు అనుకృష్టమైనందువల్ల "వక్షోముఖాంగేషు" అనే ఇతరేతరయోగ ద్వంద్వం ఆవశ్యకమైంది. "శ్రీ వాణీ గిరిజాః వక్షోముఖాంగేషు దధతః వేదత్రయమూర్తయః స్త్రీపురుషాః" అన్నప్పుడు "శ్రియం వక్షసి (ఏకః పురుషః), వాణీం ముఖే (అన్యః పురుషః), గిరిజాం అంగే (అన్యః పురుషః)" అని యథాసంఖ్య నిర్దేశంవల్ల కూడా వక్షోముఖాంగ శబ్దాలకు వ్యక్తిప్రాధాన్యం బలీయమౌతున్నది. ఏకవచనాంతం చేసి సమాహార ద్వంద్వం చెప్పితే అక్కడ అనుద్భూతావయవభేద మైన రాశిమాత్రమే గ్రాహ్యమౌతుంది గనుక యథా సంఖ్యాలంకారం కుదరదు.

పైగా ఒక్క ప్రాణి అవయవాలను రాశీభూతంగా 'పాణి పాద శిరో గ్రీవం' అని చెప్పటం తగి వున్నట్టు ఒకడి వక్షస్సు, ఇంకొకడి ముఖం, ఇంకొకడి అంగం కలిపి రాశీభూతంగా చెప్పటం తగదు. అది సామాన్యజ్ఞానానికి విరుద్ధం. ఆం. అలా చెప్పటానికి ఒక్కొక్కప్పుడు వీలు కుదురవచ్చు. "రణాంగణే సర్వత్ర పాణి పాద కబంధ శీర్షం దృష్టం" అని చెప్పవచ్చు, ఇవి— పాణి పాద కబంధ శీర్షములు— భిన్న భిన్న వ్యక్తుల వైనా వారినుండి వేరుచేయబడి కుప్పగా పడివున్నాయి గనుక ఇక్కడ సమాహార ద్వంద్వం చెప్పవచ్చు.

ఏతావతా ఫలితాంశం ప్రాణితూర్య సేనాంగాలకు ఏకవద్భావం అనుద్భూతావయవభేదంగా చెప్ప దలచినప్పుడే కాని, ఉద్భూతావయవభేదంగా చెప్ప వలసినప్పుడు రాదనీ, అష్టభాషావాగనుశాసనుడు ఈ వ్యాకరణమర్మం ఎరిగినవాడు గనుకనే 'వక్షోముఖాంగేషు' అని ఇతరేతరయోగద్వంద్వం సుప్రయుక్తం చేశాడనీ, అది చింత్యం ఎంతమాత్రమూ కాదనీ, ఏకవద్భావం చేసివుంటే తప్పయ్యేదనీ స్పష్టమౌతున్నది.

ఇంకొక విషయంకూడా ఇక్కడ గమనించదగినది వున్నది. "ముఖనాసికావచనో ఽనునాసికః" (పాణి. 1-1-8) అనే సూత్రంలో 'ముఖనాసికావచనం' అనే సమాసాన్ని సాధించినవిధం పరీక్షించదగి వుంది. భాష్యంలో "కి మిదం ముఖనాసికా వచనః?" అని ప్రశ్నించి "ముఖంచ నాసికాచ ముఖనాసికం. ముఖనాసికం వచన మస్య సోఽయం ముఖనాసికా వచనః" అని మొదట సమాధానం చెప్పబడింది. ముఖ నాసికా శబ్దాలకు సమాహారద్వంద్వం చెప్పుకొని, తరువాత వచనశబ్దంతో బహువ్రీహి చెప్పుకుంటే సరిపోతుందని. అయితే సమాహారం చెప్పుకుంటే ముఖ నాసికా శబ్దం ఏర్పడక 'ముఖనాసికం' అని రూపం వస్తుంది. అప్పుడు కాకు దీర్ఘానికి అవకాశం లేదుగదా? అని ప్రశ్నించుకొని "నిపాతనా ద్దీర్ఘం భవిష్యతి" అని సమాధానం చెప్పాడు భాష్యకారుడు. నిపాతనం అంటే సర్వసామాన్యంగా వుండే సూత్రానికి భిన్నమైన ప్రయోగం అవశ్యకాన్ని బట్టి సూత్రంలో చెప్పి చూపటం. అటువంటి ప్రయోగం వచ్చినప్పుడు సూత్రకారుడికి ఈ రూపంకూడా అభిమతమే కనుక ఇది సాధువు అని చెప్పుకుంటాము. ఇదే "నిపాతనాత్సిద్ధః" అనేదాని అభిప్రాయం. ఇక్కడ 'ముఖనాసికా' అనే ఇతరేతరద్వంద్వానుగతిరూపం అభిమతంకాదు గనుక ఆ రూపాన్ని సాధించుకోటానికి నిపాతనాన్ని ఆశ్రయించవలసి వచ్చింది. ఐతే యిది తృప్తికరంగా లేదని, ఇతర విధాల సాధించడానికి భాష్యకారుడు పూనుకున్నాడు. మూడు విధాలు చూపించాడు.

"ముఖనాసికం అవచన మస్య సోఽయం ముఖనాసికావచనః" అనేది మొదటిది. అవచనం అంటే ఈషద్వచనం అని అర్థం చెప్పుకొని కొంత ముఖంచేత, కొంత నాసికచేతా పలుకబడేది గనుక "ముఖనాసికం అవచన మస్య" అని సాధించాడు. ఈ పక్షాన్నే దయానందసరస్వతి తన భాష్యంలో స్వీకరించాడు. ఐతే, ఈషచ్ఛుక్ల మన్నా శుక్లమే అయినట్లు ఈషద్వచన మన్నా వచనమే అవుతుంది గదా! వచనమంటే ఇక్కడ ఉచ్చారణకరణం—ఉచ్చారణ సాధనం అవుతున్నది గనుక ఈషత్కరణ మన్నా కర

నతోఽవచ్ఛిన్నమే అవుతున్నది. అప్పుడు 'ముఖనాసిక వచనం' అంటేనే సరిపోతుందిగదా! కాపు దీర్ఘ మెందుకు? అనే శంక కలిగింది. (చూ. కైయటుని వివరణ.)

అప్పు డింకొక విధంగా సాధన చూపించాడు భాష్యకారుడు. "ముఖద్వితీయా వా నాసికా ముఖనాసికా" అని మధ్యమపదలోపి సమాసం చెప్పుకోవాలి. అలా చెప్పుకుంటే ఉత్తరపదమైన నాసికకు ప్రాధాన్యం వచ్చి ఉభయకరణత్వం సువచం కాకుండా పోతుంది. అందుకని దీనికి వివరణం కైయటోపాధ్యాయుడు ఇంకొకరకంగా చెప్పాడు. "తత్ర నాసికా ముఖసాహచర్యా న్ముఖశబ్దే నోచ్యతే. ముఖం చ తన్నాసికా చ ముఖనాసికా. సా వచన మస్యేతి" అన్నాడు. ముఖసాహచర్యంచేత నాసికకూడా ముఖశబ్దవాచ్య మౌతుంది. ముఖమైన ఆ నాసికయే ముఖనాసిక. అది వచనం (కరణం)గా కలది ముఖనాసికా వచనం అని వివరించాడు. ఇది భాష్యకారుడు చూపిన దారి కాదు గనుక చింత్యం అన్నాడు నాగేశభట్టు. ఇలా చెప్పినాకూడా నాసికకే ప్రాధాన్యం వస్తున్నది. ఉభయవచనకత్వం సువచం కాకుండాపోతున్నది.

అందుచేత భాష్యకారుడు ఇంకొక మార్గం చూపించాడు. "ముఖోపసంహితా వా నాసికా (ముఖనాసికా) వచన మస్య సోఽయం ముఖనాసికా వచనః" అన్నాడు. దీనికి కైయటోపాధ్యాయుడు "ముఖోపసంహితేతి. ముఖస్య చ నాసికాయా శ్చాంతరాలం స్థానాంతర మేవానునాసికస్య దర్శయతి" అని వివరణ చెప్పాడు. అంటే ముఖనాసికల అంతరాలం అనునాసికానికి జన్మస్థానం అని భాష్యకారుడు చూపుతున్నా డంటాడు. "ముఖం చ తన్నాసికా చే త్యాభ్యాం అంతరాలం వ్యపదిశ్యతే" అంటాడు. ముఖనాసికా అంటే ముఖనాసికల అంతరాలం అని అర్థం చెప్పుకోవాలి. ఈ సిద్ధాంతం ముఖం, నాసికా రెండూ కరణాలుగా కలది అనునాసికం అనే సిద్ధాంతానికే విరుద్ధ మౌతుంది. "ఙఞణనమాః స్వస్థాన నాసికాస్థానాః. (పాణినీయశిక్ష-1-24) ఙఞణనమలు స్వస్థానం నాసికాస్థానం రెండూ స్థానాలుగా కలవి." అని గదా పాణిని మతం. ఇతర వైయాకరణుల మతంగూడా ఇదే. "ఙఞణనమాః స్వస్థాన నాసికాస్థానాః"(హైమశబ్దానుశాసన బృహద్వృత్తి1-1-17). "పూర్వం ముఖస్థానం పశ్చాన్నాసికాస్థాన ముచ్చారణ మిత్యర్థః"(కాతంత్రపంజికా 1-1-15). "ఞమఙణనాః స్వస్థానా నాసికాస్థానా శ్చ" (ఆపిశలిశిక్ష 1-24). "ముఖవచనా నాసికావచనా శ్చేతి" (కాతంత్రం దుర్గవృత్తి 1-1-15).

ఈవిషయంలో భర్తృహరి "స హి వర్ణో న ముఖే నైవ నాపి నాసికయైవ చాత్మవృత్తిం లభతే. కింతు వాయు నానుపరతశక్తి నాన్యతరకరణ మభిహ త్యాన్యతరకరణే ఽభిహన్యమానే ఆత్మవ్యక్తిం లభతే" అని శాస్త్రీయసిద్ధాంతం ప్రతిపాదించాడు. అనునాసికవర్ణం కేవలం ముఖంచేతగాని కేవలంనాసికచేతగాని అభివ్యక్తం కాదు. తరగనిశక్తి గల వాయువు ఒక కరణాన్ని తాకి, వేరొక కరణాన్ని తాకుతున్నప్పుడు అభివ్యక్తి పొందుతుంది. ఇందులో రెండు కరణాలూ ముఖం నాసికాకూడా ముఖ్యమైనవే. కనుక ముఖానికి ప్రాధాన్య మిచ్చి నాసికను గౌణంచేసినా, నాసికను ప్రధానం చేసి ముఖాన్ని గౌణం చేసినా నిర్వచనం దుష్టమౌతుంది. దీన్ని బట్టి పై భాష్యనిర్వచనాలు ముఖనాసికాశబ్దాన్ని ప్రాణ్యంగత్వేన ఏకవద్భావ నపుంసకలింగ ప్రాప్తంగా తీసుకోటంవల్ల శబ్దసాధనకు వేరువేరు మార్గాలు త్రొక్కవలసివచ్చి చెప్పిన ప్రతిభా ప్రయుక్త సాధన లేకాని వేరు కాదని విదితమౌతున్నది.

శుక్లయజుః ప్రాతిశాఖ్యంలో "ముఖనాసికాకరణో ఽనునాసికః" అని (1-75 సూ.) ఉంది. 'వచనానికి' బదులు 'కరణం' ప్రయోగింపబడింది. కరణశబ్దం ముఖానికీ చెందుతుంది. నాసికకూ చెందుతుంది. ఈ వ్యవస్థ ముఖనాసికాశబ్దం ద్వంద్వసమాస మైనప్పుడే— అందులోనూ ఇతరేతరయోగద్వంద్వ మైనప్పుడే చెల్లుతుంది. సమాహారం అనుద్భూతావయవభేద రాశిమాత్ర గ్రాహకంకనుక దానికి చెల్లదు. అందుచేతనే పాణినికి ముందునుంచీకూడా ముఖనాసికాశబ్దం ఇతరేతరద్వంద్వంగానే రూఢమైపోయింది. అవయవభేదప్రాధాన్యం— అధికరణైతావత్త్వం— ఉండటంచేత ఇది సాధువూ, సర్వవిద్వత్సమ్మతమూ కూడాను. ఆరోజుల్లో ఎవరూ దీనికి విసంవాదం చేసినట్టు కనపడదు. పారాశరీశిక్షలో "ముఖనాసికాభ్యా ముచ్చార్యమాణో వర్ణో ఽనునాసికః" అని స్పష్టంగా వుంది. శుక్లయజుః ప్రాతిశాఖ్యంలోనే ఇంకొకసూత్రం "నవ వక్రమే ణోరఃకంఠభ్రూమధ్యాని" (1-30) అని వున్నది. ఇందులో "ఉరఃకంఠభ్రూమధ్యాని" అనే

సమాసమూ ఇటువంటిదేగదా! ఋక్ప్రాతిశాఖ్యం లో "రక్తో వదనో ముఖనాసికాభ్యాం" (ప 13 సూ 20) అనివుంది. ఋక్ప్రాతిశాఖ్యంలో రక్త శబ్దం అను నాసికపర్యాయంగా ప్రయోగించబడింది. ఇక్కడా "ముఖనాసికాభ్యాం" అని ఇతరేతరయోగ ద్వంద్వం స్పష్టంగావుంది.

పైని వివరించినవిధంగా వున్న రూఢిని కాదన టంవల్ల భాష్యకారుడు పతంజలి మహర్షి ముఖనాసికా వచన శబ్దాన్ని అన్యథా సాధించటానికి మార్గాంతరాలు తొక్కవలసివచ్చింది. ఫలితంగా మాటిగా ఉన్నదాని కోసం ప్రక్కదారులకు పోవలసివచ్చింది.

సారస్వతవ్యాకరణంలో "ముఖనాసికాభ్యా ముచ్చార్యమాణో వర్ణో ఒనునాసికః" అని సరళంగా చెప్పబడింది. పాణినీయప్రభావం పడ్డ వ్యాఖ్యాత చంద్రకీర్తిసూరి "ముఖనాసికాభ్యాం" అన్న ప్రయో గం తప్పవలేదు గాని రూఢిపద మిది అన్నాడు. ప్రక్రి యాకౌముదిలోంచి ఉదాహరణా లిచ్చి ఇక్కడ శాస్త్రప్రకారమైతే ఏకవద్భావం, నపుంసకలింగమూ రావలసినవే నన్నాడు. ఐతే లోకరూఢి ఇలా వుందని ఒప్పుకోటం ఉదారబుద్ధి లక్షణం. రఘునాథశిరోమణి భట్టోజీదీక్షితుల శిష్యుడు తాను సారస్వతసూత్రాలపై వ్రాసిన లఘుభాష్యంలో "ముఖనాసికాభ్య ముచ్చా ర్యమాణో ఒనునాసిక ఇతి వక్తవ్యం" అని చెప్పాడు. అయితే తాను "ముఖసహితే నాసికే ముఖనాసికే. తాభ్యాం. అత్ర ద్వివచనం ఛిద్రద్వయాభిప్రాయేణ." అని సమర్థించాడు. 'ముఖసహితములైన నాసికలు' అని ద్వివచనాంతంగా మధ్యమపదలోపిసమాసం చెప్పి 'ముఖనాసికాభ్యాం' అని పదం సిద్ధింపజేశాడు. అయితే ఇందులోనూ ముఖం గౌణం, నాసిక ప్రధా నమూ అయినందువల్ల ఉభయప్రధానత్వం సిద్ధించనందు వల్ల లక్షణం దుష్టమైంది. "ఇంకొకొందరు 'ముఖం చ నాసికా చ ముఖనాసికే' అని ద్వంద్వం చెప్పారు. అదీ సమంజసమే" నన్నాడు. అయితే ఇతరవ్యాకరణం ప్రకారం (పాణినీయం ప్రకారం) ఏకవద్భావమూ, క్లీబలింగత్వమూ రావద్దా అని పూర్వపక్షం చూపించి ఆ పాణినీయమే "ముఖనాసికావచనో ఒనునాసికః" అనీ, "నాసికా స్తనయోర్ధ్మాధేటోః" (పాణి 3-2-29) అనీ* ప్రయోగించి సమాహారానిత్యత్వం చూపించారనీ, అందుచేతనే "కాటిల్యం కుచనేత్రయోః", "కంచరణా ధరదంతేషు రాగ స్తే" ఇత్యాది ప్రయోగాలు సాధు వులుగా గ్రహించబడ్డాయనీ సమర్థించాడు.

అభిజ్ఞానశాకుంతలం ద్వితీయాంకంలో — "విదూ షకః :— (తథాస్థిత ఏవ) భో వఅస్స ! ణ మే హత్థ పాఆ పసరంతి, వాఆమెత్తేణ విఅఈ హోహి. (ఛాయా) భో వయస్య ! న మే హస్తపాదౌ ప్రస రతః. వాఙ్మాత్రేణ విజయీభవ." (పుట 105 వావిళ్ల 1931) అని వుంది. ఇక్కడ "హస్తపాదౌ" అని ఇతరేతర యోగద్వంద్వం ప్రయుక్తమైంది. "హత్థపాఆ" అని ప్రాకృతంలో బహువచనాంతంగావుంది. "ద్వివచనస్య బహువచనమ్" (ప్రాకృత ప్రకాశం, 6-63) అనే సూత్రాన్ని బట్టి సంస్కృతంలో ద్వివచనానికి ప్రాకృ తంలో బహువచనం వస్తుంది. కనుక "హత్థపాఆ" అనే ప్రాకృతమూలానికి "హస్తపాదౌ" అనే సంస్కృతచ్ఛాయే సరియైనదని స్పష్టం. ఇది వచనంలో వుంటంచేత కుశాగ్రబుద్ధులైన మన పరిష్కర్తలు "న మే హస్తపాదం ప్రసరతి" అని దిద్దివేశారు. (మా. కాళె సంపాదితం అభిజ్ఞానశాకుంతలం పు. 62) అయితే అదృష్టవశాత్తూ వారి కలంపోటు ప్రాకృతంమీద పడ లేదు. అందుచేత అదిమాత్రం యథాతథంగానే వుంది. ఈ దిద్దుడు ఒక అంటుజాడ్యం. దీనిమూలంగా ఎన్నో గ్రంథాలు మాతృకలకు భిన్నమైపోయి ప్రయోగమర్మ జ్ఞతకు ఆఘాతం ఏర్పడింది. పరిష్కర్తలు లేఖక ప్రమాదా లేవో వ్యాకరణమర్మజ్ఞతాస్ఫోరక ప్రయో గనైచిత్ర్య లేవో గ్రహించకపోవటం దురదృష్టం.

ఈ చర్చ సందర్భంలో సారస్వత వ్యాకరణంలో వున్న సమాహారసూత్రం గమనించదగి వుంది. సారస్వత వ్యాకరణంలో ప్రధానంగా రెండుసూత్రపాఠాలు కొంతకొంత భేదంతో కనపడుతున్నాయి. ఒకటి భట్టోజిదీక్షితుని కుమారుడు భానుజీ అనే అపరనామం కల రామాశ్రమి సారస్వతసిద్ధాంతచంద్రికలో అనుస రించినది. ఇంకొకటి అనుభూతిస్వరూపాచార్య డనుస రించింది.

రామాశ్రమి చూపిన సూత్రాల్లో — "సమా హారే ఏకవద్భావః", "ఏకత్వే ద్విగుద్వంద్వే"

* "స్వాఙ్గాచ్చోపసర్జనా దసంయోగోపధాత్" (పాణి. 4-1-54) అనే సూత్రంక్రింద "అంగగాత్ర కంఠేభ్య ఇతి వక్తవ్యం"అని వార్తికంవుంది కాశికలో. ఇక్కడా సమాసం అటువంటిదే. ఈ వార్తికమే కొం చెం మార్పుతో "అంగగాత్రకంఠేభ్యో వా ప్రతిషేధః" అని జైనేంద్రవ్యాకరణంలో "స్వాంగాన్నిచో ఒ స్ఫోడః" (3-1-47) అనేమాత్రం క్రిందవున్నది.

(557, 558 సూ.) అనే సూత్రాలున్నాయి. అంటే "సమాహారే (సతి) ఏకవద్భావః, ఏకవద్భావే (సతి) (ద్విగుద్వంద్వౌ నపుంసకలింగౌ భవతః)" సమాహారం, చేసినప్పుడు ఏకవద్భావం చెప్పాలి — సముదాయార్థం ప్రధానం గనుక, ఏకవద్భావమూ వచ్చినప్పుడు ద్విగు ద్వంద్వ సమాసాలు నపుంసకలింగాలవుతాయి అని ఈ సూత్రాల భావం. అంటే సమాహారం చెయ్యటం చెయ్యకపోవటం వక్తృవివక్షనుబట్టి వుంటుంది. వక్త ప్రకరణౌచిత్యాన్ని బట్టి సమాహారం చెప్పదలచుకుంటే చెప్పవచ్చు. లేకపోతే మానవచ్చు. సమాహారం చెప్పి నప్పుడు మాత్రం ఏకవద్భావం, నపుంసకలింగమూ ప్రాప్తిస్తాయి. సారస్వతవ్యాకరణం యొక్క ధ్యేయం వ్యాకరణం సులభంగా, సరళంగా చెప్పడమే. ఈ సూత్రరచన ఆ ధ్యేయానికి తగినట్టు సరళంగానూ, అసందిగ్ధంగానూ ఉంది.

ఇంక అనుభూతిస్వరూపాచార్యులు పఠించిన సూత్రం ఇంకొకరీతిగా ఉంది — "ఏకవద్భావో వా సమాహారే వక్తవ్యః" అని. ఇక్కడి సూత్రంలో సమాహారపక్షంలో ఏకవద్భావం రావచ్చు, రాకపోవచ్చు అని చెప్పబడింది. దీనికి చంద్రకీర్తిసూరి వ్యాఖ్య చూడండి. "సమాహారే ద్వంద్వే పదానాం సమాసే కృతే ఏకవద్భావ ఏకవచనం వా భవతి. ఏకమివ ఏకవత్. తస్య భావః. పక్షే పదానాం సమాహారత్వా ద్బహుత్వా ద్బహువచనం భవ త్యేవ — ఏకవద్భావో వా సమాహారే వక్తవ్య ఇతి. అత్ర సముదాయార్థ ప్రాధాన్యవివక్షాయాం ఏకవచనం అవయవార్థ ప్రాధాన్యవివక్షాయాం బహువచన మితి. నిపాతానా మనేకార్థత్వా ద్వాగ్రహణాత్ క్వచి దితరేతరయోగే ఒప్యేకవద్భావో భవతీతి శేషః." సమాహారద్వంద్వం చేసినప్పుడు ఏకవచనం రావచ్చు రాకపోవచ్చు. అంటే సముదాయార్థం వివక్షితమైనప్పుడు ఏకవద్భావం, అవయవార్థం వివక్షితమైనప్పుడు బహువచనం వస్తుందనీ, 'వా' అనే నిపాతం అనేకార్థకం కనుక తత్సామర్థ్యంచేత ఒక్కొక్కప్పుడితరేతరయోగంలో కూడా ఏకవద్భావం వస్తుందనీ చెప్పబడింది. దీని తర్వాత "ఏకత్వే ద్విగుద్వంద్వౌ" అనే సూత్రం చెప్పి సమాహారమందుగానీ, ఇతరేతరయోగమందుగానీ ఏకత్వం వచ్చినప్పుడు ద్వంద్వసమాసం క్లీబలింగమౌతుందని చెప్పబడింది.

ఇక్కడ సిద్ధాంతరీత్యా కొంత విప్రతిపత్తి కనపడుతున్నది. "చార్థే ద్వంద్వః" అన్నప్పుడు చకారార్థాలైన సముచ్చయ, అన్వాచయ, ఇతరేతరయోగ, సమాహారాల్లో మొదటి రెండింటిలోనూ ఏకార్థీభావ సామర్థ్యం లేదు గనుక సమాసం రాదు. ఇంక మిగిలినవి ఇతరేతర యోగమూ, సమాహారమూను, ఇందులో "ద్వౌ భేదౌ వస్య శాస్త్రోక్తౌ సమాహారేతరేతరౌ, ఏకాన్యవచనాకాంక్షా హానోపాదానత శ్చ తౌ" (శబ్దశక్తి ప్రకాశిక 49 శ్లో.) ఏకవచనాన్య సుబాకాంక్షా హానంచేత సమాహారమూ, తథావిధ సుబాకాంక్షోపాదానంచేతఇతరేతరయోగమూ ఏర్పడుతాయి. ఇక్కడ హానోపాదాన పదాలు గమనించదగినవి. వీటినిబట్టి సమాహారేతరేతరయోగద్వంద్వాలు వక్తృవివక్షాధీనాలనీ విదితమౌతున్నది.

సమాసంలో చివరిపదం ఏకవచనంలో ఉండి క్రియతో అన్వయించినప్పుడు సమాహార మౌతుంది. 'పాణిపాదం' అన్నప్పుడు రెండు చేతులు, రెండు కాళ్లూ అనేవి పదక్రమాన్నిబట్టి అవగతాలైనా సమాసాంతమైన ఏకవచనముండే అవి సర్వవసితాలై సముదాయాన్ని మాత్రమే బోధిస్తాయి. సమాసఘటకశబ్దాల అర్థాలు వైయక్తికంగా ప్రధానాలు కానందువల్ల సముదాయవాచకమైన ఏకవచనం ప్రధానమై సమాసఘటకపదాలు తాత్పర్యమాత్ర గ్రాహకాలై గౌణాలై పోతాయి. ఇతరేతరయోగద్వంద్వం దీనికి వ్యతిరేకం.

వ్యక్తిప్రాధాన్యం లేనప్పుడు ఏకవద్భావం లేదు. ఏకవద్భావం లేనప్పుడు సమాహారం లేదు. కనుక సమాహారంలో అనేకవద్భావం ఉంటుందని చెప్పటం సమంజసంగా తోచదు. అలాగే వ్యక్తిప్రాధాన్యం ఉన్నప్పుడు అనేకవద్భావమే ఉంటుంది. ఈ అనేకవద్భావమే ఇతరేతరయోగద్వంద్వానికి ముఖ్యలక్షణం. కనుక ఇతరేతరద్వంద్వంలో ఏకవద్భావం వస్తుందనటమూ సమంజసం కాదు. ఏకవద్భావముంటే అది సమాహారమే. ఏకవద్భావం లేకపోతే అది ఇతరేతర యోగద్వంద్వమే. "ప్రాణ్యంగాదీనాం సమాహార ఏవ ద్వంద్వః, దధిపయ ఆదీనాం యితరేతరయోగ ఏవ, వృక్షమృగాదీనా ముభయ మేతి" అన్న కాశికాకారుడి వచనంలో 'ఉభయమేతి' అనే పదం వ్యక్తం చేస్తున్న భావ మిదే. ఇంకా ఇందుకు సంబంధించిన సంపూర్ణచర్చ "చార్థే ద్వంద్వః" అనే సూత్రాన్ని గురించిన వ్యాసంలో విస్తరించబడుతుంది. ప్రస్తుతం ఫలితాంశం ఏమిటంటే ఏకవద్భావం ప్రకరణౌచిత్యాన్ని అనుసరించిన వక్తృవివక్షపై ఆధారపడి వుంటుందనేదే. ఏకవద్భావం అవశ్యకమైతే సమాహారమూ, వ్యక్తిభేదం అవశ్యకమైతే ఇతరేతరయోగ ద్వంద్వమూ ప్రాణ్యంగాలకైనా, తూర్యాంగాలకైనా, సేనాంగాలకైనా సరే చెప్పుకోవచ్చును.

# పేరు లేని మనుషులు

'మంజీర'

ఆమె తనబిడ్డలు చుట్టూ ఏడుస్తుండగా వస్తోంది ఆ హోటలు వైపు. ఎముకల కంటుకొన్న శరీరము, నల్లగా మరికలు దేరి, అప్పటప్పట కురుపులతో నున్న చేతులు, కుములుతూ విచారంగా కనపడే మొహము, మేనుమీద మలినమయి మానరక్షణకయినా పనికిరాని వస్త్రం; నగ్నంగా వస్తూంది, చంకలోని పసికందు నిద్రపోతూండగా.

ఆహోటలు చేరగనే ఆమెనువదలి హోటలులో భోజనముచేసి పారవేసే ఎంగిలాకుల డబ్బావైపు పరుగెత్తారు ఆకుఱ్ఱాళ్ళు ఆనందంతో. ఆమెకూడా ఆతురతతో త్వరితగమనం సాగించిందా వైపుకు కొంచెం ఆశతో కళ్లు మెరుస్తుండగా. అక్కడున్న కుక్కలతో కుర్రాళ్ళ పోరాటం మొదలెట్టేసరికి సరిగా చేరుకుందామె వాళ్ల సహాయార్థమయి. వాళ్ళంతా తలో ఆకు తీసుకున్నారు యంత్రాల్లాగ, మిగతా ప్రపంచంతో సంబంధంలేనట్లుగా. కొంచెం దూరంలో నుంచున్నాయి కుక్కలు కోపంగాను, కసిగాను, తమ ప్రత్యర్థులవైపు వీక్షిస్తూ, చిన్న గోండ్రింపుతో.

భోజనాలుచేసిపోయే పెద్దమనుషులు, ఫలహారములు తినిపోయే మర్యాదస్తులూ తమ తమ వదనాలవతలవైపుకు త్రిప్పుకుని అసహ్యించుకుంటున్నారు పైకి కనపడేలాగ. ఏదో హేయమయిన దృశ్యాన్ని తప్పనిసరిగా చూడవలసివస్తే తప్పించుకుపోయేటట్లు పరుగెడుతున్నారు అంగ లేసుకుంటూ వేగంతో.

ఇంతలో హోటలులోనుంచి భూమి బ్రద్దలయ్యేటట్లు వినిపించిందో పెద్ద గద్దింపు మేఘ గర్జనలాగ. ఆమె భయంతో వణుకుతూ చూచిందావైపు క్రీగంట. పిల్లలు వ్యాకులపాటుతో కదలుతూ తమ తల్లి జవకాలకు చేరారు, గ్రద్ద అరపునకు భయపడి ఆహారం వదలిన కోడిపిల్లలవలె. ఆమెకు ఎదురుగా ప్రత్యక్షమయ్యాడు హోటలు మేనేజరు అగ్గిబరాటాలాగ. ఆమె ఏమీ మాట్లాడకుండా నిలబడింది ప్రశాంతంగా.

"ఎన్నిసార్లు దా సొల్లి ఉండాది, అంగె ఎంగిలాకులు తొక వేండదని" అని అరచాడు, తీవ్రంగా వచ్చీరాని తెలుగులో, యాసగా పలుకుతూ, జాతీయ నిధులకు విరాళాలయిచ్చిన మహాఘనుడు. ఆమె దానికేమీ సమాధానం చెప్పకుండా అప్పటనే నిలబడింది శిలాప్రతిమలాగ.

"నీకే దా సొప్పేదు. పో శీఘ్రం." అంటూ ఉరిమాడు. లోపలనుండి డబ్బు లివ్వడానికి వచ్చినవ్యక్తి పిలుపువల్ల తనడబ్బుకోసం అంతర్ధానమయ్యాడా మేనేజరు ఆస్థలం వదలి.

ఆవ్యక్తి కొంచెం విసుగ్గా ఆ మేనేజరువైపు చూచి "ఏమయ్యా వాళ్ళు ఎంగిలాకుల్లోని మెతుకులు రెండూ ఏరుకుంటూంటే, నీ సొమ్మేం పోయిందయ్యా? వాళ్ళతో ఎందుకలా కొట్లాడుతున్నావు, నీపని నువ్వు చూచుకోకుండా." అన్నాడు.

"వాడు అందమాదిరికీస్తే జాస్తి అసహ్యాయిల్లే అప్పా. యిది దా హోటలుకుందా."

"నీ హోటలు అంతకన్న బాగుందా ఏమిటిలే. ఏదో నీపని నువ్వు జూసుకుందూ?"

"వాడికి దా ఒన్నుం విశ్వాసంయిల్లే అప్పా." అంటూ గొణిగాడు మేనేజరు.

"ఎంగిలాకులు తిననిచ్చినందుకేమిటి విశ్వాసం"

"వాడిసమాచారందా, ఉంగళ్ కెన్న తెరియుం సార్. నాకిదా నిండా తెరియుం. యీనాంటువోడికిదా నిండా (చాల) గుడ్డుదా తిండాలి. తెలీదూ. వీడికి యిదిదా వృత్తి. కరుణ సేయరప్పా. నాక్ దా నిండా బాహా తెలియుం." అని ఓ పెద్దఉపన్యాసం దంచేశాడు మేనేజరు తెలుగుభాషని చిత్రవధ చేస్తూ.

"బావుంది. నిండా తెరింజాండాది. చిల్లరియ్యి" అన్నాడాయన మేనేజరుతో అవస్థపడలేక. అతడు పిలకతీసుకుని గల్లాపెట్టెలోని చిల్లరతీసి ఆయనకిచ్చాడు. చిల్లరలెక్కపెట్టుకుంటూ పోతూపోతూ ఒక అణాకాసు ఆమెముందు విసిరిపోయాడా పెద్దమనిషి.

మేనేజరిలా సంభాషణలో నున్నప్పుడే ఆమె డబ్బాలో ఆకులన్నీ—నక్కగోతిలో శవాన్ని లాగినట్లు—లాగి, ఓ ప్రక్కకు తీసుకుపోయి, అందులోని అన్నం మెతుకులూ, కూరముక్కలూ ఊడ్చుకుని, తనదగ్గరున్న చీనా రేకు డబ్బానిండా ప్రోగుజేసుకుని, ఆ ఆకులు తిరిగి ఆ డబ్బాలో పారవేసింది. ఆ మెతుకులామె తనపిల్లలకుపంచి, మిగతా పదార్థం తను తిందామని కూర్చుంది.

ఆమె యిచ్చిన మెతుకులూ, కూరముక్కలూ, నములుతున్నారా కుర్రాళ్ళు అనంత సంతృప్తితో సంతోషంతో, నాట్యం చేస్తూ. మేనేజరులాగే కోపంతో వాళ్ళమీద తీక్ష్ణంగా ఎండకాస్తున్నాడా దీనబాంధవుడు, సూర్యుడు.

వాళ్ళలాగే ఆకులకోసం పరుగెత్తుకు వచ్చిన ఓ ఆవు, ఓ కుర్రాడిచేతిలోని ఆకులాగుకుని వాడిని క్రిందికిత్రోసింది. వాడు క్రిందపడి కెవ్వుమని ఏడుస్తూ దొర్లుతున్నాడు. ఆమె వెంటనే లేచి, అర్థంలేని ఆవేశంతో ఆ ఆవును అవతలకు తరిమి, తనమోము వివర్ణంజేసుకుని వాడిని నాలుగు బాదింది. విసుగుకుంటూ తనుతినే నాలుగు మెతుకుల్లోను కొన్ని వాడికి యిచ్చి కొట్టాననే పశ్చాత్తాపంతో బాధ పడుతూ కళ్ళంటనీళ్లు కారుస్తూ ఆ అన్నం తినేసింది. తన మూతి చేతులూ మాసి పేలునంటిన తనకోక చెంగుతో శుభ్రము జేసుకునివచ్చి నిలబడింది ఆ హోటలుద్వారానికి కొంచెందూరంలో ఓప్రక్కన.

లోపలతిని పెదిమలు చప్పరించుకుంటూ తిరిగి వచ్చే ప్రతీవ్యక్తినీ నిలదీసి అడుగుతూంది ఒకకానీ యిమ్మని, యిచ్చినా యివ్వకపోయినా విచారం లేకుండా.

మేనేజరు తన స్వంతడబ్బు జారిపోతూన్నట్లు బాధపడుతున్నాడు ఆమెచేతిలో ఓ చిల్లరడబ్బు పడగానే. తీరుపడి దొరకినపుడల్లా గద్దిస్తున్నాడామెను నిర్దాక్షిణ్యంగా.

ఇదంతా తన్నుగానట్టు, తనకు సంబంధం లేనట్లు, మౌనంగా తనపని తను నెరవేర్చుతోందామె. రాను రాను అతనిబాధ ఎక్కువవుతూంది. ఇంకచాలు యీ అవస్థ—అనుకుంటూ ఆమె బయలుదేరింది పిల్లలను కూడగట్టుకుని తనయింటికి, పిల్లలదే ఏడుపు ఆకలంటూ.

ఆ వీధిని నడచే మనుష్యుల సమూహంలో యిలాంటి దృశ్యాలనేకం, తనపరిస్థితి కనుగుణ్యమయిన సంఘటనలు తనదృష్టికి తగిలినపుడు, ఆమె హృదయాంతరాళంలో ఏదో మెదలుతూఉంటుంది తనకు తెలీకుండానే, తన ప్రమేయంలేకుండానే. ఆ అనుభవించేవాళ్ళు తనకు మిక్కిలి సన్నిహితుల్లా కనిపిస్తారు. ఇలాంటి దృశ్యాలు దినదినము ఆమెకంటబడడం మామూలే. ఏదో అంతులేని ఆవేదనా బాధా అనుభవిస్తూండడంకూడా మామూలే. ఆమె గ్రహించింది తనలాంటి అవస్థ చాలామంది పడుతున్నారని, కొందరు యిళ్ళలోను, కొందరు వీధుల్లోను, అంతే తేడా. తనకన్న హీనాతిహీనమయిన పరిస్థితుల్లో ఉండి ఎందుకో, ఆనందంగా బ్రతికిపొయ్యే మనుష్యులనేకుల్ని చూచింది.

జీవితం అంత నిగూఢమయినది. అలాంటి వాళ్ళనుజూచే తనలాంటివాళ్ళు జీవించడం.

అసలు యీ ప్రపంచంలో జీవితరహస్యం కూడా అదేనేమో అనిపిస్తుంది. ఉన్నవాళ్ళనుజూచి తనుకూడా వాళ్ళలా బ్రతకాలని కలలుగంటూండడం, తనకన్న లేనివాళ్ళనుజూచి తన అవస్థ చాలా నయమని సమాధానపడుచుకుంటూండడంవల్ల జీవిస్తున్నారీ నాగరిక ప్రపంచంలో ప్రజలు. అలా సమాధానపడని వాళ్ళే ఆత్మహత్యచేసుకునేవాళ్ళూ, అలాకాకుంటే మొండిదేరిన సంఘాన్ని, చట్టాల్ని, ప్రభుత్వాన్ని ఎదిరించేవాళ్ళూను.

దారుణంగా రోదించే పిల్లల నోదార్చలేక పోతూంది. ఆ బజారులో నడచే ప్రతిఒకరూకూడా తన పిల్లలనూ, తన అవస్థనూకూడా ఏవగించుకొని, ఆ త్రోవలో అడుగుం నడవడానికికూడా తనకు హక్కు లేనట్లూ, తనేదో వాళ్ళస్వేచ్ఛలో అర్హతలేని భాగం తీసుకుంటూన్నట్లు యోచిస్తూ, ద్వేషిస్తూ, తీక్ష్ణంగా చూస్తూ పోతున్నారు.

అలాంటి పరిస్థితిలో తనవద్ద కానీ పుచ్చుకునైనా, తనకు కావలసినదిచ్చే కొట్టువాడెవడున్నాడా బజారులో. అది పెద్దబజారు. తనలాంటివాళ్ళా దుకాణాల్లోకి తొంగిచూడ్డానికైనా వీల్లేదు. అది ఆ పిల్లకుంకల కేమి తెలుసు. కుర్రాళ్ళు గోలెట్టినకొద్దీ తన గమనాన్ని తొందరజేస్తూవచ్చింది. ఎంతవేగంగా ఆ పెద్ద మనుషుల బజారు వదులుదామా అని ఉందామెకు.

ఆమె దీనత్వమూ, ఆ పిల్లలఏడుపూ, చుట్టూ నడచేవారి హేయత, అసహ్యాన్నే రెచ్చగొడు

తున్నాయిగానీ, సానుభూతిని, జాలిని మేల్కొల్పలు పడంలేదు.

చాలామంది చూసీచూడనట్లు పోతున్నారు. కొందరు సన్నంగా తిట్లు గొణుగుకుంటూ పోతున్నారు మనిషి అడ్డుపడితే ఆగే ట్రాంకారులాగా. ఇంతకన్నా చేసేదేమీ వారిచేతుల్లో లేదుగనుక.

అమెరికాలో నీగ్రోలని లించి (lynch) చేసే మారణ విధానాలని అనుసరించడాని కేమయినా వీలు చిక్కితే అదీ చేద్దురు కొందరు పెద్దలు.

కాని మన భరతఖండము ఆధ్యాత్మిక దేశంగా. అసలీ ఆధ్యాత్మిక చింతకీ, ఈ అనంత దారిద్ర్యానికీ చాలాదగ్గర సంబంధం ఉంది. ఒకటి లేకపోతే ఒకటి ఉండదు.

అందుకే గాంధీ గారిలాంటి మహానుభావుడు కూడా అనేశాడు సన్నసన్నంగా, డబ్బున్నవాళ్ళూ ఉండాలి, డబ్బు లేనివాళ్ళూ ఉండాలి. ఒకళ్ళ నొకళ్ళు నాశనం చేసుకోగూడదు హింసాయుతంగా. డబ్బులేనివాళ్ళను గర్భదరిద్రులుగా చేయగూడదు. ఆ బాధ్యత డబ్బున్నవాళ్ళది. డబ్బుకీ డబ్బులేనివాళ్ళకీ మధ్యవర్తులు డబ్బున్నవాళ్ళు అన్నారు ఆధ్యాత్మిక చింత నశిస్తుందనే భీతిచే. ఆధ్యాత్మికచింతే పునాదిగా నిర్మింపబడిన భారతజాతి అలాగే ఉండాలని.

అందరి పేదవాళ్ళలాగే ఆమెకూడాను ఆధ్యాత్మిక చింతాశక్తితోనే జీవిస్తూంది. అందుకే కుర్రాళ్లు బుర్రదిమ్మెక్కలాగ ఏడుస్తూ, వాతావరణం, సమాజం కూడా నిర్దాక్షిణ్యంగా చూస్తున్నా జీవించుకొస్తోంది.

అదీగాక ఎవరికి తగిన తావులు వారికి లభిస్తోంటాయి.

ఆమెకోసం కూడా కొట్లున్నాయి ఆ వూళ్ళో. ఏడిచే పిల్లల నూరుకోబెట్టకుండా ఆ పెద్ద(ల) బజారు వదలి సందుగొందుల్లోపడి శీఘ్రగమనం సాగిస్తోందామె.

రోడ్డుమీద దోమాల, ఓ గోడప్రక్క, మురికి కాలువదగ్గర, నేలమీదో గోనె, గోనెమీదో జంగిడీ, దాన్లో ఏవో పదార్థాలూనూ, గోనెమీద కూర్చుని గోడకు తలానుకుని కునికిపాట్లు పడుతున్నాడో ముసలాడు. దుమ్ముధూళి పడుతుందేమోనని దయదలచి కొళోలు ఆ వస్తువులనిండా గాలికూడా పోలేనంత దట్టంగా కప్పుకుని ఉన్నాయి ఈగలు ముసలివాడి నిద్దుర నాధారంచేసుకుని.

అక్కడికువచ్చి నిలబడి "తాతా" అని పిలిచిందామె. ఉలిక్కిపడి లేచి కుశల ప్రశ్నలు వేశాడు ముసలాడామెను. తన కుర్రాళ్ళతో కూర్చుంటూ "ఏమున్నాయి, తాతా" అంది జంగిడికేసి చూస్తూ. "అంతా మామూలే" అన్నాడు చేతిలో గుడ్డతో తన లాగే కునుకుతూన్న ఈగలను కొడుతూ. అన్ని ఈగలూ ఒక్కసారి లేచాయి పెద్ద రొదచేస్తూ. ఆమె తనుగడించిన నాలుగు డబ్బులూతీసి ఆ పిల్లలతో సహా ఏదో కొంత తిని చేతులు తుడుచుకుంది. కొంతసేపు తాతతో 'పిచ్చాపాటి' మాట్లాడేసరికి చీకటి పడ వస్తూంది. ప్రక్కగా, ఆనందంతో, అమాయకంగా ఆటలాడే పిల్లలను పిలిచి, తాతదగ్గర శెలవు తీసుకుని బయలుదేరింది తన బసకు. కాలే కడుపులో మంట రాలాయి కొన్నేళ్ళు.

ఊరంతా మాత్రం దీపాలతో నిండింది ఆకాశంలాగే. ప్రతీ యింటినుండి ఓ దీపం ఎర్రగా పరుగెడుతూంది. ప్రతీయిల్లూ జీవితంతో కలకల్లాడుతోంది.

ఆమె ముందు వెనకా నడిచే తనపిల్లల వైపొక సారి దృష్టి మరల్చింది. ఆమె ముఖంలో ఏదో అనిర్దిష్టమైన ఆవేశం గోచరిస్తూంది. కొంచెం త్వరగా నడవటం మొదలెట్టింది. పిట్టలకూతలు అప్పుడప్పుడు వినిపిస్తున్నాయి. ఊరు చివరకు వచ్చిందామె. పిల్లలు తిప్పట్లుకొట్టుకుంటూ గంతుతూ తల్లి వెంట వస్తున్నారు. ఆమె తిన్నగా చెంతనున్న ఓ పెద్ద చింతచెట్టువద్ద చేరింది. అదే ఆమె యిల్లు.

ఆ ప్రదేశం చాలా ప్రాణులకి స్థావరం.

అప్పటికే ఆమె స్నేహితులు చాలామంది వారి వారి స్థానాల్లో నిద్రపోతున్నారు. ఆమె జాగా మాత్రం ఖాళీగా వదలివేయబడింది. తన యినుప డబ్బా లా చెట్టుమొదట ఓ ప్రక్క ఉంచింది. చెట్టు తొఱ్ఱలో జాగ్రత్తపరచిన రెండు గోనెలు, చింకి గుడ్డలు తీసి నేలమీదపరచి, పిల్లలను పడుకోబెట్టింది. ఆ ప్రక్కగానున్న చెరువుకుపోయి ఓ డబ్బాతో నీళ్ళు తెచ్చుకుని ఓప్రక్కగా ఉంచుకుంది. తను నిద్రపోతున్న కుఱ్ఱవాళ్ళప్రక్క కూర్చుని రెప్పవాల్చకుండా వాళ్ళ నవలోకిస్తోంది.

నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ, దూరాన్నుండి వినిపిస్తోంది మధురంగా ఓ పక్షిపాట. గాలిత్రోపుడుకు చెట్టు

నెమ్మదిగా ఊగుతూంది చిన్న శబ్దంచేస్తూ. చెట్టు కొమ్మల ఖాళీస్థలాలలోనుంచి చంద్రకాంతి ఆమెమీద పడుతూంది అప్పుడప్పుడు. చెదరి కదలుతూన్న ఆమె కురులు ఆ పండు వెన్నెలను స్పృశించినపుడు బంగారు తీగల్లా మెరసిపోతున్నాయి. ఆమె శరీరంకూడా తెల్లగా కనిపిస్తోంది జాబిల్లి తెల్లదనంలో. వెన్నెల స్థిరంగాఉన్న ప్రదేశానికి జరిగి, చంద్రునివైపు శూన్య దృక్కులుబరపి చూస్తూంది. ఏదో కూనిరాగంతీసింది మెల్లగా.

హృదయం శూన్యంగా ఉన్నపుడు, ఆలోచన తట్టినపుడే సాధారణంగా యీ మందరాగాలాపన వస్తుందేమో!

ఆమెకు హఠాత్తుగా "ఈలాంటి బ్రతుక్కన్న చస్తే నయం" అనిపించినట్లయింది. ఆమెకు తెలీకుండానే శరీరం సర్వం గగుర్పొడిచింది. "అమ్మో" అంది పైకి మెల్లగా. పడుకున్నవాళ్ళు ఎవరయినా లేచారేమోనని చుట్టూ కలయజూచింది కలవరపడి. సంతృప్తిపడింది ఎవరికీ నిద్రాభంగం కలగకపోడంవల్ల. ఆ చెట్టుక్రింద నున్నవాళ్ళంతా గాఢంగా నిద్రపోతున్నారు సర్వాన్ని మరచి.

ఏమీ అలికిడిలేదు. కీచురాళ్లుమాత్రం సంగీతం పాడుతున్నాయి. ఒక్కరూ అర్ధరాత్రి ఒంటరిగా కూర్చుంటే కీచురాళ్ళ కర్ణకఠోరమయిన గోలకూడా ఎంత మధురంగా వినిపిస్తుంది! దీనికి తోడు ఉదారంగా ఒలకపోస్తున్నాడు చల్లని వెన్నెల.

ఆమె అలాగే కూర్చుంది. ఏ మాలోచిస్తోందో ఆ నిశ్శబ్దనిశీథినిలో. ఆమెకు ఆలోచించడాని కేముంది?

ఏమీలేనివాళ్ళకే ఎన్ని ఆలోచనలయినా !!!

ఆమెకున్నదల్లా ఒకటే ఆలోచన. ఒకరోజు గడిస్తే రెండోరోజు సమస్య. గడచినరోజుల్లోని సౌఖ్యం! అంతే. చద్దామనే ఆలోచన హఠాత్తుగా మెరపిందామెహృదయంలో. బ్రతుకుదామనే ఆశ తన శాయశక్తులా సాధ్యమయినంతవరకు నిరాశను, ఆత్మహత్యనీ దూరంగానే నిలబెడుతుంది. కాని యీ రెండూ అదనుచూచుకుని ఒక్క గంతేస్తాయి దగ్గరకి. మళ్ళీ పోట్లాట! ఈ పోట్లాటే మనుష్యుల బాధ. అదిలేకపోతే బాధేలేదు. ఉన్ననాల్గురోజులూ ఏదో తినడం, లేనివాడు అన్నం తిన్నట్లుగానే ప్రాణంపీక్కుని చచ్చిపోడం మామూలయిపోను!

ఈ మెట్టవేదాంతాలన్నీ ఆమె కేమాత్రం తెలీవు, ఏదో జీవితప్రవాహంలో కొట్టుకుపోడం తప్ప. ఏదో తెలీని ఆవేదనా, బాధతో ఆమె హృదయం బరువెక్కింది. ఎందుకో ఆమె గ్రహించకుండానే కన్నుల నుండి నీరుకారుతూంది మెల్లమెల్లగా. మాసి మలినమయిన ఆమె కట్టుబట్టలపైబడి ఆ కన్నీరు రబ్బరు ఉండల్లా తూలుతూంది క్రిందకు చిందరవందరయి. మళ్ళీ ఏదో అస్పష్టంగా మాత్స్యంగా పాడుతూంది, అక్కడ పడుకున్న మిగతావాళ్ళమాట మరచిపోకుండా. ఆకస్మికంగా ఏదో సవ్వడి వినిపించింది. సంభ్రమంతో వెనుదిరిగి చూచింది వణుకుతూ.

ఎవరో వ్యక్తి తనవైపుకే వస్తూన్నాడు. ఇలాటి విషయాలు, అనుభవాలు మామూలే. చాలామంది చాలాసార్లు వస్తూంటారు ఆ చెట్టుక్రిందకు. తనగురించికూడా వస్తూంటారనే ఆమె అనుమానం. చాలా విచిత్రమయిన మాటలూ, వాగ్దానాలూ ఆ కాస్సేపూను. తనకుమాత్రం అదో విచిత్రమయిన నాటకంలా తోస్తుంది. తన అంతరాత్మ కెదురుగా ఆ నాటకంలో తన పాత్రను తను నిర్వహించకుండా ఉండలేకపోతూంది.

దీనికంతకూ కారణచింతన బాహ్యపరిస్థితు లేనని ఆమె కేంతెలుసు?

నైతికంగా క్రిందికి దిగజారిపోయేవారిని జూస్తే సంఘానికి అసహ్యమూ, కోపమేగాని వారి పతనానికి గల కారణాలనుగూర్చి ఆలోచిస్తే ఎంత బాగుండును; అసలు ప్రస్తుతపు సంఘానికి పునాదులే ఆ కారణాలయినప్పుడు.

ఆమె కాస్త వెనక్కిజరిగి కూర్చుంది. ఇప్పుడామెపై పూర్తిగా పడుతూంది చంద్రరోచిస్సు. ఏదో చాలా ఎరుగున్నవాడిలా, ఆ వ్యక్తి సరాసరి ఆమెకెదురుగా కూర్చున్నాడు, గబాగబావచ్చి. అంతనిస్సంకోచంగా, మోటుగా, ప్రవర్తించే ఆ వ్యక్తిని చూస్తే ఆమెకు అమిత అసహ్యంవేసింది. కాస్త మనస్సులో కలవరపడిందికూడ.

ఇద్దరూ ఒకరి కెదురుగా ఒకరు నిశ్శబ్దంగా కూర్చున్నారు. వెన్నెలలో కూర్చున్న అతని మోము స్పష్టంగా కనిపిస్తోందామెకు. దట్టంగా పెరిగినగడ్డం,

సంధ్రదనిముఖంలో ఎఱ్ఱగా కఱకుగా జూచే ఆ గ్రుడ్లు, గిరజాలు తిరిగి దుబ్బులా తలంటా అటంబాంబు పొగలా పైకిలేచి నిలబడి గాలికి చలించిన అతనిజుట్టూ, అతి నిరసనగాను, నిరహంకారంగానూ కన్పడే అతని ప్రవర్తనా, ఆమెకు జుగుప్స, హేయతా కలుగజేశాయి. అతనుమాత్రం ఎందుకో చిద్విలాసం జారవిడుస్తున్నాడు పళ్ళనుస్యమండి. కాలంగడుస్తూం దీ గ్రహాల మధ్యనుండి. ఆమెకు యింక ఉండబట్టలేదు.

"ఎవరు నువ్వు!" అంది హీనస్వరంలో.

"నానా" అన్నాడు నసుగుతూ.

"ఆ" అందికోపంతో.

"ఆ" అంటూ దీర్ఘంతీశాడు, చిరునవ్వుతో మాట్లాడడానికి అనుమానిస్తున్నట్లు.

"సాప్వ"

"చెప్పడానికేముంది. నానే"

"ఎందుకొచ్చావిక్కడికి,"

"కొంత పనుండి" అన్నాడు తలెత్తి.

"ఏటాపని" అంది వికారంగా.

కోపంతో ఎఱ్ఱపడిన ఆమె కన్నులు చంద్రకాంతిలో మండుతున్నాయి; చీకట్లో పెద్దపులికండ్లు ప్రకాశించినట్లు.

ఇప్పుడతను జంకుతున్నట్లు స్పష్టంగా కనిపిస్తోం దాతని ముఖకళలలో. మాట్లాడలేక తలగోక్కుంటున్నాడు. ఆమె రెప్పవాల్చకుండా అలాగే చూస్తూ—

"ఏటా పనిచెప్పు" అంది.

"యేమీలేదు. నీకుమాత్రం తెలీదేటి?"

"యేటో చెప్పు" అంది అతని సరళి స్వభావాన్నాధారంచేసుకుని.

"యేవుంది" అని నసిగాడు ఆమె కళ్ళల్లోకి తీవ్రంగా జూస్తూ.

అతనలా రెప్పవాల్చకుండా తన కళ్ళల్లోకి చూస్తూంటే, అతనివైపు చూడలేక తలవంచుకుంది. అలాగే కూర్చున్నారిద్దరూ కొంతకాలంపాటు. తనతల అప్రయత్నంగా ఎత్తిందామె. ఆ వ్యక్తిమాత్రం రెప్పవాల్చకుండా తనవైపు అలాగే చూస్తున్నాడు మదురి మీది కోకిలాగ.

"ఆ. ఏమంటావు!" అన్నాడతను శూన్యంగా చూస్తూ.

"ఫో, అవతలకుఫో" అంది నెమ్మదిగా కోపాన్ని కుదించి.

అప్పుడామె కంఠంలో వత్సరాల తరబడి తను అనుభవిస్తున్న బాధ,నీచత్వమూ,తన్నావరించిన ఓర్పూ కలసి ప్రతిధ్వనించాయి. అతిదీనంగా ఆమెముఖం కనిపిస్తోంది.

అతడామెవైపుచూచి కొంచెం సంతృప్తి పొందినట్లు చిరునవ్వు నవ్వుతున్నాడు.

ఆమె కళ్ళల్లోనుండి జారే నీటిబిందువులు ఆ నిండువెన్నెల్లో, నింగినుండి జారేతారల్లా కనిపించుంటాయేమో బహుశా. లేకపోతే ఆ శుభ్రజ్యోత్స్నలో చలించే ఆమె కురులు తప్పకుండా అతని కన్నులకు మబ్బుల్లో మాయమయ్యే మెరుపుల్లా గోచరించి ఉంటాయి.

అందుకే నవ్వుతున్నాడు.

అప్పుడామెకు నిజంగా కోపంవచ్చింది. అయినా ఏంచేతో ఆమె చల్లగా సీమకుక్కపిల్లలా చూస్తూ "యింకెల్లు - పోలు-ఫో" అంది నెమ్మదిగా, నిర్లక్ష్యంగా.

అతడుమాత్రం తనకు గానట్లుచూస్తూ, జేబు నుండి కొన్ని రూపాయినోట్లుతీసి అవిచేతుల్లో ఆడిస్తూ నిలబడ్డాడు; లంచంపుచ్చుకునే అధికారివద్ద నిలబడ్డ నల్లబజారు వర్తకుడిలాగ. అవి వెంటనే ఆమె దృష్టినాకర్షించకపోలేదు. ఆమె ఆశతో ఆ నోట్లవైపు చూసింది. అతని చూపులలోనికి కూడా చూసింది, తన కనుగొలకులలోనుండి సన్నంగా. తన వేవో అతడు తీసుకున్నట్లు తిరిగి యిమ్మని అర్థిస్తున్నట్లు, అనందిస్తూ, మధురంగా మనస్సు గంతులు వేస్తుంటే, తన్ను తాను మరచి వెర్రిగా తదేకదృష్టితో అతనివైపు చూస్తోంది.

అతడు తన విజయానికి సంతృప్తిపడి ఒకసారి చిన్నగా నవ్వుకుని ఆ నోట్లు తనజేబులోనికి పోనిచ్చాడు. "ఏం" అన్నాడు మళ్ళీ.

ఆ నోట్లు అదృశ్యమవగానే ఆమె ఆలోచనలన్నీ కరెంటు తెగిన ఎలక్ట్రిక్ కాంతిలాగ మాయమయ్యాయి. వెంటనే తిరిగి తన యథాస్థానానికి వచ్చింది భావనా ప్రపంచంలోంచి. వాడు ఆమె మౌనం ఆధారంగా తీసుకుని కొంత దగ్గరగా జరిగాడు. ఆమె తీవ్రంగా మరోసారి అతనివైపు చూచింది-వాడు కొంత ఖంగారుపడ్డాడు-హఠాత్తుగా అరుస్తుందేమో

నని భయపడ్డాను. అయినా తన నిర్లక్ష్యమును వదలలేదు. ఆమె కోపంతో "ఎళ్ళమంటే—ఏటిది?" అంది.

కోపం తప్ప మరోరసం కాన్పించని ఆమె మోము చూసేసరికి అతని నిర్లక్ష్యం పారిపోయింది. తన కిష్టంలేకపోయినా తనకాళ్ళు లేవనెత్తా యతన్ని—మాట్లాడకుండా బరువుగా లేచి నిలబడి, పాశా నిన్నట్లు, నిరాశగా చూశాడామె కళ్ళలోకి కోపంలో బంగారంలా మెరిసిపోతున్నాయి ఆమె కళ్ళు.

అతడు చింకి పంట్లాం జేబుల్లోకి చేతులుదూర్చి వెనుదిరిగి తలూపుతూ పోతున్నాడు, నెమ్మదిగా అడుగులు లెక్క పెట్టుకుంటూ. అతికష్టంమీద కాళ్ళు కదుపుతున్నాడు తనకు తెలీనట్టుగా.

ఆమె నిర్వికారంగా, శూన్యంగా, వెనుదిరిగి పోయే ఆ వ్యక్తివైపు చూస్తూంది. ఆ రూపాయల గూర్చి ఆమె మనస్సులోకి విద్యుల్లతల్లా వస్తున్నాయి ఆలోచనలు. అనేక వాంఛలు. అనేక అనంతదృశ్యాలు చిత్రించుకుంటూంది కట్టినే. అంతరాత్మ వాడిని పిలవమని బలవంతపెడుతూంది. అలాగే మరోమూలనుండి అమితి అసహ్యం, ద్వేషం రగుల్కొలుపుతూంది. ఆమెకు నైతికసందేహాలేమీ లేవు. తనకిలాంటి పనులు సామాన్యము. తనజీవితము అలాగే గడుస్తోంది.

ఆ అవస్థలో పాపపుణ్యాలకు తావేలేదు. ఒకవేళ ఆ బీదతనంలో, ఆ నీచస్థితిలో ప్రజలనుకునే పుణ్యమార్గంలో నడిచినా పాపంలాగే పరిగణించబడుతుంది. సంఘంలో డబ్బున్నవాళ్ళంత విచిత్రంగా కాలం వెళ్ళబుచ్చవచ్చు, పాపపుణ్యాల లెక్కలేకుండానే వాటిని బీదవాళ్ళకు ప్రబోధిస్తూ.

ఈరోజు ఆమె అతనిని తిరస్కరించడానికి కారణం ఆమెకు బోధపడలేదు.

బహుశా అతని బాహ్యస్వరూప ప్రవర్తనలేనేమో!

అయినా తనంత తెలివితక్కువగా ప్రవర్తించడం తలచుకుని తన్నుతానే నిందించుకుంది. అయినాగాని తన కతని బాహ్యస్వరూపంతో సంబంధం లేదనుకుంది మళ్ళీ. తనకు కావలసింది డబ్బూ, జీవించడమూను. అంతే. అతనంత మోటుగాను, నిర్లక్ష్యంగాను ప్రవర్తించడమేం?- అనుకుంది తనలో తను. తనుచస్తే తిరిగి పిలవకూడదు—యింతకీ తన కిష్టంలేదు- అని తమాయించుకుంది హృదయపోరాటం.

ఆ రూపాయలు మాత్రం మెరుస్తున్నాయి, మాట్లాడుతున్నాయి! అవ్యక్తంగా. వెధవరూపాయలు అలాటివెన్ని కావాలి యీ దరిద్రసాగరంలో కొట్టుపోయే తనకు.

కొంతదూరంలో నిలబడి ఆ వ్యక్తి తనవైపే చూస్తున్నాడు పిచ్చిగా. ఆ చూపుకో లేక అతని జేబులో డబ్బు గోలకో ఆమె లొంగిపోయింది. రమ్మన్నట్టు చెయ్యూపింది.

ఆ సంజ్ఞ కనీ కనబడటంతోనే, అంగలు వేసుకుంటూవచ్చి నిముషం ఆమెముందు నిలబడ్డాడు. ఆమె కెదురుగా, అతి చనువుగా, దగ్గరగా ఆమె బంధువులా కూర్చున్నాడు.

కొంతసేపు మళ్ళీ మనస్సుతో పెనగులాడిందామె, తన దృష్టిభూమిలోకి గ్రుచ్చుతూ.

ఇద్దరూ అలా మౌనంగా కూర్చున్నారు నిశ్చలంగా. అతడు జేబులోని రూపాయిలను తీసి ఆమె ముందుపడేశాడు. ఆమె క్రీగంట చూసిందాతనివైపు ఒకసారి, ఆ డబ్బువైపొకసారీను. ఆమెను తాకాలన్న ఉద్రేకంకొద్దీ ఆ రూపాయిలనుదీసి ఆమెచేతిలో ఉంచాడు బలవంతంగా.

ఆమె అలాగే కూర్చుంది. మనస్సులో ముసలి కోమటి కొట్టు, దొంగచాకలి యిల్లు, కాఫీహోటలు మెదలుతున్నాయి. దొంగచాకలిదగ్గర చింకిచీర కొనుక్కోవచ్చును. రెండుమూడురోజులు అయ్యరుబాధ, మనుషుల అల్లరీ తప్పుతుంది. కష్టపడకుండా కడుపు నిండుతుంది. అని లెక్కలు గుణించుకుంది. మెల్లగా, గురక పెట్టి నిద్రపోతూన్న పిల్లల తలక్రిందుగా ఉన్న గోనెసంచీక్రింద భద్రపరచింది ఆ పారూయినోట్లు.

లేచినుంచుని కోక సర్దుకుంటూ "అలా పోదాం పద" అంది నాజూగ్గా సిగ్గుతో.

"యేవి"? అన్నాడు ప్రశ్నార్థకంగా చూస్తూ.

"మనం గట్టిగా మాట్లాడితే తొంగునోళ్ళు లేస్తారు" అంది ముందు దారితీస్తూ.

అతడు మాట్లాడకుండా మంత్రముగ్ధుడిలా ఆమె వెనకాలే నడుస్తున్నాడు మౌనంగా. కొంతదూరం నడిచాక ఆమెచేయి తన చేతిలోకి తీసుకున్నాడు వాడు. ఆమె మాట్లాడలేదు. ఇద్దరూ పరాపరి నడుస్తున్నారు.

చంద్రుడు చల్లగా నవ్వుతున్నాడు, ఆ చెట్టుకు ముప్పయి, నలభైగజాలదూరంలో మరో చెట్టుందా

చెరువుగట్టుమీద. ఆ చెట్టు ఆమె అభిమానస్థలము. ఆ చెట్టను, ఆ స్థలాన్ని జూచి ఆమె మురిసిపోతూంటుంది. ఆ చెట్టు యింకొ కొంచెం దూరం ఉంటుంది.

అతడామె చేతినివదలి, బుజాన్ని పట్టుకు తనకామెను ఆనించికొని ఆమె శరీరస్పర్శవల్ల కలిగిన ఆనందంతో మత్తుగా నవ్వుతున్నాడు. ఆమె మారు మాట్లాడక అతని స్వంతవస్తువులాగ, అతని సందిట్లో యిరికి సమంగా అతని కనుగుణంగా నడుస్తోంది. ఇద్దరూ ఆ చెట్టుక్రింద చెరువుగట్టున కూర్చున్నారు. ఆమెవైపు జూస్తూ, ఆమె చేతిని నలుపుతూ "యేం, నే నేరో యిప్పుడు తెలిసిందా" అన్నాడు నవ్వుతూ.

"నే నేం బావుంటానని చెప్పి నా వెనకాల బడ్డావ్" అంది ఏదో ఆలోచిస్తూ.

"ఘట్టుగా యుంటావ్" అని కాస్సేపూరుకున్నాడు.

"సుభ్రంగా తానం జేసి మంచిబట్టలు కట్టుకుంటే సరి" అన్నాడు మళ్ళీ.

"ఏటో అందాని కేటిలే! తానం సేసి కట్టుకోడానికి మరోగుడ్డేదీ!" అని తలదించి మౌనంగా కూర్చుందామె. ఇద్దరూకూడా అలా మాట్లాడుకోకుండా ఆలోచిస్తూ శూన్యంగా చెరువువైపు చూస్తూ కూర్చున్నారు.

చంద్రకాంతి చెరువులో నీటిమీదపడి గాలికి చలించే జలాన్నంతనూ పసిడిముద్దలా మార్చింది. కాస్త గాలి యెక్కువగా తిరిగితే అలలు నగిషీ చెక్కుతున్నాయి. దూరంనుండి నక్క కూస్తోంది కఠోరంగా.

అతడు హఠాత్తుగా తన స్వంతవస్తువు పోగొట్టుకున్నట్లు అనుమానపడి చుట్టూ వెతికినట్లుగా ఆమెవైపు జూశాడు.

"మరి మొదటపొమ్మని మళ్ళా ఎందుకురమ్మన్నావ్."

"డబ్బు. డబ్బుకోసం" అందామె.

"అయితే నేనంటే యిట్టం నేదన్న మాట"

"హూ" అని కొస్తనవ్వింది నిర్లక్ష్యంగా.

"యేయి?" అన్నాడు.

"నువ్వంటే చెప్పలేనంత అసహ్యం" అందామె.

"ఎంచేత" అన్నాడతడు మళ్ళీ.

"నీమొకం సూత్తే అలాగుంది. యిక నీబుద్ది తెలాటిమ్మో"

"అయితే యిట్టం నేకుండానే వచ్చావన్నమాట యిక్కడికి" అన్నాడాతడు పరుషంగా.

"చెప్పాగా—డబ్బుకోసం—" అంది అది మళ్ళీ.

"రోదవడబ్బు! డబ్బుకోసం! డబ్బు" అన్నాడు విసుగ్గా.

"ఆ—డబ్బుకోసమే, డబ్బు ఎలా వస్తాది ఆడదానికి."

"కూలివాలి జేసుకోరాదు!"

"ఎందుకు కూడదు! అక్కడుంటారు నీలాటి మొగాళ్ళు."

"మరి బతికేవాళ్లో."

"బతికేవాళ్ళు బతుకుతున్నారు. నేనూ బతుకుతున్నాను. తేడా అంతే."

"ఆహా" అన్నాడు ఒళ్ళువిరుచుకుంటూ.

"ఆడది యిల్లుదాటితే చాలు మనపజల్లో—యిక మొగాడులేడు, దిక్కులేదని తెలిస్తే మరీని" అంది యీ ప్రపంచంలో మగవాళ్ళనందరినీ మారణహోమం చేయాలని తలపిస్తూన్నట్లు.

"పోనిద్దూ—అగోడవ" అన్నాడతను ఆమె దగ్గరగా జరిగి. "అయితే మగాళ్ళంతా అంతే నేటి" అన్నాడు మళ్ళీ.

"అంతే. నువ్వు నీమాట మాద్దూ"

"అందరూ అనాగుంటే యీ పపంచకమే నేదు. అన్నిరకాలవోళ్ళుంటారు. నామాటకేం. నాను నీకు చెప్పనే చెప్పాను." అంటూ ఆమెను తనచేతులలోనికి లాక్కుని తనగుండెకు గట్టిగా అదుముకున్నాడు.

"నిన్ను చూత్తే నా కందుకే సంతోషం" అన్నాడు.

"యేం?" అంది చిల్కలాగ సిగ్గుతో తలవంచి.

"ఉన్నదున్నట్టు, కచ్చితంగా చెప్పేవాళ్ళంటే నాకు షానా యిట్టం"

"అలా అందరూ చెప్పొద్దూ"

నే చెప్పడంలా నీకు" అన్నాడామెవైపు జూస్తూ.

"అందుకే నాకూ యిట్టం నీవంటే" అందామె.

ఆ మాట వినేసరికి అతనికి ఏదో అర్థంకాని ఆనందంవచ్చింది. ఆప్యాయంగా, ఆమెను తన బలమయినచేతులతో, ఛాతీమధ్య నిరికించి, శక్తికొద్దీ ఆమె ప్రాణం, తన ప్రాణంకూడా ఒక్కసారి ఎగిరిపోయే

లాగ వలిచేశాడు. ఇద్దరూ తీవ్రంగా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు విడుస్తున్నారు. కొంచెం కాలంపోయాక నిశ్శబ్దాన్ని వేరుచేస్తూ "అలాగా" అందామె అక్షరాలన్నీ ఆయాసంతో వేరు వేరవుతూండగా. అతడామెను తన తొడలమీద పడుకోబెట్టుకుని ఆమెముఖంలోకి చూస్తున్నాడు. ఆమెకూడా ఉన్మాదంగా వాడి కళ్ళలోకి చూస్తోంది. అతడామెను పిచ్చిగా ముద్దెట్టుకుంటూ "నన్ను పెళ్ళాడతావేటి" అన్నాడు నవ్వుతూ.

"అదొక్కటే లోటు మనిద్దరికీ" అందామె.

"యేం?" అన్నాడు తీక్ష్ణంగా చూస్తూ.

"నాకు పెళ్ళేటి నీమొకం"

"యేంచేత సెపుదూ"

"నన్ను పెళ్లాడి నువుతలెత్తుకు బతికే జేటికే"

"మన కలాటిబతుకూ లేపీ లేపు తెల్సిందా?"

"యిలా సావాసమందయారు. యేవో యిలా పిచ్చి పిచ్చికబుర్లు సెప్పడం, పోసం, మామూలే. మరికొందరయితే నన్నో దెయ్యంలా సూసేవారు. యెందుకొచ్చినగొడవలే యెల్లింక" అందామె గర్వంగా.

"కాదు, నిజంసెప్తున్నా" అన్నాడు మళ్ళీ రెట్టిస్తూ.

"అదే పిచ్చివాయనా, నాబతుకు తలపుకొస్తే నువు బతికేదేటి నలుగురిలో తలెత్తుకుని! నా కతకొత్త యింటే పెళ్ళిమాట మరచిపరుగెడతావ్. యెందుకులే ఆ మాటలు? ఊరుకో." అంది చల్ల చల్లగా ఆకులమీద నుండి రాలే మంచుచుక్కల్లా మాటలు జారవిడుస్తూ.

"అకతేటో కొత్త సెపుదూ యింటా"

"అయితే రా ఆ సెట్టుమొదలికి, సెప్తా." అని లేచి ముందునడక ఆరంభించింది, వాడు లేచాడో లేదో తనకు సంబంధించనట్లు.

అతడుకూడా లేచి ఆమె వెనకాల నిశ్శబ్దంగా నడుస్తున్నాడు. ఇద్దరూ పోయి ఆ చిమ్మచీకట్లో కూర్చున్నారు. వాడామెను తనఒడిలో చేర్చుకుని, మూతిపై ముద్దెట్టుకుని, వేగంగా చెప్పమన్నాడామె చరిత్రను.

నిజాని కామెలోని ఉద్రేకపూరితమయిన అభిప్రాయాలను వ్యక్తం చెయడానికి తగిన వాక్ సామర్థ్యం లేదు. తికమక పడుతూ నోటంట మాటలాడలేక పోయింది.

కొంచెంకాలం గడిచాక "నా కథకేముంది మామూలే" అంటూ నసిగేసింది.

ఆమె సిగ్గుపడుతూందేమో అనుకున్నాడతను. చెప్పు, చెప్పమంటూ మళ్ళీ వేధించడం మొదలు పెట్టాడు.

"ఇంతవరకూ నేను తిండికోసం చేయరానిపని లేదు. హోటేలు పక్క పుల్లాకుల్లో ఎంగిలి మెతుకులు కూడా తిన్నాను. తింటున్నాను." అని బాధతో నవ్వుతూ అతనివేపు చూసింది. మళ్ళీ కొంతసేపూరుకుని "నీలాగే ఎంతమందితో ..."అని చెప్పలేక తల వాల్చుకుంది. "నా అవస్థ, యీ పిల్లలను చూస్తూ ఎందుకిలా నన్ను వెంటాడుతున్నావ్" అంది దించిన ముఖం ఎత్తకుండానే.

అతడుమాత్రం నిశ్చలంగా వింటున్నాడు. ఆమె యింక మాట్లాడలేదు.

"అంతేనా" అన్నాడు తేలిగ్గా.

ఆమె మౌనంగానే కూర్చుంది.

"అందుకే నచ్చావు నాకు నీవు అలా నిక్కచ్చిగా సెప్పాలి నిజం. యెనకటి యిసయం వదిలేయి. నాకు నచ్చింది నీ సంగతి అంతే." అంటూ ఆమెను బలంగా అర్థంలేని ఆనందంతో తన హృదయానికి హత్తుకున్నాడు.

అలా ఆ చెట్టుమొదట ఆ వ్యక్తులిద్దరూ నిశీథంలో తాచుపాముల్లా పెన వేసుకుపోయారు.

## 2

వేకువపోకింది. పక్షులువాటి గూళ్ళనుండి కలకలంతో లేస్తున్నాయి. బద్ధకంవిరుచుకుంటే కాబోలా కలకలం. చీకటి క్రమక్రమంగా పోవడం, దాని స్థానంలో అలాగే వెలుగుప్రవేశించడం అనే యీ పరిణామం హృదయానందకరం. అనుభవించగలగడమే కాని వర్ణించడం చాలాకష్టం. పై ఆకాశంఅంతా మామూలుగానే నీలంగా ఉంటుంది. వాతావరణంమాత్రం తెల్లబడుతుంది. ఈ వెండి తెలుపులో వినీలాకాశం విచిత్ర శోభతో వికసిస్తూంటుంది. సూర్యుడుదయించేకాలానికి సరిగా చుట్టు ప్రక్కలనున్న చిన్నచిన్న మేఘాలు రంగురంగుల వేషాలు ధరించి గుంపుగుంపులుగా సూర్యుడికి స్వాగతమిస్తూంటాయి. అప్పుడుమాత్రం ప్రశాంతత విస్తరించుకు కూర్చుంటుంది కాలంప్రక్కన కబుర్లుచెబుతూ.

ఊరిబయట చెరువుప్రక్కనున్న పెద్దచెట్టు మీదనున్న పక్షులతోపాటు క్రింద నివసించే జనం కూడా మామూలుగాలేచి ఒకళ్ళనొకళ్ళు పలకరించుకున్నారు. కాస్త పొద్దెక్కగానే ఆ ప్రదేశాన్ని చాలామంది ఖాళీచేశారు ఎవళ్ళో ఒకళ్ళిద్దరు; సోమరితనాన్ని తినేసోదరులు తప్ప!

ఆరోజు ఆమె మామూలుప్రకారం లేవలేదు.

ఆమె లేవలేదని పట్టించుకునే వాళ్ళెవరూలేరు. అప్పుడప్పుడలా జరగడంకూడా కద్దు.

పిల్లలులేచి ఆమెమీదపడి అల్లరిచేశారు. అయినా లేవలేదామె. అలాగేపడుంది రాయిలాగ. కుర్రాళ్లు కాస్తదూరంలో ఆడుకుంటున్నారు.

మధ్యాహ్నం పన్నెండుగంటలయింది. ఆ కుర్రాళ్ళు ఆకలికి సహించకలేక కొబోలు ఆమెమీద పడి ఎలాగోలేపారు ఆమెను. ఆమెలేచి నాలుగువేపులా చూచింది వికారంగా కళ్ళునిరుచుకుంటూ. పొద్దు నాటెగాఉంది. "అంతాపోయారు" అని గొణుగు కుంది. కుర్రాళ్లవైపు ఆప్యాయంగా చూస్తూ "పాప పొద్దెక్కిపోయింది" అనుకుంది.

రాత్రి తెచ్చుకుని ఉంచుకున్న డబ్బాడు నీళ్ళతోటి మొఖం కడుక్కుంది గబగబా. తన సామానంతా ఆ చింకిగోనెలో చుట్టబెట్టి పెట్టిలాంటి ఆ చెట్టు తొఱ్ఱలో జాగ్రత్తపరచింది. నేలమీద నున్న రెండు రూపాయిలుతీసుకుని పిల్లలను వెంటబెట్టుకు తన పాత స్నేహితుడైన ముసలికోమటి కొట్టుకు దారితీసింది. ఈగలతో యుద్ధంచేస్తూ రొజుతూ ఉన్న ఆ ముసలాడిని పలుకరించి, ఆ రొట్టెలు కొనుక్కొని పిల్లలూ తనూ తిని మళ్ళీ సాయంత్రానికికూడా కొనిపట్టుకొని తిరిగి వెళ్లింది చెట్టునీడకు.

చల్లటి ఆ చెట్టునీడ అయోమయంఅయిన వాళ్ళ జీవితాలకు కాస్త స్వర్గసుఖం చవిచూపిస్తోందేమో!

"అంత సౌఖ్యంగా, నిర్విచారంగా, చల్లటి చెట్టు నీడల్లో ఆనందం, సంతృప్తి అనుభవిస్తూ, ఖాళాసాగా, స్వేచ్ఛగా జీవితంగడుపుకొంటూన్న అస్వతంత్రవ్యక్తులను రెచ్చగొట్టి శాంతిని భగ్నంచేస్తూ మానవహింసకు తోడ్పడేటట్లు చేసే వ్యక్తులు, సంస్థలూ బయలు దేరాయి." అన్నాడో మహాకవి.

ఏమిటో యీవర్ణనకి అర్థం!!!

అలా చెట్టునతేరబడి కూర్చుంది. ఎండతీవ్రంగా ఉంది. మరల రెండురోజులవరకూ హోటేలు మేనేజరు బాధ తప్పిందనే సంతోషంతో ఆమెముఖం వికసించింది. రూపాయినోటు చేతులో యిటూ అటూ త్రిప్పింది. మిగతా చిల్లరను రెండుమూడుసార్లు అభిమానంతో లెక్కపెట్టుకుంది. కుర్రాళ్ళు నేలమీద పడుకుని నిద్రపోతున్నారు. ఆమె సంతృప్తితో చూచిందటువైపు.

ఎండవేడి చాల హెచ్చుగాఉంది. వేడిని చిమ్ముతూ అప్పుడప్పుడు గాడ్పులు కొడుతూన్నాయి. దూరాన్నుండి నేలమీద ఆవిరి బయలుదేరినట్లు కనిపిస్తూంది. చెట్టు ఆకులు చల్లగా రాలి క్రిందపడుతున్నాయి అప్పుడప్పుడు. చెట్టుమీదనుండి ఒక చిన్న పక్షిపిల్ల క్రిందపడి గిలగిలా కొట్టుకుని అరుస్తూ చనిపోయింది.

అప్రయత్నంగా ఆమె కన్నులనుండి రెండు నీటిచుక్కలు రాలాయి. చనిపోయిన పక్షి నామె దూరంగా పారవైచి తన పూర్వస్థానంలో ఆసీన అయింది. ఆమెముఖంలో కళమారింది. ఏదో అర్థం కాని ఉద్రేకం గోచరిస్తూంది స్పష్టంగా. ఆమె మనస్సును వేధించేది ఆమెకు అర్థమవని ఏకైక సమస్య. ఆ ఆలోచనతో అనేకరాత్రులు ఊరికే ఉద్రేకంతో ఊగుతూ నిద్రమాని కూర్చునేది. శూన్యంగా అలా కూర్చుని ఏదో ఎడతెగని బాధపడేది. అదంతా చెట్టు క్రింద నివసించే మనుష్యులగూర్చి.

ఆమె తప్ప మిగతా వాళ్లెప్పుడూ ఆ సమస్య గూర్చి ఆలోచించినట్టులేదు. ఆమెనుమాత్రం ఎందుకో ఆ ఆలోచనలు, అవసరంలేని ఆ బాధాను! కాలవ్యవధి కావలసినంత ఉన్నందుచేత నేమో! అలా ఆలోచించి ఆలోచించి ఎంతకీ అర్థంగాక మరోవిధంగా దృష్టి మరల్చి ఆ అర్థంగాని సమస్యను అవతలకు నెట్టుతుందామె.

ఆమె కెందుకో మగవాళ్లనుచూస్తే అమిత అసహ్యం. అంత అసహనంతో దగ్ధమయినతర్వాత పుట్టిన ప్రేమ శాశ్వతమేమో! ఆమె మగవాళ్ళను వాళ్ల ప్రకృతిని తరచి తరచి ఒదిలింది.

ఆనది దారంటపోతే చూడనిమగాడేలేడు. ఆమె అడుక్కునేటప్పుడు, పనినిగురించిప్రాకులాడేటప్పుడు, పుల్లాకుల్లో మెతుకులేరుకు తినేటప్పుడు, ఆఖరుకూ చెట్టుక్రింద కూర్చున్నప్పుడుకూడా, తన బాధితహృదయానికికో సూదిపోటులేకుండా ఒదలని వాళ్ళనిచూస్తే ఆమె హృదయంలో అసహ్యంరగలక అనురాగం ఉదయిస్తుందా?

ఒకప్పుడు తన జీవితం అంతా పాపభూయిష్టం అనుకునేది. తీవ్రంగా ఆలోచించి ఎలాగో ఓలాగ పరిస్థితులను సమన్వయించుకో గలిగేది.

ఆకలి తీవ్రంగా ఉన్నప్పుడు పాపపుణ్యాల గూర్చి ఆలోచించడానికి ఆమెకు సమయం కన్పించేది కాదు. కాస్త కడుపునిండా అన్నంతిని తీరుబడిగా చెట్టుక్రింద కూర్చున్నప్పుడుమాత్రం పాపపుణ్యాలు స్మరణకు వచ్చేవి.

ఎటుప్రక్క జూచినా పచ్చగా, ఏపుగా పెరిగి అఖండంగా, పెక్కుపంటలనిస్తూన్న మొక్కలతో కలకల్లాడే భూమినిచూచినప్పుడు, తిండిలేక చావడమే ఓ మహా పాపంలా కనిపించేది ఆమెకు. ఇంత అమితంగా పండుతూండగా తిండిగూర్చి, ఆఖరుకు చావడం ఎలా ఏర్పడుతూందో అర్థంకాలే దామెకు. ఆకలివేసి అటుమటించి పోయేటప్పుడు, దొంగతనం చేసినా, బలం ఉండి దౌర్జన్యమొనర్చినా, అదిలేక సత్యాగ్రహం చేసినా, ఆడదయితే రంకుతనం చేసినా, ఏమితప్పో, పాపమో ఆమెకు అర్థమయేదిగాదు. ఆఖరికి తప్పులేదనే నిర్ణయానికి వేగంగావచ్చేది. పాపం! ఆ బాధవల్ల అలా అనిపించి దామెకు!

తిండిలేకుండా ఉండడం తప్పుగాదూ? ఉండడానికి యిల్లు, కట్టుకోడానికిబట్ట, చెయ్యడానికి పని లేకుండా ఉండడంతప్పే!

జీవితంలో ఆమెకు అపనమ్మకం లేదు. తనలో తనకు తీవ్రమయిన నమ్మకము లేకపోతే ఆదరిద్రంతో, ఆ పిల్లలతో, ఆ వాతావరణంలో ఏలాజీవిస్తుంది? తన జీవితం యిదమిద్ధమని తేల్చుకోలేకపోతూంది. తనెలా బ్రతికాలో అసలే అర్థంకావడంలా.

అగమ్యగోచరమైన యీ సాంఘికవ్యవస్థలో, క్రుంగి, కృశించి, అణగారి, పీడింపబడే మానవుల జీవిత పంథా మార్చే విప్లవ శక్తులేవేవో!

పాపం ఆమెకు యిప్పుడు తన జీవితంకన్న హీన స్థితి ఏముంది?

ఆమె హృదయంలో ఆరనిఆశ ఏమిటో— ఎందుకో?

బహుశా చావకుండా ఉండడమే ఏమో!!

ఈరోజామెకు కాస్తతీరుబడి దొరికింది, ఆలోచించుకోవడానికి తనజీవితం పునర్విచారించుకోడానికి.

ఈలాంటి రోజు లామె పతితజీవితంలో లేకపోలేదు. అలాంటి తీరికసమయాల్లో ఆమె మనోదృష్టి చాలవరకు మసకగా ఉంటుంది. ఆ చెట్టునీడ, ఆ ధూళిలో వెల్లకిలా పడుండి ఏడుస్తుంది ఊరికే. హృదయాన్నంతా నీరుజేసి నేత్రాలద్వారా ద్రవింపజేస్తుంది. మాసి ధూళిగట్టి దట్టమయిన, ఆమె మలినాంబరం గూడా తడిసి ముద్దవుతుంది.

తీరికగా వున్నప్పుడు అదే చేస్తుందిట.

అంతేట ఆమెపని.

ఏడవాలని ఉంటుందిట. ఏడిస్తేగాని తనకు ఆరోగ్యంగా ఉండదనుకుంటుందిట.

అలా కన్నీరు అప్రయత్నంగా కారిస్తే మనోవేదన మాయం అవుతుందేమో!! హృదయారాటం ఊరటచెందుతుంది కాబోలు!!! పాపం! ఆరోజు ఆలా ఎంతసేపేడ్చిందో! ఆమెకేమీ తెలీదు.

అసలు ఏడుపులోఉన్న ఊరడింపు అదే.

ఒక్కసారి కళ్ళంట కాలువల్లా నీరుకారేలా ఏడిస్తే ఎంత తేలికవుతుంది హృదయం!

ఆమెకు కాలమానం వెలుగుచీకట్లు మాత్రమే. ఆరోజుకు చీకటిపడింది.

ఆ చెట్టుమీద పక్షులతోపాటు ఆ చెట్టుక్రింద మనుష్యులుగూడా చేరుకున్నారు తమ తమ స్థావరాలకి. సందడిగాఉంది చుట్టుప్రక్కల. ఆ సందడి అంతా కాస్సేపుమాత్రమే. తిండితిని పడుకుని ఏవో అర్థంతెలీని కూని రాగాలు తీస్తారు అవ్యయానందంలో; తర్వాత నిద్రపోతారు.

ఆమె, ఆమెపిల్లలూ మధ్యాహ్నం వాళ్ళు తీసుకువచ్చిన రొట్టెను తిన్నారు. కుక్కాళ్ళు పడుకుని ఆడుకుంటున్నారు ఆ చీకటిలోనే.

చంద్రుడు చాటంత మొగంచేసుకుని నవ్వుతున్నాడు బంగారుచాయ లొలకబోస్తూ. చల్లని అతని చిరునవ్వు సాధ్యమయినంతవరకు విచారంలో మునిగియున్న వారికైనా సరే సంతోషం చేకూర్చేలాగుంది. అతని సహవాసం చూసుకుని తారలెంత ఉబ్బిపోతాయి; గర్వంతో గంతులేస్తాయి; ఆనందంతో నాట్యంచేస్తాయి.

ఈ ప్రకృతిలో కొన్నిశక్తులు అతీతమయిపోయాయిగాని లేకుంటే యీవాటి మనఆహ్లాదం కూడా కరువుచేసి, దాన్ని తమ లాభాలకోసం, వినియోగించి, మానవలోకంలో పతన జీవనసా జనులకు తెలీకుండా లాగుకునే ఘనులున్నారు. ఈ చెట్టుక్రింద ఉన్నవాళ్ళకీ గొడవ లసలేమీ అవసరం లేదు.

ఆనందం కల్గించే వస్తువులను చూచినప్పుడు ఆనందం, అది తను పొందగలిగితే బాగుండు ననిపించినప్పుడు సంతృప్తి కల్గుతుంది. అంతే. అందుకు మినహా యీ సృష్టిరహస్యాలను విడదీసి అర్థంచేసుకోవలసిన బాధ్యత తమకున్నట్లు వారికితోచదు. పగలు ఎలాగో

తిండి సంపాదించుకోడం; రాత్రి సుఖంగా నిద్రపోవడం; యిదేవాళ్ళకు బాగుంది.

ఆ చెట్టుక్రింద ఆమె ఒక్కర్తే, కళ్ళంట నీళ్ళు కారుస్తూ, నిర్మలంగా, స్వచ్ఛమయిన నీరులాగ, నిశ్చలంగా రాతిబొమ్మవలె కూర్చుంది. కుఱ్ఱాళ్ళు ఆమెప్రక్క గాఢంగా నిద్రపోతున్నారు నవ్వు మొగాలతో.

మధ్యమధ్య ఆ నిశ్శబ్దతను ఛేదిస్తూ ఏదో పక్షి కూత వినిపిస్తూంది అక్కోలాగ. బహుశా అదిగూడా యీమెలాగ దుఃఖిస్తూందేమో ఆనందంగా! ఆనందంతో దుఃఖించడంవల్ల మనోభారంతీరుతుంది. ఈ సత్యాన్ని గ్రహించిన పరమఋషులు యీ రెండు జీవులూను.

ఆ అర్ధరాత్రి ఓ జట్కా ఆగింది ఆ చెట్టుకి కొంచెందూరంలో. బండిలో సామానేదో పట్టుకుని, ఒకవ్యక్తి ఆ చెట్టువయిపు వస్తున్నాడు. సరాసరి ఆమె ముందుకువచ్చి నిలబడ్డాడు. ఆమె అతనివైపు జూచింది. కళ్ళునులుపుకుని మళ్ళీచూచింది.

"నీవే!" అంది మెల్లగా వెదురాకులమధ్యనుంచి రాలే వాన చినుకుల సవ్వడిలా.

"ఆ. నేనే. ఇయ్యి తీసుకో" అన్నాడు ఉత్సాహంగా.

"ఏటయ్యి?"

"యిది కోక" అన్నాడు చేత్తో ఓమూట చూపిస్తూ.

అలా చూస్తూనే కూర్చుందామె నిర్వికారంగా.

"యియ్యి గుంటలకి గుడ్డముక్కలు" అనిముందుకు వచ్చి ఆమెఎదుట కూర్చున్నాడు.

కొంతసేపు నిశ్శబ్దంగా ఉన్నారిద్దరూ.

"యియిగో, యిదిగంటే మందు. ఆ సేతిమీది పుళ్ళకుపట్టించు. పోతాయి"

"అహా" అందామె. వాడు చెప్పేమాట లంత లెక్కచేస్తూన్నట్లు కన్పించకుండా.

"యియి కట్టుగో పోదాం" అన్నాడు జంకుతూ.

"ప్చ! నే రాను" అందామె.

"నిన్నొత్తా నన్నావు!"

"నిన్న నిన్నే - యీరోజు యీరోజే"

"యేటిమాటలు! నిజమే నేటి!!!" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఆ! నిజమే. దీనికిగూడా అబద్ధంఎందుకు?"

"అయితే నా బతుకే పోనాది. నువ్వొత్తావు— నాకు కొంత ధైర్యం ఉంటాదనుకున్నా. యేటి సెయ్యను" అంటూ చతికిలబడ్డాడు నేలమీద, ఆమె కెదురుగా.

అతని అవస్థకూ, అమాయకత్వానికీ ఆమె ఆశ్చర్యపడింది. అతనిమాటల్లో ఏదో అర్థం, అతని నిర్మలత్వం కనుపించిం దామెకు. ఇదివరలో అతనిమీదున్న అనుమానం, అవిశ్వాసం, అసహ్యం చాలావరకు కదలిపోయాయి. తన్నుగూర్చి అతను అంత ప్రాకులాడ్డం, ప్రాధేయపడ్డం చూస్తే అతనిలో నమ్మకం ఏర్పడడానికి అవకాశం కల్గించాయి. అయినా ఎందుకో అతనికి మంచిమాటలు చెప్పి పరాఙ్ముఖుని చెయ్యాలనుకుంది. అలా కానివాడు భవిష్యత్తులో ఎలాంటి కష్టాలు పడాలో అని భయం పసపం మొదలుపెట్టింది.

"అనాగయితే పద - నిన్న పోయినచోటికి. నీతో మాట్లాడాల" అంది.

అతను తలెత్తకుండా మౌనంగా ముందుకు పోతున్నాడు. ఆమెగూడా వానివెనకాలే నడుస్తూంది వాడిలాగే. ఇద్దరూ యిదివరకు వెళ్ళిన చెట్టుక్రిందకు సరాసరి పోయి కూర్చున్నారు.

సంరక్షణలేక అల్లిబిల్లిగా ఎగురుతూన్న ఆమె కురులకుచూస్తే, అతనికి ఆనందం కలిగింది చాలా; అప్రయత్నంగా వానిని తనచేత్తో సరిచేయడం మొదలుపెట్టాడు లేని స్వాతంత్ర్యం తీసుకుంటూ.

"నువు రావనుకున్నాగాని వచ్చావే!" అందామె తలెత్తకుండానే.

"నేను! నిన్న సొప్పలా! వత్తానంటే అంతే. మరి తిరుగు లేదు."

ఆమె మరి మాట్లాడలేదు. నిశ్శబ్దంగా ఊరకుంది. అతను కాస్తసే పూరకున్నాడు. ఆమె మాట్లాడకుండా కూర్చోడంచూచి మళ్ళీ మాట్లాడ్డం మొదలెట్టాడు.

"మరినాతో అది నేదు. సెప్పేనంటే సేసెయ్యడమే. పాణంపోయినా సరే."

"నువ్వేంపని చెత్తావుంటావు.

"బండితోల్తా. జట్కా."

"యేజాతి నీది?"

ఆమె ఆ ప్రశ్నఅడిగీ అడగడంతోటే కాస్త నవ్వొచ్చింది అతనికి—

"మనకి జాతేటిసెప్పు. యేజాతయినా యేదూ యింత తిండిపడెయ్యడు. మనకి కావలసింది తిండి. అంతే."

"నీకు యింతవరకు పెళ్ళవనేదా?"

"యేటో లే యీ పెళ్ళిళ్ళు. నువ్వూ నేనూ కలిసి సుకంగా ఉంటే, నువు నా పెళ్ళాం కాద నేవాడెవడు? సెప్పు." అన్నాడు.

ఆమెకు వాడి మాటలు సమంజసంగానే తోచాయి.

"కాస్సేపూరుకున్నాక "నేను నీ ఒక్కడితోటే ఉంటానని నీ కేటా నమ్మకం?" అంది.

"అది నీయిట్టం. దానికి లెక్కేటి? నీకూ నాకూ కుదిరింది కనక మనం ఓజంట. నేకపోతే నీదారి నీదే నాదారి నాదే — అంతే మనసంగతి"

"నాసంగతి నీకు తెలీదు కాస్త సెపితే..." అని సగంలో ఉండగనే అతడు అడ్డువచ్చి—

"అయ్యన్నీ మనకవసరం నేదు. ఆమాతరం నీకు తెలిస్తే చాలు."

"నా యిట్టంవచ్చినట్టు నేనుండాల. యినా ఉండు అనా ఉండు అని బలవంతచేస్తే సిక్కే..." అందామె ముఖం నేలలో దింపి.

"నీ యిట్టంవచ్చినట్టు సెయ్యొచ్చు. వచ్చింది కాత్త నీచేతికిత్తా."

అతనిమాటలు వింటూంటే ఆమె తనమనస్సులో నున్న విషయాలన్నీ నిస్సంకోచంగా చెప్పివేయడం మంచిదనుకుంది.

"యిదిగో యిలాయిను. నా నలుగురు పిల్లల్ని బాగానూడాల. నువ్వుతాగొచ్చి తన్నులాటలు, దెబ్బలాటలు మొదలెడితే కుదరదు."

"తాగుడులేదని నే నన్ను. గాని మనం తాగి యేం దెబ్బలాటలూ తేము."

"అదేం కుదరదు. అలాగయితే నే వత్తా. చూసుకో"

"అనాగే చూద్దాం పద" అన్నాడు.

"పదడం కాదు. సేతిలో సెయ్యెయ్యి."

"సెభాష్! బాగా సెప్పావు" అంటూ తన బరువయిన హస్తాన్ని ఆమె చేతిలో వేసి, రెండవచేతిని, సన్నని ఆమె నడుంచుట్టూ చుట్టి తనలోకి ఆమెను లాగుకుని గాఢంగా ఆమె పెదవుల్ని చుంబించాడు.

## 3

అతను తెల్లవారిలేచేసరికి, ఆ తల్లీ పిల్లలూ, ఆ పూరిగుడిసెలో చాపమీద ఉన్మత్తిగా నిద్దురపోతున్నారు పూర్తిగా కప్పుకుని. ఆ కుటుంబాళ్ళ జీవితంలో అదే మొదటిసారి, మెత్తటిగుడ్డలు తమ శరీరంనిండా కప్పుకోవడం.

కళ్ళు నులుపుకుని అతను బద్ధకం విరుచుకుంటూ లేచి నిలబడ్డాడు. చప్పుడుచేయకుండా తలుపుతీసి పైకిపోయి కాలకృత్యాలు నిర్వర్తించుకుని, కావిడితో రెండుకుండల నీళ్ళుతెచ్చి, అచ్చట ఉంచి, పెరటిలో పొయ్యంటించి, దానిమీద నీళ్ళుపడేసి, క్రిందటిరోజు తనాయ తెపరచిన సామగ్రి అంతా ఆమెకు కనపడే లాగ తన మంచంమీదసర్ది, కొఅడాకత్తి తీసుకుని, బండి తోలుకోడానికి బయటకు బయలుదేరాడు.

ఆమె లేచేసరికి బాగా ప్రొద్దెక్కింది. ఇంటి కప్పులోనున్న కన్నాల్లోనుండి ఎండపడి నెచ్చగా తగులోంది శరీరానికి. తన మొద్దునిద్దురకు తనే సిగ్గుపడింది తనలో. తను లేచి పిల్లలను లేపకుండా, కప్పుకున్న గుడ్డను బాగాసర్దింది. ఎదురుగా మంచంమీద పరబడి ఉన్న సామానుచూచి ఆశ్చర్యపడింది. ఆనందపడింది. అతని మెలుకువకు, నేర్పరితనానికి చాలా మెచ్చుకుంది. పూర్వం తనిలా గడపిన జీవితం జ్ఞప్తికి వచ్చింది వెంటనే. మరల తనొక స్వప్నజీవితాన్ని నిజంగా అనుభవిస్తాననుకుంది. ఆ చిన్నయిల్లును అతను అంతబాగా కాపాడగలిగినందుకు చాలా సంతోషించింది.

ఇంటిచుట్టూ ఉన్న యీ తాటాకులదడి లోపల రెండు మూడు చెట్లు హృదయంగమంగా ఉన్నాయి. పరిస్థితులు చాలా ఆహ్లాదకరంగా కనిపించాయి.

ఆమెదృష్టి దానంతట అదే ఆ పొయ్యివైపు వెళ్ళింది. దానిమీద కుండనిండా నీళ్ళుకనిపించాయి. అక్కడకువెళ్ళి చెయ్యిపెట్టి నీళ్ళుజూచి క్రింతపుల్లలు సర్ది నిప్పుసరిజేసింది.

గడచినరాత్రి అతను తనకుచెప్పిన మాటలు మనసుకువచ్చాయి. మొట్టమొదటి విషయం: తనూ పిల్లలూ శుభ్రంగా స్నానంచేసి కొత్తబట్టలు ధరించాలన్నాడు.

"అందుకే కాబోలు, మంచంమీద బట్టలమూట, పొయ్యిమీద నీటికడవ ఉంచాడు" అనుకుంది. వెంటనే శుభ్రంగా స్నానంజేసి, తనశరీరంమీదున్న ప్రశ్నకు అతడు మంచంమీద ఎదురుగా ఉంచిన మందురాసుకుని కట్టుకట్టుకుంది. పిల్లల్ని లేపి స్నానం చేయించి బట్టతొడిగి ఓమూల ఆడుకొమ్మంది. ఆ మంచంమీద ఉంచిన వంటసామగ్రి అంతా తీసి జాగ్రత్తగా అగదిలో ఓమూల సర్దింది. ప్రక్కబట్టలన్నీ వారసరిగా సర్ది మంచంమీద ఓప్రక్కను ఉంచింది.

ఎందుకో హఠాత్తుగా, ఏదో అర్థంగాని మానసిక ప్రవృత్తి ఆవరించింది ఆమెను. నిన్న మొన్నటి వరకు తనుగడిపిన జీవితం మళ్ళీ జ్ఞప్తిపథంలో తిరుగు

తూంది. ఓసారి తన పూర్వచరిత్ర సింహావలోకనం చేయవలసి వచ్చిందామెకు. తనకు నాలుగేళ్ళ ఆశ్రయమిచ్చిన ఆ మర్రిచెట్టు, దానిక్రిందనే తనలాగే జీవించే ఆ మానవసమూహం, ఆ చెలువూ అన్నీ స్మృతిపథంలో పడ్డాయి.

దానిక్రింద ఆశ్రయించుకుని ఉన్నవాళ్ళందరికీ తనకు మల్లేనే అయాచితంగా యిళ్ళుకొరికితే ఎంత బాగుండును! ఎంత ఆనందిస్తారో! పాపం, సంతోషంతో చచ్చిపోతారు వాళ్ళయితే!

ఆ చెట్టుక్రింద కూర్చున్నంతసేపూ, సూర్యుడు ప్రళయాగ్నిజ్వాలలు కురిపించినా సరే, శరీరం కరడుగట్టుకుపోయి కంపం ఎత్తించే చలివేసినాసరే, మిన్నూ మన్నూ ఏకధారగా వర్షించినాసరే, ఆనందంగా ఉండేది. ప్రశాంతిగా కన్పించేది. అదే ఆనందసుఖం. జీవితం అంతా బాధ్యతారహితంగా, నిశ్చింతగా, అలాగే గడిపేయ్యాలనే ఉండేదామెకు. ఆస్థితినుండి యీ మెట్టు ఎక్కడంవల్ల ఉన్న హెచ్చుసుఖమూ, బాధ్యతలూ ఆమెకన్నులకు కనుబడున్నాయి.

అయినా జీవితంలో బాధలుమాత్రం చాలా తక్కువ ఉంటాయి అనుకుంది లోలోపల.

ఈ అనూహ్యమయ భావాలతో అనుకుంటూన్న ఆమెకు వంటమాట హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది. ఎందుకో భయంకలిగింది. వంట నేర్చి సంవత్సరాల తరబడి అలవాటు తప్పినపనిని చేయడం మొదలు పెట్టింది.

పొయ్యంటుకోకపోవడం, పొగ కళ్ళలోకి రావడం, చూసి విసుగెత్తి ఒక్కసారి యింట్లోనుండి పారిపోదామా అనిపించిందామెకు. "వెనువెంటనే అంత ద్రోహంచేయడమా" అనుకుంది.

అతని అమాయకత్వము, నిష్కాపట్యము, అవ్యాజప్రేమ అప్పటికప్పుడే ఆమె హృదయంలో చెరగని స్థానం సంపాదించుకున్నాయి.

కుర్రాళ్ళు ఓమూల ఏదో ఆడుకుంటున్నారు. వాళ్ళవైపు దృష్టిమరల్చి వాళ్ళ ఆనందంలో పాలు పంచుకుంటూ కూర్చుంది; వాళ్ళదగ్గరకు వెళ్ళి ప్రక్కగా. కుర్రాళ్ళు ఆ అర్థంలేని ఆటలలోనే తగవులు తీర్చుకుంటున్నారు. ప్రక్కనే పడున్న చిన్నకుర్రాడు కదిలి కూనిరాగం మొదలెట్టాడు. తీసుకువి ఒడిలో కూర్చుండబెట్టుకుని ఏవో జోలపాటలు పాడుతూ ఊరడిస్తూంది. వాడలాగే నిద్రపోయాడామె ఒడిలో ఆ జోలపాట ఆగే సరికి.

ఆమె తన పూర్వజీవితం, అతని మీద ఎందుకో తనకు తెలీని అపనమ్మకమును మరుద్దామని ఎంతప్రయత్నించినా ఆమెను వెన్నాడుతూంది. తన జీవిత పరిణామాన్నంతా అతనికి పూర్తిగా సవిస్తరంగా తెలియజేస్తే ఆమెభారం సగం ఉపశమిస్తుందనే నిర్ధారణకు వచ్చింది. అతనదంతా వ్రవ్వనివ్వడు. తన కథంతా వినవలసిన అవసరంలేదంటాడు. గతమంతా ఎలాఉన్నా తనకు ఫరవాలేదట. తనకు కావలసిందంతా భావిని ఇద్దరూ అన్యోన్యంగా, సహకారంతో జీవించాలి. సంసారం సాగించాలని అతనివాంఛ!

అంతే! మిగతా పూర్వవిషయాలు స్ఫురణకు రానివ్వకద్దని అనేకవిధాల ఆమెకు తెలియజేశాడు. ఆమె బాధనంతా అతను అర్థంజేసుకున్నట్లు, ఆమెకు పూర్తిగా అర్థమయ్యేటట్లు ఎన్నివిధాలుగా చెప్పాలో అన్నివిధాలుగా తెలియజెప్పాడు.

ఆమె అతని సహనానికి పూర్తిగా ఆశ్చర్యపడింది. అతనామె ఎందుకంత కఠినంగానూ, హేయంగానూ చూచిందో అర్థంచేసుకోడానికి ప్రయత్నించింది. ముఖాలనుజూచి వ్యక్తినిర్ణయంచేసుకోడం చాలా పొరపాటేమో అనుకుంది మనోవీధిలో.

బరువయిన అతని అడుగుల సవ్వడివిన్నేవరకు ఆమెకీ బాహ్యప్రపంచంతో సంబంధంలేదు.

అతని ఆగమనంలో పిల్లలు భయపడి పిల్లి పిల్లలాగ మూలమూలలకు చేరుకున్నారు. కాస్త సేపయినాక వాళ్ళు నెమ్మదిగా మళ్ళీ తమ ఆటలలో ప్రవేశించారు.

ఆమె సర్దితీర్చిపెట్టిన సామానీ, తుడిచి శుభ్రం జేసి అద్దంలా ఉంచిన ఆ గది పరిశుభ్రతనూ చూచి ముగ్ధుడయ్యాడు. సంతృప్తిపడ్డాడు. శుభ్రంగా స్నానం జేసి తెల్లచీరకట్టుకున్న ఆమె అందం పున్నమివెన్నెల్లా కనిపించిందతనికి. ఆ సౌందర్యాన్ని కళ్ళతో నములుతూ ఉండిపోయాడు.

పరిశుభ్రతవలన ఎంత అందంవస్తుంది !!!

ఆమె అతనిని స్నానానికి లేవమంది. అతని శరీరం తోమినీళ్ళుపోసింది. అన్నానికి లెమ్మని హెచ్చరించింది.

"యింకా తిన్లేదా అన్నం" అన్నాడు ఆశ్చర్యంగా.

"లేదు" అందామె మెల్లగా అతను తినకుండా తానెందుకు తినాలన్నట్లు.

"యినాగయితే నాబంలేదు. నేనొచ్చేదాకా కానూత్తే మరి మీరు తిన్నట్టె తెలిసిందా"

"యేం?"

"యేముంది? యీరోజు యీ ఊళ్ళోనే బండి తోలాంగనుక యేగంవచ్చేస్న. యే పొరుగూరన్నా పోతే మీ రలా పత్తుంటేమేనా"

"ఓ అదా"

"అదా, కాదు. మీరు కుబ్బరంగా యేళకింత తినేసి కూర్చుండడమే. తెల్సిందా?"

"అవాగే"

"ఈ రోజెంతకళొచ్చిందమకున్నావ్ యింటికి."

"యేటో"

"నిజం. నాకు సానా ఆనందంగా యున్నాది సుమీ."

ఎందుకో ఆమె వాడి కళ్ళలోకి వాడిగా చూసింది.

వాడు కూర్చున్నాడు. ఆమె అన్నం పెట్టింది, అన్నం నములుతూన్నాడు.

ఆమెవైపు రెప్పవాల్చకుండా జూస్తూ "నీ పేరేటి సెప్మా" అన్నాడు మంచినీళ్ళు త్రాగబోతూ.

"నా పేరా"

"అవును"

"మరచిపోయావా. ఏదో ఓటిపిలుద్దూ అదేసాలు"

"సెప్పదూ, పేరుతో పిలుస్తే ముద్దుగావుంటాది"

"పేరేంయీ నేదు. పేరు నేకుండానే పిలుస్తే మరీ ముద్దుగా యుంటుంది"

"సానా బాగా సెప్పావే. అవాగే బాగుంది" అన్నాడు.

అన్నంతిని లేస్తూ క్రిందపడున్న పిల్లవాణ్ణిచూసి క్రింద పడుకోబెట్టింది. పిల్లలూ తనూ కాస్త అన్నం తిన్నారు.

క్రింద చాపమీద పడుకున్నాడతడు యింటి వాసాలు లెక్కపెడుతూ.

పిల్లలు తిండితిని వీధిలోకివెళ్ళారు ఆటకి.

ఆమె తన భావిజీవిత భాగస్వామితో ముచ్చటలాడుటకు ఉవ్విళ్ళూరుతూంది. అతనిముందు కూర్చోగానే తనకొక అధునాతనబాధ్యత బరువు అబ్బినట్లనిపించింది. ఇప్పటివరకు తెన్ను వేధించుకుతింటూన్న ఆలోచనలు, పూర్వస్మృతులూ యిప్పుడు అగోచర మయాయి. ఏమిమాట్లాడుదామా అని ఆలోచించే టట్లుగా తలవంచుకుని మౌనంగా కూర్చుంది.

గడచినరోజువరకూ ముసలితనం ప్రస్ఫుటించే ఆమె మోములో వినూత్న శోభ గనుపిస్తూంది. పూర్వ దుర్భరదారిద్ర్యంలోనూ, నైచ్యపరిస్థితుల్లోనూగూడా, ఆమె మోములో సౌందర్యం నగ్నంగా కనుపించేది. నేడది వికసించింది.

క్రీగంట ఆమెవైపు జూస్తున్నాడతడుమౌనంగా.

"నీబట్టలు చినిగిపోనాయి" అంది వంచిన తలెత్తకుండానే.

"యేటో" అన్నాడు తలపట్టుకుని. కొస వాన్ని మళ్ళీ అందుకున్నాడు ఆలోచనాపూర్వకంగా చూస్తూ. "యింతవరకు సంపాయించింది కాస్త తిని, తాగి, జూదం అడ్డానిక్రింద ఖర్చుపెట్టేసినాను."

"ఆహా" అందామె వాకేమన్నట్లు.

అయినా అతనివ్యవహారంలో జోక్యంకలుగజేసుకోవడం ఆమె కేమాత్రం యిష్టంలేదు. వ్యక్తిగత విషయాలవి. తనను తీసుకువచ్చాడు గనుక తనకు యింత తిండీ బట్టా యిచ్చేబాధ్యత అతనిది. అతనికి అన్నివిధాల తగినసహాయం చేయడం తనవంతూనని ఆమె అభిప్రాయం. అందుకే చాలా మౌనగా సమాధానం యిచ్చింది.

"రొదవది, మాన్దామనుకున్నా యేటోగాని కాళ్ళు లాగేతున్నాయి అసైదుకు. యెలాగో తమాయిస్తాను. తెచ్చినడబ్బులు నీకిచ్చేస్తూంటాను సుట్ట ముక్కలకు మాత్రం తీసుకుని."

"నువునాకు బావి యెక్కడుందో కాస్త సెప్పు, నీలు నేనే తెమ్ముకుంటాను. ఓతోటి యింటిపనులు నే చేసుకోకపోతే యెట్టామరి?" అంది.

అప్పడే యెందుకు నీకీ బెడద. నీకేవి నువు నూసుకో. యెంత బక్క చిక్కి ఉన్నావో! కొన్నాళ్ళుపోనీ. నే తెత్తాగా తెల్లారకుండా కావిడి నీల్లు" అన్నాడు ఆమె వీపుతట్టుతూ.

ఆమె అతని ఉదారస్వభావానికి, హృదయ వైశాల్యానికి చాలా పొంగిపోయింది.

తను సంపాదించిన నాలుగు రూపాయిల్లో రెండు రూపాయిలు ఆమెచేతిలోవుంచి, మరో రెండు రూపాయిలామెకు చూపిస్తూ తనగుడ్డం మేతగూర్చి తీసుకుంటూ సంజాయిషీ తెల్పుకున్నాడు. ఆరోజు మరి బండితోలలేదు.

## 4

రెండుసంవత్సరాలు గడచాయి. అలా ఎన్ని రెళ్ళసంవత్సరాలు గడచినా, ప్రస్తుత సామాజిక వ్యవస్థలో సామాన్యజీవితంలో, లెక్కవేయగల గొప్ప మార్పులేమీ కనుపించవు. ఒకవేళ ఉన్నా వాళ్ళబుద్ధికి తట్టవు. వాళ్ళు లెక్కచేయరు. కాని ప్రపంచరీత్యా యీ రెండుసంవత్సరాలలోను ప్రతిరోజూకూడ ఒక నిర్ణయ ప్రాముఖ్యం కలిగి ఉంటుంది. ఈ రెండు సంవత్సరాలలోనూ, ఎన్నో చారిత్రక సమావేశాలు... (ఫలితంలేనివి), శాస్త్రపరిశోధనలు, చావులు - (గొప్ప వారివి) - మొదలైనవి జరిగి ఉండవచ్చు. కాని యీ చిన్నకుటుంబంలో జ్ఞాపకం వుంచుకోవలసిన మారు

ళ్లేవు. ఇద్దరూ ఒకరినొకరు అర్థంజేసుకుంటూ, కించిత్ లోపాలున్నా సహనంతో సవరించుకుంటూ సాధ్యమయినంతవరకు ఆనందంతో సంసారం గడపడానికి ప్రయత్నిస్తున్నారు.

పిల్లలతనిని యీ రెండేళ్లతో తమ తండ్రిని సంబోధించినట్టు పిలవడం అలవర్చుకున్నారు. ఆ ప్రశాంత పరిస్థితులవల్ల, ఆమె తన వయస్సుకుతగ్గ రూపము తెచ్చుకోగలిగింది. అతని ప్రవర్తన చాల వరకు మార్చింది. తను మునుపు అనుభవించిన దుర్భర దారిద్ర్య పరిస్థితులవలన నేర్పిన గుణపాఠం: డబ్బు విలువ; ప్రస్తుత సంసారులకు చాలామందికి తెలీనిది. అతను సంపాదించిన ధనంతో తనకు సరిపోయే ఖర్చుచేయడం తెలుసుకుంది. కొంత మిగల్చకల్గేది కూడా. కోల్పోయిన తన దేహారోగ్యం చాలావరకు పునఃసృష్టి చేసుకుంది.

ఆమె నేర్పరితనం, విచిత్రంగా కనబడే ప్రవర్తనా, వింతగొల్పుమాటల ధోరణి చూచి అతను ముగ్ధుడవుతాడు. ఆమెనుజూచి మురిసిపోతాడు.

నిశ్చింతగా, నిర్భీతిగా ఉండటమనే క్రొత్త స్వభావాన్ని, ఆమె పెంపొందించి వానిలో. లౌకిక జ్ఞానాన్ని అభివృద్ధిపరచింది.

అనేకమందితో అనేక విధాల తెలుసుకున్న అనుభవాలు, యిదీ అదీ అనకుండా తన కళ్ళతో తాను జూచిన అపారసంఘటనలు, అనేక పతిత జీవులతో జరిపిన అపూర్వసంభాషణలు, అర్థంజేసుకుని తనకున్న పూర్వ ప్రపంచజ్ఞానంలో అన్వయించుకుని తనలో మననం జేసుకుంది.

మొరటుతారి, మంచిచెడ్డా తెలీని అతని బుద్ధికి యిదీ అదీ అని తేల్చుకోగలిగే సమర్థత యిచ్చింది. వ్యక్తిత్వం కలుగజేసింది.

అందుచేతనే కాబోలు ఆమెలేకపోతే తన జీవితమే లేదనుకుంటాడు. ఇతరుల మనోగతు లర్థం జేసుకోడం, అందరికీ తగేలాగ ప్రవర్తించడంకూడా, నీచమనుకోబడే ఆమెజీవితంనుండే తెలుసుకోగలిగాడు. ఆమె అంటే అంత అనురక్తి.

కాలరీత్యా విపరీతమయిన మార్పులు వచ్చాయి. ధరలు విపరీతంగా పెరిగాయి. ఈ ధరలింత ఎక్కువగా ఎలా పెరిగాయని కారణంకొఱకు, తర్జనభర్జన చేయడంకన్నా, జీవితం ఎలాగ గడుస్తుందనే జిజ్ఞాసే ఎక్కువగా ఉంటుంది సామాన్యమానవులకు.

అందువల్లనే తన పిల్లవాడిని బడిమానిపించి సుత్తానికి గడ్డికోకడానికి పంపింది. దానివల్ల సుత్తానికయ్యే ఖర్చులో సగంతగ్గింది.

ఆమె వచ్చిన క్రొత్తలో, యిరుగుపొరుగువాళ్ళు అనేకవిధాల ఆడిపోసుకునేవాళ్ళు. ఆమె పట్టికులటనీ, ఆమె మొహముచూస్తే చాలు ప్రపంచంలోఉన్న పాపాలన్నీ ముట్టుకు పెనవేసుకుపోతాయనీ, కనుపించినా కళ్ళు మూసుకుపోవాలనీ, నోటికివచ్చినట్లు అనుకునేవారు ఆమెనెనకాల. ఆమె పరిశుభ్రంగా, మానంగా ఉండడం అసహనకారణం. ఆమెనుగూర్చి అకారణంగా యింతకోపం పెంచడంలో అర్థం తెలీలేదామెకు.

నిజానికి ఆమెలో ఆడంబరంఏముంది? ఎటొచ్చీ ఆమెకు మిగతావాళ్ళకు తేడా లోకజ్ఞానంలోనే. ఆమె ప్రపంచాన్ని బాగా తరచి అర్థంచేసుకుంది.

విధిగంగా ఖర్చుచేసుకుంటే తనకున్నదాన్లోనే తల జీవితానికి అవశ్యమయిన అవసరాలను కుదుర్చుకోవచ్చో ఆమెకు నిశ్చయంగా తెలుసు.

ఇంతఘోరంగా ప్రవర్తించే యీ అమాయిక ప్రజలపై ఆమెకు కోపానికి బదులు అమితమయిన జాలికలిగేది. వాళ్ల అసహనం మారుతుందా అని ఆశ్చర్యపడేది. ఆమె పరిస్థితులను మాటలను లక్ష్యపెట్టే దశ అధిగమించింది. అందువల్లనే వాళ్లంటే ఆమెకు కోపానికిబదులు ప్రేమ, ద్వేషానికిబదులు సహనమూను.

వాళ్ళతో మాట్లాడడానికి కూడా వీల్లేని పరిస్థితులు కల్పించారు. ఆత్మగౌరవాన్ని కూడా వదలి, యిరుగుపొరుగు వాళ్ళు మాట్లాడకపోయినా తను మాట్లాడ ప్రయత్నించింది. విఫల అయింది. అయినా ఏమాత్రం చలించకుండా తన విధి తను నిర్వర్తించుకుంటూంది. నెమ్మది నెమ్మదిగా తన ప్రవర్తనవల్ల చుట్టుప్రక్కలవారి అభిమానానికి పాత్రత పొందింది.

ఆనాడు మామూలు వేళకే తను వంటముగించి కొంతపిల్లలకు పెట్టి తను తింది. పిల్లలవతలకు పోయి ఆడుకుంటున్నారు. మిట్టమధ్యాహ్నపు ఎండతీక్ష్ణంగా ఉంది. ఆమె శూన్యంగా చూస్తూకూర్చుంది. ఎలా ఎప్పుడు కునుకుపట్టిందోమాత్రం ఆమెకు తెలీదు, అతడు వచ్చిలేపేవరకు.

కొండా వీపుకుతగిలించుకొని నించున్నాడు. మెల్లగా కనువిప్పి అతనివైపు మందహాస పూర్వకంగా

చూసింది. తన చొక్కా తీసివైచి గోడనున్న మేకుకు తగిల్చి స్నానానికి నీళ్లిమ్మని ఆమెను అడిగాడు. ఆమెకు ఆశ్చర్యంకలిగింది. సాధారణంగా అతను తన పనంతా అయినాక, సాయంత్రంమాత్రమే స్నానం చేస్తాడు.

"యేం? సాయంత్రం సెయ్యవా?" అంది కళ్ళు ఓరగా పెట్టి.

"యింక పనికెళ్ళనీయాళకి" అన్నాడు తన చేతి మెలితిరిగిన కండలు చూస్తూ.

"యేయి సెప్మా" అందామె విసుగ్గా.

"యీరోజు మా బండోళ్ళు సమ్మెకట్టారు"

"సమ్మె - సమ్మంటే?"

"అంటే - బళ్ళు యీరోజుకు కట్టరన్న మాట"

"యెందుకు ?—బళ్ళుతోలకపోతే మరి తిండి?" అంది.

"మనిషికి పదణాలియ్యవలసిందని అంతా పట్టుబట్టాం. అంతే"

"యివ్వకపోతే యేటి సేత్తారు?"

"యేంసేతాం. మేమూ యేయి సెయ్యనేం,— అసామ్లు బళ్ళు నేకుండా ఉండ నేరు. సచ్చినట్టు రెవరో ఒకరు ఒప్పుకుతీరాల."

"అళ్ళకేం, మారాజులు. రెండుదినాలు బండి కట్టకపోతే మనకే పస్తు."

"ఒసి యెర్రిపిల్లా. అళ్లేవత్తారు కాళ్ళకాడికి. రోజుకు నాలుగు రూపాయాలన్నా నేకపోతే సుట్టానికేడెడతాం, మనమేటి తింటాం సెప్పు."

"నాను సెప్పడానికేంలే. అళ్ళు సాప్పాలిగాని"

"అళ్ళే యిత్తారు. మనకోసం గాదు. అళ్ళపనులు! అందుకు."

"నాకోటి తోసింది సెప్పనా" అంది పమిట సర్దుకుంటూ.

"యేటిసెప్మా అది?" అన్నాడు ప్రక్కనున్న నీళ్ళచెంబు తీసుకుంటూ.

"మనకుఱ్ఱోడిని ఏకాపుగారి కమతంలో నన్నా నేర్పులే. ఆ పెద్దకాపుగారు మూతేనుములు గింజలిత్తారంట. పసువులు కాయడమే."

"యేదో సదువుకుంటున్నాడు గందా—పాపం —కాత్తోకూత్తో గడ్డి సుట్టానికి తెత్తూ నేఉన్నాడు సానదూ. సదువు మానెయ్యడం యెందుకు" అన్నాడు అవతలకు నడుస్తూ.

"మనోడు సదివి సేసేదేముంది సెద్దూ. ముందు కడుపులుమాడి సత్తున్నాం అంతా. అరి కమతంలో పడ్డాడా, సుట్టానికి గడ్డిబాధ తీరుద్ది: అంతో యింతో తిండికిగ్గూడా సరిపోతాది. యీ కాలం సూసావా యేనా మండిపోతోంకో! మాడిసత్తున్నారు మలుసులు పులుసుల్లాగ" అంది వాడికి భయంపుట్టేట్లు.

"అనా గేకానీ" అన్నాడతను ఆమెను నమ్మించే శక్తిలేక.

అవతలకుపోయి స్నానంసెయ్యడం మొదలుపెట్టాడు. ఆమె ప్రక్కగా నుంచుంది. ఓ కంటితో అతని ముఖలక్షణాలను గమనిస్తోంది. ప్రశాంతంగానూ, గంభీరంగానూ ఉన్న అతనిమోము చూచి సంతృప్తిపడింది. కాన ఏకో సంకోచిస్తూన్నట్లు కనపడింది. ఆమె అలా ఊరికే నుంచుండడం చూచి,

"యేం. అలా నిలబడ్డావ్" అన్నాడతను.

"నేనుకూడా కూలినాలి చేస్తే సంసారం సులువుగా ఉంటాదేమో" అంది.

అతడు మౌనంగా తన పనికానిస్తున్నాడు.

"అయినా యిప్పు డంతవసరం యేటొచ్చిందంట" అన్నాడు స్నానం ముగించి తువ్వాలుతో తుడుచుకుంటూ.

"అవసరమే, ముందు కాల మెలాగుంటుందో యేటో కొత్తకట్టపడడం నేర్తే బాగుంటుంది. మన కొచ్చేదెనాగ సాలడం నేదుగా."

"అయితే నీయిష్టం అనాగేగానీ. అదీమంచిదే" అన్నాడు.

"మన పొరుగాళ్ళంతా కూలేగా సేత్తున్నారు. అళ్ళతోపాటు నేను యెడతాను అన్నం పొద్దున్నే వండేసి, నీకు కొంత మూటగట్టేసి, కుఱ్ఱోడికి కొంత యిచ్చేత్తే తీరిపోతాది. యేమంటావు?" అంటూ చూచిందతని కళ్ళల్లోకి.

"బాగ బాగే. అనాగే సెయ్యి. మనసంగతి నీకూ తెల్సు. నే సెప్పేదేటి."

"యేకో రెండు రాళ్ళు కూడబెట్టుకుంటే. సెయ్యికీ కాలుకీ పనికొత్తుంది."

"సానా బాగా సెప్పావు. సానా బాగుంది" అన్నాడు సంతృప్తిపూర్వకంగా.

మెల్లగా ఆమె నడుం ప్రక్కగా తనచేయి మెలివేసి ఆమెను లోనికి తీసుకపోయాడు. అన్నంపెట్టమని అడిగాడు. ఆమెగూడా వెంటనే వడ్డించింది కంచంలో, ఉన్న కాటికి.

పిల్లలిద్దరూ లోనికివచ్చి ప్రక్కగానుంచున్నారు.

ఎంచేతో ఆరోజు అతనికి తిండిసాయించింది. అతని దృక్కులు, ఆమె దృక్కులు ఆ పిల్లలమీద కలుసుకున్నాయి.

# భీష్మునకు పెండ్లి అయినదా?

శ్రీ నేలటూరి రామదాసయ్యంగారు

"ఏక్ బుడ్ఢా ఏక్ లడకా" అన్నట్లు మహాభారతమున మహావీరుడును శూరుడును పరాక్రమశాలి యని యెంతో ప్రసిద్ధి గన్నవాడో 'పితామహ' భీష్మదేవుడు అంతకన్నను అజన్మబ్రహ్మచారి స్వచ్ఛందమృత్యువు మహాయోగి మహాజ్ఞాని యనియుం బ్రఖ్యాతుడు. ఇట్లు అజన్మబ్రహ్మచారి నాయనకోసము పెండిలి మానుకొన్నవాడు అను నీయన ప్రసిద్ధిని ఎగురగొట్టి మీమాంసకులు భట్టకుమారిలాదులు ఆయనకు పెండిలియైన దని చెప్పినారు. ఆ యాశ్చర్యమును ఇంచుక ప్రస్తావించెదను.

అటం బ్రకరణమే మనగా, తొలుత శాస్త్రారంభమున శ్రుతిప్రామాణ్యమును నెలకొల్పి, స్మృతిశిష్టాచారముల ప్రామాణ్యమును నెలకొల్పగడంగగా ఆ రెంటవదాని ప్రామాణ్యవిషయమున ఒక పూర్వ పక్షి ఇట్లు ప్రత్యవస్థితు డాయెను. ఎట్లనగా— "సదాచారముం బ్రమాణీకరింప వలయు నేని, పలువురు, వైగుణ్యమే కలిగి యుండు నేని అపథ్యము చేయు మర్యాదగా ధర్మ విషయమున వ్యతిక్రమమును సాహసమును చేసినారే - అంతటి పెద్దలు ప్రజాపతియు ఇంద్రుడును, వసిష్ఠుడును విశ్వామిత్రుడును, యుధిష్ఠిరుడును కృష్ణద్వైపాయనుడును, భీష్ముడును, ధృతరాష్ట్రుడును, వాసుదేవుడును, అర్జునుడును మొదలగు పురాణులును, ఇప్పటివారు పెక్కండ్రును ఈ దోషమునకుం బాత్రులు కలరే, ఎట్లయ్యా" అని. భీష్మునిమీది దోషమునకు వివరణముం జెప్పినాడు— సర్వాశ్రమధర్మ వ్యతిరేకముగా నుండుటయు, అపత్నీకుడయ్యును రామునివలె యజ్ఞము చేయుటయు అని. మఱియుం జెప్పుచున్నాడు— "శిష్టులెవరయ్యా యన్న సదాచారులందురు, సదాచారములో యన్న శిష్టులు ఆచరించునవి అందురు. ఇట్లివి ఇతరేతరాశ్రయ నిర్ణయములగుటం బట్టి, నిర్ణయము లేనట్లే. కావున శిష్టాచారములకు ఎక్కడి ప్రామాణ్యము?"— అని. అందులకు సిద్ధాంతి భట్టకుమారిలమిశ్రుడు చెప్పుచున్నాడు 'కటుపులకుము, ఇంద్రియసుఖము, మొదలగు దృష్ట కారణములచే గాక, సాధువులు ఏకర్మలం బ్రయోగించిరో వానిని ధర్మములుగా గొనవలసినది. ప్రత్యక్ష వేదవిహిత ధర్మములు ఆచరించి శిష్టత్వమునకు ఖ్యాతి గన్నవారు పరంపరాప్రాప్తముగా తదితరమునుం గూడ ధర్మబుద్ధితో చేయుదురేని అదియు స్వర్గ్యమగుటం బట్టి ధర్మమే. కావున రాత్రిం బవళ్ళ పౌర్వాపర్యముం బోలె, అనాది యగుటం బట్టి వేద వేదార్థములకును అన్యోన్యాశ్రయతా దోషము పొసగదు. కావున ఆచారము ప్రమాణమే. ఇక స్మృతి యన్ననో ఆచారమును గాని వేదవచనమును గాని తోడుకొని ప్రవర్తిల్లినది కాన అదియుం బ్రమాణమే, దోషము లేదు. ఎవడేని అనూచానుడు డేని చేసి ఊహించు నేని అది అర్షమే యగును; వైదికవాసనచే పొడముటం బట్టి అది వేదమే సుమా.' అని తీర్పు చెప్పుచునే ప్రతిపక్షి దూషించిన పెద్దలయుం దేమి, ఇతరులయుం దేమి, ధర్మాతిక్రమము తోచినచోట్ల — శ్రుతిసామాన్యమాత్రమువలన అట్లు దోషము తలంపక, అతిమానుషము దివ్యము అని యేని, తేజోతిశయ మని యేని, బలాతిశయ మని యేని, ఎట్లెట్లు విరుద్ధము కాక పొవునో అట్లట్లు సమాధాన మరయవలసినది, పరిపఱచుకొనవలసినది — అని యుపాయముం జెప్పుచు, ఒక్కొక్కని యెడం జెప్పిన దోషమునకు సమాధాన మొసన్యసించుచో, రామభద్రునిం గూడ సముభివ్యాహరించి, భీష్మదేవుం గూర్చి చెప్పుచున్నాడు. ఎట్లనగా— "రామ భీష్ముల కన్ననో, వరుసగా స్నేహమువలనను, పితృభక్తివలనను, వట్టి ధర్మముకోసము మాత్రమే భార్య లున్నవారికి సొంతముగాను ఎదుటగాను ఉన్న అపత్యములచే పితౄణముం దీర్చిన వారికే యాగసిద్ధి కలిగెనని తెలియవలయును. మఱి రాముడు బంగరు సీతబొమ్మను చేసికొనుట లోకాపవాద భయముచేతను సీతను అట్లు అడవిపాలు చేసియు జాలిలేకున్నాడను అశంకను తీర్చుటకును. భీష్ముడును,

'ఏక జాతులగు తోబుట్టువులలో ఎవఁడేని యొకఁడు పుత్త్రవంతుఁ డైనను, ఎల్లవారును ఆ యొక్కని పుత్త్రుని చేతనె పుత్త్రవంతు లగుదురు'

అను మనువు మాటబడి విచిత్రవీర్యుని క్షేత్రజు లగు పుత్త్రులచే పితౄణముం దీర్చుకొనె ననియు, ఔరక యజ్ఞమునకై మాత్రమే పత్నీసంబంధము కలిగియుండె ననియు, (భారతమందు) చెప్పకున్నను అర్థాపత్తిచే ఎఱుంగనగును. కావున్న శ్రాద్ధకాలమున ఎవఁడు నాయనయే యడిగినను, నాయన యని యెఱిఁగియు, శాస్త్రముం దాటినవాఁడ నగుదు నని భయపడినవాఁడై, నాయనచేతం బిండ మిడక కుశలయందె ఇడెనో అట్టివాఁడు ఆ భీష్ముఁడు ఒంటరిగా, (పత్ని లేక), ఎటువలె యజించును?" అని.

ఇట "ఔరక యజ్ఞమునకు మాత్రమే పత్నిసంబంధము కలిగియుండె నన్న భట్టకుమారిలోక్తికిం దాత్పర్య మేమి? దాశరాజుతో ప్రతిజ్ఞ చేయునప్పటికే భీష్ముఁడు కృతదారుఁడా లేక తదనంతరము కలిగించుకొన్నాఁడా యీ పత్నిసంబంధమును?" ఈ సందేహము తీఱుటకును, ఏతన్మీమాంసక మతోపబృంహణమునకును దీనిపైని భట్టసోమేశటీకను న్యాయసుధ యను దానిని అనుసంధించెదను. "ఋతుస్నాత యగు భార్యను ఎవఁడు సన్నిధియం దుండియు కూడడో అతని పితరులు ఆ నెలయంతయు దాని రజస్సునం బండి పొరలుదురు" అన్నట్లు విధిని అతిక్రమించిన ప్రత్యవాయము కలుగదా అని యాశంకించి 'స్నేహమువలనను పితృభక్తివలనను' అనుట. రాముఁడు సీతాస్నేహమువలన ఒండు భార్యం బొందని వ్రతము పట్టెను. భీష్ముఁడును శంతనునికై సత్యవతిని ఇమ్మని ఆమె నాయనను అడిగినపుడు అతఁడు మహాబలుఁడవు నీవు రాజ్యాభిలాషుకుఁడవై యుండ ఈ పిల్లకుం గలుగు పుత్రులకు రాజ్యము లభింపదు, గావున ఈయఁజాలను. అనగా, అట్లైని నేను రాజ్యము ఏలనులే యని భీష్ముఁడు ప్రతిజ్ఞ చేయగా, (మరల) నీవు ఇట్లు మానుకొందు వేనియు, నీ సంతతిభయమువలన మా యమ్మాయి సంతతి రాజ్యభాగిని కాకపోవునే యని మఱియొక తూరియు అతఁడు ఈయఁజాల, పొమ్మనెను. వెండియు భీష్ముఁడు 'ఓయి అపత్యహేతువువలనను ఇప్పుడు ఇట్లు నిశ్చయించెదను. ఏమనగా ఇది మొదలు నాకు, ఓజాలరిరాయఁడా, బ్రహ్మచర్యము కాఁగలదు' అని — పితృభక్తిపరాధీనుఁడై బ్రహ్మచర్యవ్రతంబు పూనెను. నైమిత్తిక మగు పితృప్రీణన వ్రతము నిత్యమగు ఋతుకాలగమనమును బాధించుటం జేసి 'ధర్మమునకై మాత్రము నేను పెండ్లియాడఁగలను' అని పరిభాషించుకొని గ్రహించిన భార్యయెడ అగమనమున దోషము లేదు అని ఆశయము. ఇట్లైనను, అనపత్యతచే పితౄణము తీఱమిచే ప్రత్యవాయము ఘటిల్లదా అని యాశంకించి 'సొంతము గాను, ఎడము గాను' ఇత్యాది చెప్పుచున్నాఁడు. రాముఁడు సొంతకొడుకులచేతనే (కుశలవులచే) పితౄణమును చెల్లించినాఁడు. భీష్ముఁడు ఎడమైన విచిత్రవీర్యపత్యము లగు ధృతరాష్ట్రాదులచే చెల్లించినాఁడు..............ఓయి, ఆ రామ భీష్ములకు ధర్మమాత్రమునకై భార్య యుండెనని ఎక్కడను పురాణేతిహాసములయందు చెప్పకున్నను కేవలము ప్రమాణముచే తెలియఁగవలసినది అని చెప్పుచున్నాఁడు— 'ఔరక యజ్ఞమునకు మాత్రమే' ఇత్యాదిని. 'అపత్యహేతువు వలననుం గూడ' అని 'అపి' శబ్దప్రయోగము చేతను, 'అపత్యహేతువు' 'అది మొదలుకొని' అను విశేషణముల బలముచేతనుం గూడ ఇట్లే ఎఱుంగవలసినది అని సూచింపబడినది. 'ఒక వేళ భీష్ముఁడు అజ్ఞానము వలన పొరపాటు చేసియుండఁగూడదా, తప్పక ఆ 'యర్థమునకు' 'ఆపత్తి' (అర్థాపత్తి) ఎట్లు సంభవించు నన్న చెప్పుచున్నాఁడు. 'శ్రాద్ధకాలమందు నేను మా నాయనకు పిండము ఎత్తితిని. అప్పుడే మా నాయనయే భూమిం బగుల్చుకొని లేచి తన చేత నిడు మని యడిగెను. అంతట కల్పమున ఈ విధి కానరాదని నిశ్చయించుకొని నేను కొంకకుండ ఆ పిండమును కుశలయందే పెట్టితిని.' అను నితిహాసముం బట్టి అత్యంత నిపుణుఁడగు భీష్మునియెడ అట్టి మోహము సంభవింపదు గదా యని చూపుటకుం జెప్పుచున్నాఁడు— 'శ్రాద్ధకాలమున ఎవఁడు' మొదలైనది.

ఇందు 'ధర్మమునకై మాత్రము నేను పెండ్లియాడఁగలను అని పరిభాషించుకొని గ్రహించిన భార్యయెడ అగమనమున దోషము లేదు' అనుటచే ఈ మతమున ప్రతిజ్ఞానంతరము పెండ్లియని స్పష్టమైనది. [కాక ఒక వేళ కుమారిలుఁడు ప్రతినకు ముందె పెండ్లి, అప్పటికి సంతానము లేదు అని తలంచెనో!]

ఈ మీమాంసకాచార్య లిరువురును అవతిలంఘనీయవాక్కులు మన కందఱకు ఉపజీవ్యులు. కావున

కించిజ్ఞులము మన మింకు జోగాదనరాదు. అయినను మహామహుండు సకలశాస్త్రపారంగతుడు నాగోజీ భట్టే గుఱిపెట్టినాడు. ఋతుగమనవిషయమున ఆయన కావించిన నిత్య నైమిత్తిక బల తారతమ్య చర్చ ఈ సోమేశ్వరునిం గూర్చియే. ఐనను నిర్మత్సరులు ఈ రెంటను యథారుచి అన్యతరముపై పక్షపాతము చూప వచ్చును. నిజాభిప్రాయమున మీమాంసకులు వైయాకరణునికి ఓడినారనియే. ఆయన తాకి తీర్పని సందియములు ఈ మీమాంసకాభిప్రాయమున ఇంకను కొన్ని కలవు. సోమేశ్వరభట్టు భీష్మునికిం బెండ్లి చేయుచు ఋత్విగ్గమనమునకును, పిత్ర్యాణాపాకరణమునకును సమాధానముం జెప్పినాడుగదా అందు ఋత్విగ్గమనముం గూర్చిన సమాధానము చాలదని * నాగేశు డుపన్యసించెను. ఇక పిత్ర్యాణాపాకరణమునకుం జెప్పిన సమాధానము 'ఏకజాతులగు తోబుట్టువులలో' అను మనూక్తి ఇది యెట్లుపపన్న మగునో ఎంత తలపోసినను తెలియకున్నది.

విచిత్ర వీర్య క్షేత్రజ పుత్త్రులచేత భీష్ముడు అప్పుతీర్చుకొన నెంచె నట! ప్రతిజ్ఞానంతరముగదా భీష్ముడు పెండ్లిచేసికొనుట. అది విచిత్రవీర్యుడు పుట్టిన తరువాతనా యుండా? ఆ విచిత్రవీర్యుడే పుట్టక మునుపు, అతని తల్లి పెండ్లి సమయమున, ఇకను అతనికి పుత్త్రులు పుట్టుట ఎట్లు ఊహింపనగును? ఇతడు పుట్టగల జనియేని వారు పుట్టగల రనియేని ఎవరు తప్పని జోస్యము చెప్పుదురు? భీష్మునికి దివ్యదృష్టి కలదా? దాన వెలిగి యూరడిల్లి స్వయముగా ఆ యప్పు తీర్పు ప్రయత్నమును మానుటకు? దేవునిమీద భారము వైచి ఎట్లో ప్రత్యాశ కలిగియుండె నేనియు ఆ విచిత్ర వీర్యుని యున్న చిత్రాంగదుడు తనకై ఆ యప్పును తీర్పను పుత్త్రిక మార్జింపవలయు మొదటివాడు అట్లు అల్పాయువై చచ్చినపు డేని తాను దిగులుపడడా, ఎట్లబ్బు ఈ యప్పు అని? అట్లుండ నా విచిత్రవీర్యుడును మనువు చెప్పిన యాయమ్మడి పుత్త్రికనముం గూర్పకయే కాలముచేసెను. అప్పుడును భీష్ముడు దిగులు పడ డేమి? ఆ క్షేత్రజుల గూర్చి ఆయన ఎటువలె నమ్మియుండెనో, అంతకఅకును ఆ ప్రయత్నమును అట్లు మానుకొని యుండుటకు? కాక ధృతరాష్ట్ర పాండుల జన్మమునకుం దరువాత చేసికొనెనా ఈ 'పితామహుడు' పెండ్లిని? ఇక నెన్నడో తనకు కలుగబోవు వైమాత్రేయ భ్రాతల నూహింప జాలకయు ఈ కుమారిల సోమేశ్వరులు చెప్పు నుపాయము తోపకయు, భీష్ముడు

'అపుత్త్రస్యాపి మే లోకా భవిష్యన్త్యక్షయా దివి'
'అపుత్త్రుండ నైనను నాకు తఱుగని పుణ్యలోకములు గలవు' అని

'అనేకాని సహస్రాణి కౌమార బ్రహ్మచారిణాం,
దివంగతాని విప్రాణా మకృత్వా కులసన్తతిం'

అను మనూక్తిం దలపించు భంగిం జెప్పెనే ఇందుల భావమేమి? మఱియు 'భ్రాతౄణా మేకజాతానాం' అనునెడ 'సర్వే తే పుత్త్రిణః' అని పుత్త్రితనే చెప్పి యుండగా ఇట భీష్ముడు 'అపుత్త్రస్యాఽపి' అని తన్నేల నిర్దేశించికొనవలయును?

'అద్యప్రభృతి' అశ్రయించియు, 'దారాంశ్చ కురు' ను అశ్రయించియు భీష్ముడు ప్రతిజ్ఞ నాటికే పెండ్లియైనవాడని ఒక వాదము చేయబడెనే. దానిని ఈ మీమాంసకులు 'పరిభాషించుకొని' అనుటచే అనుగ్రహింపరైరి, అట్లు ప్రతిజ్ఞానంతరము పరిభాషించుకొని ధర్మమునకై మాత్రము భార్యంగొనెనను నెడ ఒక ప్రత్యవాయము పొసగునని వేదాంతి రంగరామానుజముని అనతిచ్చినారు. దానిని సమయాన దానిచోట వేదాంతుల వాదమున ఉదాహరింతును.

మీమాంసకులన్న వేదాంతులకు కాదు. తమలో ఐకమత్యము అంతంత యైనను, వేదాంతులు వారిని

---

* న చ నిత్యస్య ఋతుకాలిక స్త్రీప్రసంగస్య నైమిత్తికేన పిత్రర్థ మఙ్గీకృతేన బ్రహ్మచర్యేణ బాధః. షోడశ్యా మేవ సన్నిహితం ప్రతి అనేన నిత్యేన తత్తన్నైమిత్తిక సకల నిషేధస్య బాధ దర్శనాత్. అత ఏవ 'ఋతౌ శ్రాద్ధదినేఽపి భార్యాం గచ్ఛతో న బ్రహ్మచర్యహానిః' ఇతి మితాక్షరా.

నిత్యము నైమిత్తికముచే బాధిత మగును అను న్యాయముచే ఋతుగమన నిత్యము పితృప్రీణనముకై భీష్ముడు పట్టిన బ్రహ్మచర్య నైమిత్తికమునకు లోగదా అనిన, లోగదు. ఏలన పదియారవ రాత్రి మాత్రమే సన్నిహితుడగు పతిం గూర్చి ఋతుగమన నిత్యము మాత్రము తన్ను బాధింపవచ్చునే నైమిత్తిక నిషేధము నైనను అణచివైచును. అట్లే మితాక్షరములో విజ్ఞానేశ్వరుడు స్మరించినాడు—'ఋతు వగునేని, శ్రాద్ధ దినమందును భార్యాగమనమున బ్రహ్మచర్యహాని లేదు'. అని —నాగేశుని వైయాకరణ మంజూష.

దోషిమ్మగా నభిభవింతురు కదా. కావున ఇప్పుడే భీష్మదేవుంగూర్చిన వేదాంతుల యభిప్రాయమును పరిశీలింపదగును.

రంగరామానుజులు, జ్ఞానసంపదచే ముని యని అభ్యర్హితంబు గావ్యవహరింపబడువారు భావప్రకాశిక యను శ్రుతప్రకాశికటీకలో అనుషంగికముగా భీష్మదేవులగూర్చి పూర్వపక్షమవాద పూర్వకముగా సిద్ధాంతమును అనతిచ్చినారు.

అందుల ప్రకరణ మేమనగా- "బ్రహ్మసూత్ర భాష్యమున తృతీయాధ్యాయ చతుర్థపాదమున ఈ విచారము కలదు. పురుషార్థము (బ్రహ్మ)విద్యవలననా తదంగమైన కర్మవలననా? 'బ్రహ్మ వి దాప్నోతి పరమ్' మొదలగు నౌపనిషద ప్రమాణములం బట్టి విద్యవలననే. విద్యయే అంగము కర్మ అంగియని మీమాంసకులు. దీనిని పూర్వపక్షీకరించి విద్యయే అంగియని వేదాంతులురాద్ధాంతించినారు. ఏలన విద్యామహిమచే, సర్వదా కర్మచేసినను దాన గర్తలు పూయబడమిం బట్టియు; కొన్ని శాఖలవారు బ్రహ్మవిద్యానిష్ఠ గృహస్థుడు తన యిచ్ఛపై గార్హస్థ్యము విడువవచ్చునని పఠించుటంబట్టియు; (మఱియు) సాంసారిక సర్వ దుఃఖమూల మగు (నా) కర్మను బ్రహ్మ విద్య రాజవ దగుటంబట్టియు; అంతియ కాక, ఊర్ధ్వరేతస్త్వా ద్యాశ్రమములు అగ్నిహోత్రాది యే కర్మయు లేనివైనను గార్హస్థ్యతుల్యములు వైదిక శబ్ద విహితములు ఉండుటం బట్టియు; విద్యవలననే పురుషార్థముగాని కర్మవలనం గాదు అని యుపపత్త్యుపన్యాసము. విద్యవలననే పురుషార్థమేని, కర్మవలనం గాదేనియు, గృహస్థుడు కర్మ చేయవలసినవాడు అమృతత్వము బొందుటకై యజ్ఞాదులు చేయక మానవచ్చును గదా యన్న, కూడదు, అశ్వన్యాయముచేత. గమన సాధనభూతమైన గుఱ్ఱమునకు జీను తగిలించుటమొదలైనది మానరానిదే గదా. మఱియు ముముక్షువు ఆశ్రమధర్మముగు కర్మను, విద్యాంగముగుటచే చేయవలయు నేని, ముముక్షువు కాని వాడు, వట్టి యాశ్రమి, కర్మచేయ నక్కఱలేదుగదా యన్న, చేయవలసినదే, విద్యకుంబోలె ఆశ్రమాలకును అవే కర్మలగుటంబట్టి, తా నాశ్రమి, వానిని చేయవలయును— అని సిద్ధాంతము. ఈ యుపన్యాసముచే నాలుగాశ్రమాలవారికిని బ్రహ్మవిద్యకు అధికారము కలుగుటం బట్టియూ, ఆశ్రమధర్మములు ఆ విద్యకు సహకారులగుటంబట్టియు, అనాశ్రములగు విధురాదులు విద్యం గోలుపోరా యనిన, పోరు, అనాశ్రములకును బ్రహ్మవిద్యాధికారము కావనగుచున్నది. కలదు గదా రైక్వ భీష్మసంవర్తకాదులు, ఆశ్రమాంతరాళ వర్తులు అయ్యును బ్రహ్మవిద్యానిష్ఠులు! ఆశ్రమధర్మాలు మాత్రమే విద్యానుగ్రాహకములా? ఇతరములుం గలవు. ఊర్ధ్వరేతులకు అగ్నిహోత్రాదికంటె ఇతరమే విద్యను ఎట్లు అనుగ్రహించునో, అట్లే అనాశ్రములకు ఆశ్రమనియుతములు కాని జపోపవాసదానదేవతారాధనాదులే విద్యను అనుగ్రహించును."

ఇది భగవద్రామానుజ శ్రీభాష్యములోని యుద్ధారము, ఇటం దెనుగున అనువదింపబడినది. ఇందు కర్మ యంగమే అనుచోట ఊర్ధ్వరేతులం గూర్చిన వాక్యమును ఆశ్రమమును అంగమే యనుచోట అనాశ్రములంగూర్చిన వాక్యమును అందు భీష్మకు కంఠోక్తముగా ఉదాహృతు డగుటను అరయవలయును. ఇందు ఊర్ధ్వరేతః ప్రకరణమున 'కావున నే అగ్నీంధనాదియపేక్ష లేదు' అని సూత్రము. అనగా అగ్నీంధనాధికారము లేని యూర్ధ్వరేతులు విద్యావంతులు ఉండుటంబట్టి, వారి యెడ అగ్నీంధనాది అక్కఱలేదు. మఱి ఊర్ధ్వరేతస్త్వాశ్రమమునకు ఏ కర్మలు విహితములో అవే చాలును, వారికి విద్యను అనుగ్రహించుటకు— అని భావము. ఊర్ధ్వరేతుడన్న మాట భీష్మునికిం గలదుగదా. ఆ ద్వారమున ఈ సూత్రముమీది భావప్రకాశికలో రంగరామానుజులవారు భీష్ముని గ్రహించినారు.

ఇట వా రొక పూర్వపక్షముం దడవినారు. ఎట్లనగా "వేదమందలి విద్యా సంబంధ బోధకములగు వాక్యములకు— జపాదులచేతనే అనువానికి-అనన్యపర్యము అనగా ఇతరులకుం జెందుటకు కానందగును. ఊర్ధ్వరేతులకు తప్పక విద్యాసంబంధము చెప్పవలయు నేని అప్పుడు అంగములు ఉపకరింపని విద్య ఫలమొసంగమిం బట్టి తదంగములైన యజ్ఞాదులు అనుష్ఠింపవలయును. అందులకై పెఱ్ఱొండు భార్యంగొని అగ్న్యాధానాదికము చేయదగును. అట్లు భార్యను పరిగ్రహించినందున ఊర్ధ్వరేతస్త్వమునకు విరోధము వాసగదు. విద్యాంగమగు కర్మకోసము భార్యం గొన్నను, భీష్మునికింబోలె, ఊర్ధ్వరేతస్త్వము ఉపపన్నము యగును ......ఉపనయనవిధిపూర్వకముగా విద్యగ్రహించిన పిమ్మట చెప్పబడిన దారపరిగ్రహము

అనగా పెండ్లి - ప్రజార్థము కాగలదుగాని, మఱి యిట్లు గ్రహించినభార్య అట్లు కానేరదు. కేవల ధర్మార్థము అగును. ఆశ్రమధర్మములచేతనే విద్యాంగములు సిద్ధించుటంబట్టి, యజ్ఞాదులు చేయుటకై ఆధానమును పెండిలియు అపేక్షితములు కావని చెప్పగూడదు. 'యజ్ఞేన' అని కరణతృతీయ స్పష్టముగా చెప్పబడి యున్నందున యజ్ఞాదులు విద్యకై విశేషముగా, అనగా అసాధారణముగా, విహితములగుటంబట్టి కర్మలం త్యజింపదగునన్న వేదపుమాటయే ఉన్నదే, ఎట్లుఅన్న, అది విద్యకు అంగములు కాని కర్మలవిషయమైనది అనుకొనవలసినది." అని.

దీనికి ఆ రంగరామానుజులవారు అవతరించిన సిద్ధాంతమేమనగా— కేవలము పుత్రార్థమై కొన్నట్లు భార్యను కేవలధర్మార్థము గొనరాదు. ధర్మవిషయమును అర్థవిషయమునను అతిచరింప గూడదని స్మృతిశాసనము గలదు. భీష్ముని కన్నను ధర్మముకొరకును ప్రజకొరకును— ఉభయము కొరకును— పెండిలి కావలసినది. తరువాత నాయనను సంతోషపెట్టుటకై ఊర్ధ్వరేతస్త్వమును ప్రతిన సేయగా, దాన పుత్రోత్పాదనాది నివర్తిల్లగా, భార్య కేవలము ధర్మార్థము మిగిలినది. దానజేసి ఆయన యజ్ఞాదులు అనుష్ఠించినాడు. అంతియ కాని ఊర్ధ్వరేతస్త్వము ప్రతిన చేసిన తరువాత కేవలము ధర్మముకొరకు పెండ్లికాదు. కేవలము ధర్మముకొరకు దారసంగ్రహము శ్రుతులవలనను స్మృతులవలనను సూచింపబడలేదు. సన్న్యాసుల ధర్మమును ఆలోచించినను అట్లేయగును. సన్న్యాసులకు ఇష్టానుసారముగా తగిన వ్యక్తులతో పెండ్లి కూడునని ఎందేని కలదా? దారపరిగ్రహము బొత్తిగా అనుపపన్నమే గదా యగును.

ఈ పూర్వపక్షి ఎవడో! మీమాంసకుడు కాబోలును. ఎవరైనను, ఆ పూర్వపక్షము పైకి సిద్ధాంతముం జెప్పుచు వీరు, భీష్మునికి తొలుత యథావిధిగా ఉభయార్థమైన పెండిలియు, తర్వాత భార్య యజ్ఞమాత్రార్థము మిగులుటయుం జెప్పినవారైరి.

ఈ మతముకొరకే శారీరక శాస్త్రార్థదీపిక యను తమ రచించిన మఱియొక గ్రంథమున 'అన్తరా చాపి తు, తద్దృష్టేః' అను అనాశ్రముల సూత్రమున '..... ఆశ్రమాత్ అన్తరా వర్తమానానాం అనాశ్రమిణాం ...తాదృశానామపి భీష్మ రైక్వ సంవర్తాదీనాం బ్రహ్మవిద్యా దర్శనాత్' అని శ్రీరామానుజ శ్రీభాష్యమందుం బోలె భీష్ముని గ్రహించినారు, అనాశ్రమి యని. తర్వాత 'అతస్త్వితరజ్జ్యాయో, లిఙ్గాచ్చ' అని 'అనాశ్రమిత కంటెను ఆశ్రమితయే మేలు' అను సూత్రము మీది దీపికలో చెలవిచ్చినారు. అనాశ్రమిత్వము ఆపద్విషయము; శక్తుని కన్నను ఆశ్రమితయే ఉపాదేయము; ఏలన, అల్పధర్మమున కన్నను భూయోధర్మము గొప్పది గదా. అట్లే స్మృతి కలదు. "ద్విజుడు అనాశ్రమియై ఒక దినమేనియు నుండగూడదు" అని. వైరాగ్యము లేనపుడు పెండిలి లేమి ఆపద యగును. వైరాగ్యమున్నపుడు సన్న్యాసమే, వాలయాశ్రమము స్వీకరింపబడును గదా. అవిరక్తునికి బ్రహ్మవిద్యాధికార మెక్కడిది, లేదు గదా అనియు శంకింప జనదు. అగ్నిహోత్రాది అనుష్ఠించుకోరికచేత పెండిలి కావలయు ననునాస యున్నను, భార్యాదియందు భోగ్యతాతిశయబుద్ధికృత ప్రీతి లేమిచే బ్రహ్మవిద్యాధికారము సంభావించుటం బట్టియు, దేహాంతరముం బొంది బ్రహ్మకన్నను మించిన ఇతరఫలము ననుభవించు నాశ లేమికతన, మోక్షేచ్ఛకు ఉపకరించు వైరాగ్యము కలుగుటం బట్టియు." ఇందు 'అగ్నిహోత్రాద్యనుతిష్ఠాసచేత మాత్రము పెండిలి యగుట, భార్యయందు భోగ్యతాతిశయబుద్ధికృత రాగము లేకపోవుట' అన్నయెడ రంగరామానుజులవారు నోట చెప్పకున్నను భీష్మచరితముం గూర్చిన తమమతమునే స్మరించుచున్నారని తోచెడిని.

ఇందవధరింపవలసినది ఏమనగా—(i) భీష్ముని ఊర్ధ్వరేతుడగుటంబట్టి ఒక తెఱంగు ఆశ్రమి యన్నవానినే యజ్వయగుటంబట్టి కృతదారుడన్నవానినే, ఆశ్రమాంతరాశవర్తిగా అకృతదార మృతపత్నీకులలో అన్యతరుంగా జెప్పుట! (ii) మఱియు, అట కేవల పుత్రార్థముంబోలె, కేవల ధర్మార్థము పెండ్లి కూడదనియు, ఇట అగ్నిహోత్రాద్యనుతిష్ఠాసచే మాత్రము పెండిలి యనుట.

(3) రంగరామానుజ వేదాంతులు, వారిని ఇందెదుర్కొన్న పూర్వపక్షి యన్ననో మీమాంసకుడు, ఒకవేళ మాహేశ్వరుడే కాబోలును. ఈ యిరుకతల నాగులయం దెవ్వరిచేత గాని ఈపాటికే గెలుపుసిద్ధించినదనరాదు. వినను భట్టమాహేశ్వర మతవిచారమున ప్రతిజ్ఞానంతరము పెండ్లి అన్నయెడ సమయాన ఎత్తరింత

నన్న వీరి ప్రత్యవాయము ఇందు స్ఫుటమైనదికదా. రంగరామానుజవారు, ఎక్కడి కక్కడ విగ్రహగా నున్నను, పూర్వోత్తరవిరోధముతోచు తబ్బిబ్బుచే దూషితముగను తోచుచున్నది. మఱి ఒండొరులపై అర్థాపత్తినే విసరుకొన్న వీరి యుద్ధమున భీష్ముని యోగక్షేమము విలట్టును ఒకటే— పెండ్లి చేసికొన్నవాడే. ఎప్పుడు ఎట్లు అను విషయమున మాత్రము ఇంచుక అభిప్రాయ భేదముగలదు. ఆయన పెండ్లి మానుకొన్నవాడను మతమునకు ఇరువురును విరోధులే. సోమేశుని మతము నాగేశునిచే ఎదుర్కొని నిక్షింపబడినది. అందు ఆ మహామహులకు పరామర్శింపని యనుపపత్తులలో కొన్నింటిని జిజ్ఞాసుడనై నేను దిడువితినిగదా. రంగరామానుజులను నాగోజి ఎఱుగునో ఎఱుగడో ఎఱుగను. ఎఱిగినను ఎఱుగకున్నను ఈ వాదముపైకిం దగిన యుక్తిమున నిత్యతావాదంపు భిరంగిని, గుండు వేసి ముందు ప్రక్క సిద్ధముగానుంచి యున్నాడు. కావున ఇక ఎవరైనను ఆ గాదు చేయవచ్చును. అగాదు చేయుట మఱియు సులువగునట్లుగా, ఎదిరి చేతికి ఆ రంగరామానుజులవారే 'ధర్మమునకును అర్థమునకును అతిచరింపగూడదు' అని యాజిని వత్తిని స్మృతిపెట్టె నుండి తీసియిచ్చినారు. ఋతుగమనము పితృఋణమునకై ఉజ్జగించుట ధర్మమును అతిచరించుటయో, ధర్మమునకై అతిచరించుటయో, ఉభయమునో కాదో? ఈ నిత్యనైమిత్తికములకు బలాబల నిర్ణయమెట్లు? ఎవరు సేయగలరు? ఎందుకలదు?

(b) ఊర్ధ్వరేతస్త్వము చతురాశ్రమముల కన్న వేఱు, ఆశ్రమవిశేష మనియు ప్రత్యక్ష మనియు ఈ ఘట్టమున భగవద్రామానుజులవారు భాష్యమునం జెప్పినారు; సూత్రమును బట్టియే—'ఊర్ధ్వరేతస్సు చ శబ్దే హి'—(శబ్దమందే అనగా వేదమందే ఊర్ధ్వరేతుల యందు బ్రహ్మవిద్య చెప్పబడి యున్నందునను.) తరువాత 'అత ఏవ చాగ్నీన్ధనా ద్యనపేక్షా' (కావున నే అగ్నీంధనాది అపేక్షితము గాదు) అను సూత్రభాష్యమున మరల ఆయూర్ధ్వరేతులు అగ్నీంధనాది యే కర్మయు లేనివారని పరామర్శించినారు. కావున ఊర్ధ్వరేతులనగా వారెట్టివారో రామానుజమతమున ఎఱుగవలసియున్నది. భీష్మదేవునికి ఊర్ధ్వరేతుడన్న ఖ్యాతి యున్నందున రంగరామానుజులవారు ఆయనను ఈ సూత్రములకడ అట్లు ఉదాహరించిరి. మఱి రామానుజులవారు తరువాతి యధికరణమున అనాశ్రములం గూర్చి చెప్పనెడ 'అన్తరా చాపి తు, తద్దృష్టేః'— ఆశ్రమాంతరాళ వర్తులకును (బ్రహ్మవిద్య కలదు.) దృష్టాంతములు ఉండుటంబట్టి— అను సూత్రముపైని భాష్యములో అట్టి దృష్టాంతములు చేర్కొనునెడ భీష్ముని గ్రహించియున్నారు. అట ఆశ్రమియే ఊర్ధ్వరేతుడు కాదగునని సిద్ధాంతించి, ఇట అనాశ్రములలో భీష్మునిం జెప్పుటయందు అభిప్రాయమేమగును? ఊర్ధ్వరేతుడనగా తాము ఏమని తలచిరో కాని, భీష్ముని ఆ తెగలో చేర్చగూడదని వారిమతమని ఊహింపవలదా? కాక, అనాశ్రమియు ఊర్ధ్వరేతుడు గాదగునని ఎంచియుందురా? అట్లు ఊహింపవలయునని తత్సూత్రభాష్యోపసంహారమున ఊర్ధ్వరేతులకు అగ్నిహోత్రాదికంబు ఇతరమే ఎట్లు విద్యను అనుగ్రహించునో, అట్లే అనాశ్రములకు ఆశ్రమానపేక్షితము లగు జపోపవాసాదికము విద్యను అనుగ్రహించును—అని యుపన్యసించిన సాదృశ్యముచేతను పార్థక్యమును పార్థక్య మను స్పష్టపరిచినారు కాబోలును. కాక అనాశ్రమికిని ఊర్ధ్వరేతునికి కొన్నియెడల ఐక్యమును ఒకవేళ అనుమతింతురా? రంగరామానుజులవారు ఊర్ధ్వరేతః ప్రస్తావమున భీష్మకథను అట్లు త్రవ్వుట భాష్యకారహృదయమునకు ఎడయుట కాదా యని జిజ్ఞాసింతును.

(c) మఱియు ఈ యనాశ్రమ్యధికరణమున శ్రీ భాష్య వాక్యక్రమమును ఇంచుక అవసరింపవలయును. 'యే పున రాశ్రమాన్తరా వర్తన్తే విధురాదయః తేషాం బ్రహ్మవిద్యాయాం అధికారో ఽస్తి న వా ఇతి విశయే—' ఎవరు ఏ యాశ్రమమువారునుం గాక అంతరాళమున నుందురో—అనగా విధురాదులు—వానికి బ్రహ్మవిద్యయందు అధికారము కలదా లేదా అను సంశయము కలుగగా—అని చర్చకు అవతారమును, 'అన్తరా వర్తమానానాం అనాశ్రమిణా మపి విద్యాయాం అధికారో ఽస్త్యేవ.'—అంతరాళవర్తులకు ననాశ్రములకును విద్యయందు అధికారము కలిగియే యున్నది—అని తీర్పును, 'కుతః, తద్దృష్టేః; దృశ్యతే హి రైక్వభీష్మసంవర్తాదీనాం అనాశ్రమిణా మపి బ్రహ్మవిద్యానిష్ఠత్వం'— 'ఏలయన, అట్టి దృష్టాంతము లుండుటంబట్టి కలరు గదా రైక్వభీష్మసంవర్తాదులు, అనాశ్రములయ్యు బ్రహ్మనిష్ఠులు'— అని యుపపత్తి సంగ్రహమును, అనాశ్రములనగా విధు

రాదు లట, రైక్వ, భీష్మ, సంవర్తాదు లట. ఇక 'విధురాదయః' పైని శ్రుతప్రకాశిక—విధురో మృతపత్నీకః, ఆదిశబ్దోపాత్తాః అకృతదారాః' అని తెలియజెప్పుటచేతను, శ్రీ భాష్యకారులే అనాశ్రమిత్వము కూడ గంటు తెలియించలదే, మూడవది లేదను నభిప్రాయముగా, తరువాతి మాత్రమున "అతస్త్వితరజ్జ్యాయో, లిఙ్గాచ్చ. 'ఇంతకన్నను — అనాశ్రమిత్వకన్నను — వేరైనది అనగా ఆశ్రమిత్వమే మేలు..." అను దానిమీది భాష్యమును ముగించునపుడు 'అనాశ్రమీ న తిష్ఠేత్తు దినమేకమపి ద్విజః'—'ద్విజుడు అనాశ్రమిగా ఒక దినమైనను ఉండఁగూడదు' అను స్మృతి 'శక్తునిం గూర్చి' యే ఆశ్రమగ్రహణమును చెప్పును. నివృత్త బ్రహ్మచర్యునికిని మృతభార్యునికిని వైరాగ్యము లేకుండు నేని పెండ్లికూనుట ఆపద యగును (దోషము తెచ్చును)—అని నివృత్తబ్రహ్మచర్య మృతభార్యులను మాత్రమే వావిచ్చి చెప్పుటచేతను, దీనిపై "నివృత్త బ్రహ్మచర్యస్యేతి పారివ్రాజ్య వ్యావృత్త్యర్థం" అనగా నివృత్తబ్రహ్మచర్యు డనుట పారివ్రాజ్యముం బూనినవాడు కాడని తెలుపుటకు.' అను శ్రుతప్రకాశిక గురుకుల సమావృత్తుడగు నకృతదారునే నిర్దేశించుటచేతను, దృష్టాంతీకరించునపుడు ప్రసిద్ధిగలవారి నే గ్రహింతు రనుట ఉచితి మగుటచేతను, భీష్మునికి విధురత్వప్రసిద్ధి ఎటను లేమిచేతను, భాష్యకారుల మతమున నేమి శ్రుతప్రకాశికాచార్యుల మతమున నేమి భీష్ముడు అకృతదారుడగు ననాశ్రమిగానే నిర్దిష్టు డనుట స్పష్టము, సందేహము లేదు. రంగరామానుజుల వారును అగ్నీంధనాది సూత్రముకడ భీష్మునికి ధర్మ "ప్రతోధయార్థ" ము పెండ్లి కావించి ఇటను అనాశ్రమములలో ఆతనిం జేర్కొనుటచే, కాలాంతరమున భార్య మృతి జెందగా విధురు డాయె నను నభిప్రాయమును సూచించినారా? అది చెల్లదు; ప్రసిద్ధి లేమిచేతను, ప్రమాణాలు లేమిచేతను. అధికరణ నామమునకు ప్రతీకమాత్రమును గ్రహించు మర్యాదచే విధురాధికరణ మనుట, విధురాద్యధికరణ మనమి, భీష్మునికి విధురత్వ సమర్థకమగునా? 'అత ఏవ చాగ్నీంధనాద్యనపేక్షా' అని అపేక్షలేమిం జెప్పు నధికరణమునకు 'అగ్నీంధనాధికరణ' మని పేరున్నమాత్రాన అపేక్ష కలిమిం జెప్పదురా ?

(d) అగ్నీంధనాద్యనపేక్షాధికరణమున జెప్పద తెచ్చు నీ భీష్మప్రస్తావన మేల? ఊర్ధ్వరేతుడైన తరువాత అనగా శ్రీ భాష్యకారులు చెప్పినట్లును రంగరామానుజులును ఒప్పుకొన్నట్లును (జపాది కేవల కర్మలే చాలి) యాగాద్యతిశయక్లేశ సాధ్య కర్మలు అనావశ్యక మగు నూర్ధ్వరేతస్త్వాశ్రమముం జొచ్చిన తరువాత, భార్య శేషించియున్నను, యజ్ఞములు, విశేషించి అశ్వమేధములు చేయు టెల? చేయకున్నం బ్రత్యవాయమా ?

(e) ప్రతిజ్ఞకుబూర్వమే అట్లు గృహమేధియైన భీష్ముడు ప్రతిజ్ఞ నాటివరకు ఋతుగమనాది పూరించుమంది తరువాత నాయసక్లేశము దానిని మాత్రము మానుకొని యజ్ఞాదికర్మములు చేయుచునే యుండగా, గృహస్థాశ్రమ బహిష్కృతుడై ఇటు వేదాంతమున సాధించిన పారివ్రాజ్యవిశేష మగు నూర్ధ్వరేతస్త్వాశ్రమమునం బ్రవిష్టు డగునా? ఇంటనున్న ఊర్ధ్వరేతుడే కాడా? ఆయనకు ఆ పక్షమున గార్హస్థ్యమే పొసగదా? మఱియు అనాశ్రమి యేనియు ఎటువలె నగును?

(f) భగవద్రామానుజమతమున అట్లు అకృతదారుడగునేని భీష్ముడు యజ్ఞము లెట్లు చేసెనో పర్యాలోచింపవలసియున్నది. దానికి సమాధానముం జెప్ప బూనియే రంగరామానుజులు అట్లు అంత గందరగోళపడుట.

(g) 'అన్తరా చాపి తు, తద్దృష్టేః' ఇతి వ్యాససూత్రముపాదాయ 'అనాశ్రమిణామపి భీష్మాదీనాం బ్రహ్మవిద్యాధికార దర్శనాత్' ఇతి శారీరకభాష్యకారా వ్యాచఖ్యుః' అని మంజూషకుంచిక. ఈ శారీరకభాష్యకారు లెవరైనను వారు భీష్ముని అనాశ్రమిగా గ్రహించుటను అవసరింపదగును. కలకత్తాముద్రిత శాంకర శారీరకమున 'రైక్వ వాచక్నవీ ప్రభృతీనాం' అని యుదాహరణము లున్నవి, కాని భీష్మశబ్దము లేదు, ఇది వేఱు భాష్యము కానోపును, కాదా పాఠాంతర మేనియు.

(h) శ్రీమన్నిగమాంతగురువులు శ్రీభాష్యాధికరణ సారావళి యను 'ప్రశ్నరాడుత్తరాళి'లో అనాశ్రముల తెప్పలో కూర్చుండ బెట్టి భీష్ముని పైకొరి త్రిప్పినారు. వారి కుమారులే తన్నిభులు వ్యాఖ్యానించుచు సొంత చేతితో తెడ్డు వేసినారు. ఎట్లనగా—

"దారాలాభే, విరక్తే ర్మృదిమ్ని చ
ధవే దత్తరే ణాశ్రమాన్ యు

తస్మిన్ నిశ్శేషబ్రహ్మత్యాగీ భవతు
కథం బ్రహ్మవిత్స్యాదితి చేత్; న;
సామాన్యైర్వర్ణధర్మైర్గుణనియతి
యుతైః సా హి తత్రాపి సాధ్యా.
భీష్మాదౌ దృష్ట మేతత్, భవతి తు వ్య
సనే గత్యభావా దభావః"

'దార దొరకకున్నను, విరక్తి (ముముక్ష) ముఖ్యముగ నున్నను ఎవడు ఆశ్రమాంతరాశ్రమున నుండునో, అట్టినియందు సకల (ఆశ్రమ) ధర్మములం ద్యజించిన వానియందు ఎటువలె బ్రహ్మవిద్య సాధగును అని యాశంకింతు రేని చెప్పెదము:—అట్లు గాదు, అట్టి వాని యెడను (ఆశ్రమధర్మములు లేకున్నను) గుణని యతియుతము లగు సామాన్య వర్ణధర్మములచేత నే, విద్య సాంగమై నెలకొనును. అట్టిది భీష్మాదులయందు దృష్టమే. మఱి వ్యసనునియెడ మాత్రము, గతిలేమిచే, అది సంభవింపదు.' అని.

దార దొరకమి, గురుకులాభిసమావృత్తుని యెడను, మృతపత్నీకునియెడను, పెండ్లికామికి హేతువు. విరక్తి ముముక్షువగుట పరివ్రజింపమికి హేతువు. కావున అనాశ్రమిగా మిగులుట అని భావము.

వ్యాఖ్యాన మెట్లనగా "దారలాభాభావము చేతను, పరివ్రాజకాశ్రమమును స్వీకరింప వలంతి యగు విరక్తి ముముక్షతచేతను ఆశ్రమహీనుడై ఎవడు నిలుచునో, అతనికి అధికారము గోలుపోవుటచే ఏ కర్మను చేయ నేరని వానికి బ్రహ్మవిద్యాధికారము కలుగువా యన్న, ఏల కలుగదు? ఆశ్రమధర్మములు అతనికి లేక పోవును గాక; ఫలసంగము నిరాకర్తృత్వము మొదలైన దానిని వదలుకొనుట యనుగుణ నియమములు గల కేవల వర్ణధర్మములచేత నే అధికారి యగు నతనియందు బ్రహ్మవిద్య సాంగముగా తీరము గొనును. ఇది యూరక మా కల్పించిన మాట గాదు; ఇట్టిది గాంగేయాదులయందు దృష్టమే." అని.

ఈ మహానుభావులను భీష్ముని విధురుఁ గనమిని పరికింపవలసినది. అదియును తదకృతదారతా సమర్థకము గానోపును; ఆ ప్రసక్తిం బట్టియు, తద్వైధుర్య ప్రస్తావ మెందును కానరామిం బట్టియు.

ఈ సకల గ్రంథమునం దాశ్చర్య మేమనగా, త్రిమతముల వేదాంతులను వైమత్యము లేకుండ భీష్మునిం గూర్చి ఆయన సమావర్తనముం జేసికొని, నాయనకై తన పెండ్లి మానుకొన్నవాడు—అకృతదారుడు— అను తత్త్వమునే అనుషంగికముగా చెప్పినారు. 'అన్తరా చాపి తు తద్దృష్టేః' అను సూత్రభాష్యమున భీష్మోదాహరణమును ఏకరీతిగా వారు గ్రహించుట చూడగా, వారికిం బూర్వమునుండి యున్న యీయనం గూర్చిన సంప్రదాయమును తమ యభ్యుపగతితో వారు మనకు అందించుచున్నారని తెలియనగుచున్నది. భీష్ముని యకృతదారత వారి చిత్తములందును ఆ శాస్త్రపర్వములందును అట్లు వేరులు పాఱి యున్నది.

మఱి భీష్ముడు అశ్వమేధములు చేసినవాడు; ఆయన ప్రేత సంస్కారమునకు ధర్మరాజు తెచ్చినవి యాయన యగ్నులనే (బహువచనము!) అను భారతోదాహృతిం గూర్చి భగవద్రామానుజ శ్రీమన్నిగమాంత గుర్వాదులు ఎట్టి సమాధానముం గూర్తురో! వారు ఇదంపరులు గాక పారాశర్య సూత్రభాష్యమును దాని వ్యాఖ్యానమును నెలకొల్పుదుం బోయినారు. ఈ చర్చకుం గడంగరైరి.

# సుధాలహరి

శ్రీ దివాకర్ల వేంకటావధాని

విరిసిన తమ్మిపూలపయి ప్రేలుమదాళుల కుత్సనంబు, దు
స్తరమగు కోకకాంత పరితాపము బాపెడు మందు, తేజముఁ
జెరచిన కారుచీకటికి జిచ్చు, విలోచన పక్షపాతియై
వరలిన దొక్కఁ కాంతిసమవాయము తూరుపు కొండప్రక్కఁగా.

జలజహాని యొనర్చు తెలుపైన పచ్చని యిందుకాంతుల గర్వ మింకజేసి
చీకటిలోబడి చివుకు లోకము దవ్వుగానుండియే తెల్వి గాంచజేసి
జీవుల దైన్య ముచ్ఛేదింప కరుణతో ముంజేత కంకణమ్మును ధరించి
క్రమముగా నరుణమౌ కాంతిపుంజమ్ముచే రారంజితమ్ములై రాణకెక్కి
యుదయకాలమందు నుద్భవమందుచు
నఖిల జగములందు నవతరించు
కిరణసమితి మాకు జిరతరానందము
గలుగజేసి యెపుడు గాచుగాక !

ప్రతిదిన దేవరక్ష, సకల ప్రతిబంధక రోగశిక్ష, సం
తత జగదంకరక్ష, నళినప్రకరప్రియ భాగ్యలాక్ష, సం
గతముగ భక్తకల్పములుగా బరితప్త సువర్ణకాంతికిఁ
బ్రతులగు భాస్కరాంశువులు పారగద్రోలుత మామకాఘముల్.

భూనభోంతరముల బులిమి యేపునుగన్న చీకటి నొక ముద్దజేసి మ్రింగి
యఖిలజగమ్ముల నావరించిన మంచు నిమిషమాత్రమ్మున నీరుజేసి
యెడబాటుచే బాధపడు కోకకాంతల యార్తిని బాపు పుణ్యమ్ముగట్టి
బాలప్రవాళ సంప్రదేఖ నవరింప ముదముతో బంగారు పూతబూసి
యమరలోకపాలకాపద్విమోచన
సన్నుతంబులగుచు జగతిఁబ్రాకు
భాను కిరణసమితి పాపమ్ము లెడలించి
కూర్మి మాకు మేలు గూర్చుగాక !

దట్టమైన విశాల తరుగర్భముల జీల్చి వంగుల వెంట భూస్థలికి దిగ్గు
తముగాంచి నిషుదలై తనరారు బంగారు దండములంచు జిత్తముల బ్రమసి
చిలుక పిల్లలు తమ చిన్నారిపదముల దమివిూర బయిపైన దన్ని వెట్టి
లేతచివుళ్ళపై లీలగా జలియించు ప్రాలేయకణముల బక్వమైన

దాడిమీబీజముల పెంపు దలచికొనుచు
జంచుపులవిప్ప నలరు భాస్కరుని దివ్య
కిరణ సముదాయ మెలమి మా కిల్బిషముల
బాపి యేవేళ మమ్ము గాపాడుగాక !

పవలు విహారయోగ్యమగు పద్మగృహమ్ముల తల్పుదీసి రే
యి విడిసి వీడు చెంగలువ యిండ్ల కవాటము మూసి వేగమే
యవనిని జీల్కి కుంకుమపుటంబువులన్ దొలి సంజలక్ష్మికిన్
దవిలి సపర్యజేయు హరిదశ్వకరంబులు మమ్ము బ్రోవుతన్ !

ధరణీపాలక సౌధశృంగముల మీదన్ హింగుళాలేపముల్
తరుషండంబుల నూత్నపల్లవరుచిన్ దాపించి ప్రాలేయపున్
గరకల్ కాష్ఠములన్ జ్వలించు ఖదిరాంగారంబులై మండ సా
గరమున్ జీలిచివచ్చు భానుకరముల్ గాపాడు గాతన్ మమున్ !

కాశ్మీర చూర్ణంబు కలిపిన నీటిచే ధరణి పల్వంకల దడుపబడియె
బద్మకారాగార బంధనంబు సడల్పబడి మ్రోసె నున్మత్త బంభరములు
గోసహస్రములు దిక్కులు నాలుగింటికి విగత శృంఖలములై వెడలిపోయె
వినిపించుచున్నది వివిధ ద్విజకులంబు కావించు బహుళమహా కలకలంబు

విమల చిత్తులైన విబుధులందరి పురా
భవనిబద్ధ పుణ్య ఫలమనంగ
బ్రాచి యన్నపడతి ప్రసవించుచున్నట్టి
మహితపుత్ర మణికి మా నమస్సు.

[పండితరాయల కృతికి తెనుగు - సశేషము]

# నన్నయభట్టు కావ్యసిద్ధాంతము

## శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి

మన సంప్రదాయమున కవివేఱు సహృదయుడు వేఱు కాఁడు. ఇద్దరు మహాకవియందు కలిసియున్నారు. మహాకవియనగా కవి సహృదయుఁడన్నమాట. 'సరస్వత్యాః తత్త్వం కవిసహృదయాఖ్యం విజయతే' అని అభినవగుప్తునిమాట. వాల్మీక్యాదులు ఉత్తమ సహృదయులు. వారి నోటినుండి కవిత్వముతోబాటు దాని సౌందర్య వివేచనము గూడ ఆవిర్భవించినది. అందుచేత వారి కావ్యములకు వారి కావ్యములే చక్కని యనుశీలన గ్రంథములు. (ఇచట యనుశీలనమని యేల చెప్పితిననగా పరిశీలనము, విమర్శనము, నీ రెండు మాటలు కావ్య వివేచనమును సరిగా దెలుపునవి యైనను నేటివలి కాలమున వానియందు గొంత దురర్థము సమకూర్చుకొన్నవి. అందుచేత ననుశీలన మని వాడుచుంటిని.) మన మా గ్రంథములు పలుమారు చదివినచో వానియందుండు బహుకళారహస్యములు నవియే విప్పిచెప్పును. ఆ రహస్యములు చదువుకొనువారెఱింగికొనుటకు వలయు వ్యాఖ్యానము నా మహాకవులే యవసరమైన చోట వ్యంగ్యముగనో వాచ్యముగనో చేయుచుందురు. అందుచేత మహాకవి యనగా తాను వ్రాయుచున్న కావ్యముయొక్క సౌందర్యమును గూడ వ్యాఖ్యానము చేయుచు వ్రాసికొని పోవువాడని యర్థము. వాల్మీకి మార్గము నాశ్రయించి భాస కాళిదాస భవభూత్యాదులు, తమ కావ్యములందీ వ్యాఖ్యా నైపుణ్యము ప్రదర్శించిరి. నన్నయభట్టు వారికోవకు చెందిన మహాకవి.

భట్టారకుడు వ్రాసిన గ్రంథములలో నేడు మనకు లభించినవి ఆంధ్రశబ్ద చింతామణి, భారతము రెండే రెండు గ్రంథములు: చింతామణి నన్నయభట్టారక కృతమని నమ్మినవాడను గనుక ఇందు ఆంధ్రశబ్ద చింతామణి నతడు తాను వ్రాయు మహాభారతమునకు దలచిన భాషా విషయములను లెస్సగా నాలోచించుకొని తనకు మార్గదర్శకముగా సూత్రీకరించుకొన్న గ్రంథమని నా అభిప్రాయము. అందుచేత తొలుతగా దానియందు కావ్యమునుగురించి తన యభిప్రాయమును సూత్రీకరించెను. ఈ సూత్రము లన్నియు నాలోచనామయములు. బహు గంభీరములు. బాగుగా మననము చేసినగాని తెలియునవి గావు. అందుచేతనే యా గ్రంథమున కాయన 'చింతామణి' యని పేరు పెట్టినాడనుకొందును.

ఈ గ్రంథమునందలి ప్రథమకారిక నన్నయభట్టు కావ్యసిద్ధాంతమునుగురించి చెప్పుచున్నది. ఈ కారికను మనము లెస్సగా నాలోచించినచో మన కనేక విచిత్ర విషయములు స్ఫురించును.

1. విశ్వశ్రేయః కావ్యమ్ 2. తదదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ 3. సా వా గ్రాహ్య రసవృత్తిః. (4) సాధ్యో హి రసో యథారీతిం కవిభిః. 1. కావ్యము విశ్వమునకు శ్రేయస్సు కలిగించును. 2. దోషరహితములు పరిష్కృతములు నగు వాగర్థములు కావ్యము. 3. రసవృత్తియైనది వాక్కు. 4. రసమున్నది యున్నట్లుగా కవులచేత సాధింపదగినదిగదా. ఈ కారిక పైని విభజించినట్లు నాల్గు భాగములు. ఇందు ఒకటి నాలుగు సూత్రములు కావ్య ప్రయోజనమును గురించి చెప్పును. రెండు మూడు సూత్రములు కావ్యలక్షణమునుగురించి చెప్పును. ఇట్లు నన్నయభట్టు మొదట చివర ప్రయోజనములు చెప్పి వాని మధ్య కావ్యలక్షణము నిబంధించినాడు. ఆ ప్రయోజనములను సాధింపవలెనన్న ఆ లక్షణములతో కూడినదై కావ్యముండవలెనని తాత్పర్యము. ఇందుచేత నన్నయభట్టు కావ్యలక్షణము రూపుగొనుటలో నీ ప్రయోజనముల పాత్ర మిక్కుటముగా నున్నది.

రెండు, మూడు సూత్రములు నన్నయభట్టు కావ్యలక్షణ మంటిని. ఈ కావ్యలక్షణముతో జిత్రముగా మమ్మట విశ్వనాథ జగన్నాథ పండితుల కావ్యలక్షణములు సరిపోవుచున్నవి. సరిపోవుటయే గాదు నిజమునకు నన్నయభట్టుయొక్కయే కావ్యలక్షణము ఆ మూడు సిద్ధాంతములయొక్క సమన్వయస్వరూపము.

నన్నయభట్టు లక్షణములోని 'తదదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ' యనునది మమ్మటుని 'తదదోషౌ, శబ్దార్థౌ సగుణా వనలంకృతీ పునః క్వాపి' యనులక్షణముతో సరిపోవుచున్నది. మమ్మటుని సూత్రమునకు నొకానొకచోట నలంకారములు లేకపోయినను ప్రమ

రము గా గుణాలంకార సహితములు దోషరహితములు నగు శబ్దార్థములు కావ్యమని యర్థము. ఈ రెండు సూత్రములందు 'అదోషౌ' యనునది సమము గా నున్నది. 'వాగర్థౌ' యను మాటకు 'శబ్దార్థౌ' యని యర్థము సరిపోవును. 'సగుణా వనలంకృతీ పునః క్వాపి' యనునది 'పరిష్కృతౌ' యనుటలో సంగృహీతమైనది. 'పరిష్కృతౌ' యనగా 'గుణాలంకారయుతౌ' యని సామాన్యముగా వ్యాఖ్యాతలు వ్రాయుసర్థము. కాని నన్నయ్యభట్టు ఇంతకంటెను గంభీరమైన యర్థము నే యుద్దేశించినాడు. అసలీ సూత్ర రచనములోని ప్రౌఢియంతయు నీ 'పరిష్కృతౌ' యనుమాటయందే యున్నది. ఇట్లు నన్నయ్యభట్టు సూత్రమున కర్థము చెప్పుకొన్నచో నిది మమ్మటుని లక్షణముతో సరి పోవుచున్నది.

తర్వాత 'సా వాగ్యా రసవృత్తి'. రసవృత్తియనగా 'రసం ప్రతి వ్యాపారోయస్యాః సా రసవృత్తిః' రసమును చెప్పు వ్యాపారముగలనే వాక్కు. ఇది విశ్వనాథుని కావ్యలక్షణముతో సరిపోవుచున్నది. 'వాక్యం రసాత్మకం కావ్య'మని విశ్వనాథుని లక్షణము. రసమాత్మగా కలిగిన వాక్యము కావ్యమని యర్థము. శబ్దార్థములు కావ్యమునకు శరీరము. ఆత్మ రసము. ఆ యాత్మ యున్నప్పుడే ఆ కావ్యమునందు కావ్యత్వముండును అని. గుణములు రసధర్మములగుటచేతను అలంకారములు శబ్దార్థ ధర్మములైనను జీవచ్ఛరీరమునకే యలంకరణము శోభాహేతువగుటచేతను రసవంతములగు శబ్దార్థములకే గుణాలంకారయుక్తి కుదురును. ఇందుచేత రసము కావ్యమునందు ప్రాణభూతమై తక్కిన యంశముల నన్నిటిని సంయోగ పఱచుచున్నది గాబట్టి రసమే కావ్యమునందలి యసాధారణ ధర్మమని చెప్పవలెను. లక్షణమనగా, యసాధారణ ధర్మ వచనము. ఇందు చేత 'వాక్యం రసాత్మకం కావ్య'మను లక్షణమే పరిపూర్ణమైనది. ఈ కారణమువలననే విశ్వనాథుడు మమ్మటుని లక్షణము ఖండించెను. కాని నన్నయ్యభట్టు సూత్రమునందు మమ్మట విశ్వనాథుల లక్షణములు సమన్వయ పడినవి.

తరువాత వచ్చిన గొప్ప యాలంకారికుడు జగన్నాథ పండితరాజు. అతడు మమ్మట విశ్వనాథుల లక్షణముల రెంటిని ఖండించినాడు. దోషములున్నప్పటికిని కావ్యములందు రసము ప్రతీయమానముచు నే యున్నది. అలంకారములు లేనప్పటికిని రసము బాధిత మగుటలేదు. అస లేవాక్యమునం దలంకారమున్నదో లేదో సరిగా నిర్ధరించుటకు వీలులేదు. అట్టి సందర్భమున అలంకారము లుండవలెనను నియమమెట్లు కుదురును. గుణములు రసధర్మములు గాన వానిని గురించి వేరుగా చెప్పనక్కరలేదు. మరి శబ్దార్థములు రెండును కావ్యమనుట పొసగదు. కావ్యము చదువుచుంటిని, వినుచుంటిని అను వ్యవహారము శబ్దమునకే కుదురును గాని యర్థమునకు కుదురదు. అందుచేత శబ్దమే కావ్యమని చెప్పవలెను. శబ్దమునకే లక్షణము చేయవలెను. ఈ విధమైన దోషము లనేకములు మమ్మటుని కావ్యలక్షణమునకు పట్టుచున్నవి.

మరి 'రసమున్నదే కావ్యమనుటకు వీలులేదు'. అప్పుడు కొన్ని కావ్యములకు కావ్యత్వము లేక పోవలసి వచ్చును. మహాకవులు కూడ రసతాత్పర్యములు లేని కావ్యములు కొన్ని వ్రాసిరి. వర్ణనాత్మక కావ్యములకు వస్తుప్రధాన కావ్యములకు లోకమున కావ్యత్వ వ్యవహారమున్నది. విశ్వనాథుని లక్షణము వీనియం దవ్యాప్తమగుచున్నది కావున నది సంకుచితము. ఎట్లో పరంపరయా వానియందు కూడ రససద్భావమును సాధింతమన్న సామాన్య లౌకిక వాక్యములందు కూడ వేతావ్యశరసస్పర్శ సాధింపవచ్చును. అప్పుడు పై లక్షణమున కతివ్యాప్తి సంభవించును.

ఇందుచేత జగన్నాథపండితులు 'రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యమని' లక్షణమొనరించెను.

'పరిష్కృతౌ'యనుటలో జగన్నాథుని యీ కావ్య లక్షణము కూడ సంగృహీతమైనది. 'పరిష్కృతౌ' యనగా లెస్సగా చేయబడినది యని యర్థము, అనగా 'రమణీయౌ' యని యర్థము చెప్పవచ్చును. ఈ యర్థమును వివరించునదే భారతమునందలి 'సారమతిం గవీంద్రు' లను పద్యము.

సారమతింగవీంద్రులు ప్రసన్న కథా
కవితార్థయుక్తి లో
నారసి మేలునా నితరు లక్షర
రమ్యత నాదరింప నా
నారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు
తెనుంగున న్మహా
భారత సంహితా రచన బంధురు
డయ్యె జగద్ధితంబుగన్.

ఈ పద్యమునందలి 'ప్రసన్నకథాకవితార్థయుక్తి' 'అక్షర రమ్యత'నను రెండు విషయములు నున్నవి. ఇం దొకటి యర్థపరిష్కృతి, రెండవది శబ్ద పరిష్కృతి. నన్నయ్యభట్టు రమ్యమైన శబ్దములలో కథ చెప్పుకొని పోవుచుండును. ఆ కథాంతర్గతమై బహ్వర్థసంయోజన ముండును. నన్నయ్యభట్టు కథా కథనమున కడు వేగరి. పాఠకుడు దాని వేగమును నిలువ

రించుకొని పరీక్షించవలెను. అప్పు డాతనికి కథాంతర్నిగూఢములైన బహ్వర్థములు భాసించును. ఆయన యర్థ సంయోజనా చాతుర్య మట్టిది. ఈ యర్థములను గ్రహించుటకు లోనారయవలెను. లోతుగా చూడవలయును. దీనికి సారమతి గావలయును. సారమతి యనగా బహ్వర్థ పరిజ్ఞాతృత. తత్సంయోజనచాతుర్యాను శీలన దక్షత. కావున నట్టి సారమతి కవీంద్రులకే యుండును. అనగా కవిసహృదయుల కన్నమాట. ఇందుచేత నీ యర్థములు శబ్దముయొక్క యభిధాశక్తి చేత చెప్పబడునని మాత్రమే కాక యనంతమైన వ్యంజనాశక్తి గమ్యములగు ననికూడ చెప్పనగునది. అభిధాబోధ్యములైన యర్థముల నెరుంగుటకు సారమతి యుండనక్కరలేదు గదా. మఱి కవీంద్రు డీయర్థములను చూచి, వాని సంయోజన చాతుర్యము చూచి 'మేలు' అందురట. అనగా వాని సౌందర్యమునకు మెచ్చుకొందురన్నమాట. ఇట్లు పైనిజెప్పిన యర్థములయొక్క రమణీయత కవీంద్రులెఱుంగునది. మఱి శబ్దగతరమణీయత యట్టిది గాదు. అది సర్వజన వేద్యమైనది. అది శబ్దగతాక్షరగతమైనది. ఆ యక్షరముల ధ్వని నాశ్రయించినది. దానిని గ్రహించు నేర్పు శ్రవణేంద్రియగతమై యుండును.

ఇదియే యర్థము నానారుచిరార్థసూక్తియని నన్నయ్యభట్టు స్పష్టము చేసినాడు. నానా రుచిరార్థ సూక్తి యనునది నన్నయ్యభట్టు కావ్యలక్షణముగా మనము స్వీకరించవచ్చును. సూక్తి యనగా పరిష్కృతమైన వాక్కు. రుచిరార్థమనగా పరిష్కృతమైన యర్థము.

ఈ రుచిరార్థసూక్తి జగన్నాథపండితుని రమణీయార్థప్రతిపాదక శబ్దముతో నెంత సన్నిహితముగా నున్నదో చూడుడు. రుచిరార్థమనగా రమణీయార్థమని యర్థముగదా! ప్రతిపాదకత్వమనునది శబ్దార్థములకు గల సంబంధము. రుచిరార్థసూక్తియనగా రమణీయార్థ ప్రతిపాదక సుశబ్దము. ఈ ప్రతిపాదకత్వ మొకచోట వాచకత్వముగా వచ్చును. ఒకచోట వ్యంజకత్వముగా వచ్చును. ఒక చోట రెండునూగా వచ్చును. బహ్వర్థములు భాసించునప్పుడు శబ్ద మొక యర్థమునకు వాచకమై, తక్కినవానికి వ్యంజకమగుచుండుట పరిచితమే. ఇందుచేత 'పరిష్కృతి' యనగా 'రమణీయత' యని యర్థము చెప్పవచ్చును. ఈ 'పరిష్కృతా' యనుమాటకు గుణాలంకారయుతా, యని యర్థము చెప్పవచ్చును. 'రమణీయా' యని చెప్పవచ్చును. ఇంకనూ అనేకములగు లోతైన యర్థములు చెప్పవచ్చును. ఏ యొక్క అర్థముతో నాగవలసిన పనిలేదు. ఆ మాటయొక్క యర్థ మెంత విస్తృతమైన దనగా, కావ్యమునందలి బహుళార్థ సంయోజనము రచనా సంఘటనలు మొదలైన శబ్దార్థ విషయకమైన యనంతములగు శిల్పములను గురించిన పాఠకుని జ్ఞానమెంత విస్తృతముగా నుండవచ్చునో యంత విస్తృతమైనది. ఇట్లు పాఠకుని జ్ఞానమును బట్టి గ్రహణమును బట్టి ఈ మాటయొక్క యర్థము పెరుగుచుండును. ఈ యొక్క పరిష్కృతా యను మాటను వాడుటవలన పైన చెప్పిన మూడు కావ్యలక్షణములు. నన్నయభట్టు కావ్యలక్షణమునందు సమన్వయము పొందినవి.

ఈ 'పరిష్కృతా' యను మాట కింత విస్తృతార్థ ముండుటవలన పైని జెప్పిన ముమ్మట విశ్వనాథుల లక్షణములకు బట్టుచున్న దోషములు పరాస్తములగుచున్నవి. నన్నయభట్టు సూత్రమునకు నర్థ మిట్లు గ్రహింపవచ్చును. 'యత్ర రసవృత్తి ర్వాక్, తదర్థశ్చ దోషరహితా రమణీయా శిల్పమయా వా భవతి తత్కావ్యం.' ఎచ్చట రసతత్పరమైన వాక్కును దాని యర్థమును దోషరహితములై, రమణీయములై లేక శిల్పమయములై యుండునో యది కావ్యము.

ఈ లక్షణమునం 'నదోషౌ' యనుట దోషము కాదు. దోషరహితత్వము రసభంజకము గాకపోయినప్పటికిని విశ్వశ్రేయస్సును భజించును. విశ్వశ్రేయస్సును కావ్యప్రయోజనములందు మొదటగా చెప్పినాడు నన్నయభట్టు. 'విశ్వశ్రేయః కావ్యమ్' అని 'చింతామణి' సూత్రమునందును, జగద్ధితంబుగన్' అని భారతపద్యమునందును కావ్యప్రయోజనము నిర్దేశించినాడు. "రుచిరార్థసూక్తి" యను మాటలోని 'సు'ఉపసర్గ యీ దోషరహితత్వము నే జెప్పుచున్నది. అందుచేత నన్నయభట్టు లక్షణము సత్కావ్యలక్షణముగా స్వీకరించవలెను. కావ్యము విశ్వశ్రేయః ప్రయోజకము గావలయునన్నచో నది రుచిరార్థసూక్తిగా నుండవలయును. విశ్వశ్రేయస్సు ప్రయోజనములుగా లేని కావ్యములు రుచిరార్థోక్తులుగా నుండవచ్చును, దోషసహితములుగా నుండవచ్చును. ఈ విశ్వశ్రేయః అను ప్రయోజన నిర్దేశమువలన పై దోషము నన్నయ్య సత్కావ్య లక్షణమునకు బట్టదు. మఱి శబ్దమునకుమాత్రమే లక్షణము చెప్పవలెననుటలో నెక్కువ సామంజస్యము లేదు. లోకమునందు కావ్యము చదువుచుంటిమి, వినుచుంటిమియని మాత్రమేగాక, విచారించుచుంటిమి,

భావించుచుంటిమి, ఆస్వాదించుచుంటిమి యన్న ప్రయోగములుగూడ నున్నవి. ఈ ప్రయోగములు కావ్యార్థవిషయమున నే ప్రాసగును. అందుచేత అర్థమునకే లక్షణము చెప్పవలెననుట యుచితముకాదుగదా. అందుచేత కావ్యము శబ్దరూపము గాదు, అర్థరూపము గాదు, ఉక్తిరూపము. "ఉక్తి" యనగా శబ్దార్థముల యొక్క సమాహారమని యర్థము చేసికొనవలెను. లోకములో 'అర్థము చెప్పుచున్నా'రను ప్రయోగము వంటిదె 'కావ్యము జరుపుచున్నా'రనునది'. అదిగాక రెంటికి సమతౌల్యమును నిర్దేశించుటకై శబ్దార్థములకు లక్షణము చెప్పినను చెప్పవచ్చును.

మఱి రసవృత్తియనునది వాక్యమనుమాట యున్నది. ఇది లక్షణపతితమైన వాక్యమనుమాటకు కావ్యవిషయమునమాత్రమే యనుగతమగునట్లొక యర్థమును నిరూపించినది. రసవృత్తిగాని వాక్యమునకు కావ్యమునందు ప్రవేశము నిరోధించుచున్నది. రసతత్పరము కాని కావ్యము ఉన్నను శోభలేదు. ఆ కావ్యములు వ్రాసిన కవులకైనను రసము సాధ్యమనుటలో విప్రతిపత్తి లేదు. మఱి కావ్యమునందు రసము ప్రధానముగా నుండకపోవచ్చును. కాని అన్యమైన కవివాక్కు రసస్పర్శ లేకుండ నుండలేదు. వర్ణనాదులు ప్రధానమైన చోట రసభావము లంగములుగా నుండుట తప్పదు. అందుచేత రసవ్యాపారము కవివాక్కులకు సిద్ధించుచున్నది. వాక్కట్టిదిగానున్నచో కావ్యత్వమునకు హాని లేదు. అదియునుగాక సత్కావ్యమునకు రసము ప్రధానప్రయోజనముగా నుండి తీరవలయును.

'కావ్యనే నన్నయ సాధ్యోహిరసో యథా తథం కవిభిః' అని చెప్పినాడు. 'హి' యనుటవలన యీవిషయమున నెవరికిని విప్రతిపత్తి లేదన్నమాట. రసశబ్దమునకు పరమాత్మయనియు కావ్యానందమనియు నర్థములు. కవిశబ్దమునకు జ్ఞానియనియు కవియనియు నర్థములు. జ్ఞానియైనవాడు పరమాత్మసాక్షాత్కారము సాధించునట్లు కవి రసానందము సాధింపవలెను. ఏకశబ్ద వ్యవహృతివలన జ్ఞాని కవులకు వాత్మానంద రసానందములకు నభేదము గమ్యమగుచున్నది. ఇందుచేత రసస్వరూపము స్వాత్మానందమని చెప్పవల్లయినది. ఈ యర్థమున కంతయు యథాతథమను మాట పనికివచ్చును. యథాతథమనగా నున్నదియున్నయట్లు. అనగా సత్యమైన స్వరూపములో నున్నమాట. రసమునకు సత్యమైన స్వరూపము శాంతము. శాంతమనగ నాత్మానందము. ఆత్మయొక్క స్వరూపావగతి. అన్యమైన రసము శాంతము. శృంగార, హాస్యాదులు దాని యందలి విశేషములు. రసశబ్దమునకు శాంతమనియే యర్థము. భారతమునందంగిరసము శాంతము. ఇదియే సత్కావ్యమునకు పరమప్రయోజనమని నన్నయభట్టు నిష్కర్ష.

ఇట్లు నన్నయభట్టు సత్కావ్యలక్షణమునందు మమ్మట, విశ్వనాథ, జగన్నాథుల కావ్యలక్షణములు సమన్వయరూపములో మనకు గోచరించుచున్నవి. మమ్మటులు, నన్నయభట్టునకు సమకాలికుడో, తర్వాతివాడో కావచ్చును. సమకాలికుడైనను నతడు కాశ్మీరవాసి. అప్పటినుండి యతని సిద్ధాంతము వేగి దేశమునకు వచ్చియుండుట సంభవింపదు. మఱి విశ్వనాథ, జగన్నాథులు నన్నయభట్టునకు చాల కాలమునకు తర్వాతివారు. తన తర్వాతనైదారువందల సంవత్సరములకు వచ్చు కావ్యసిద్ధాంతమును నన్నయభట్టు ముందుగనే యూహింపగలిగినాడు. ఇది యూహయన యూహకూడ కాకపోవచ్చును. ఆ కాలమున వేగి దేశమునందు బహుపండిత పరిషత్తులు నున్నవి. 'పరమవివేకసారధి' మొదలైన భారతపద్యములు వానిని గూర్చి మనకు చెప్పుచున్నవి. నన్నయభట్టు తన యాశ్వాసాంతములందు 'సభల రమ్యముగా,' 'సభల రమణీయంబుగా' నని చెప్పుకొన్నాడు. ఈ వేగి దేశపు సభలలో ననేక కావ్యసిద్ధాంతములు చర్చింపబడుచు నుండియుండవచ్చును. 'రమణీయత' యనునది వేగి దేశపు సభలయొక్క కవితా సిద్ధాంతములందలి ముఖ్య విషయము గావచ్చును. చిత్రమేమన 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్య'మని లక్షణము చేసిన జగన్నాథ పండితులు వేగి దేశపువాడు. ఆ వేగిదేశ సభల చర్చాసారాంశములను సమన్వయపఱచి తానురచించు మహాభారతమునకు మార్గదర్శకముగా నన్నయభట్టు తన సత్కావ్య సిద్ధాంత నిర్మాణ మొనర్చుకొని యుండును నన్నచో నసమంజసము గాదు.

# నిలువుమో ఉషాయోష!

శ్రీ తెన్నేటి విశ్వనాథం

ఉదయమునకు పూర్వము వచ్చు మొదటి
గగనసాగరముల మధ్యగ నొక గీత [వెలుగు
గీచె, తమసుపైగల వెల్గుగీతవలెను,
తూర్పు గగనంబు హొలుపులు పర్చుచుంగ.

స్థలం :
చెన్ననగర సాగరతీర మన్నివిధము
లాదినంబున నతిసుందరంబుగా ప్ర
శాంతముగ దోచె మనసున శాంతిగొలుప
మెల్లగా చల్లగా వీచె పిల్లగాలి.

పరిసరం :
ఒక్కమూల చేపల నావయొక్కటి చల
నంబు లేనట్లు సాగరమందు నుండె,
ఉరముపై చంటిపిల్లను ఊరడించి
నిద్రవోయినట్లుండె సముద్రజనని.

ప్రాంతం :
పింఛనీదార్లు నల్గురు లాంఛనంబు
కై నడచుచుండి రొకవైపు; కనులుమూసి
యొకరు యిసుకపై కూర్చొని రొక్కవైపు
జనులు వేరువేరు; వరలె సమయశాంతి.

ప్రమాదం :
అంత ఆ ప్రశాంత దిగంతమందునుండి
నగము స్నానముచేసిన శ్యామయొకతె
వన్నని తడిబట్ట యొడల జారుచుండ
పశ్చిమాభిముఖమ్ముగ పరువులెత్తె.

అందం :
బ్రహ్మలు పదివేవురుగూడి పడతి యంగ
మును చేసిరేమోగాని మూడులోక
ములను లేదట్టి సర్వాంగ మోహనాంగి
ఎట్టి యాపద జెందెనో ఇప్పుడామె.

కరములంజాచి కొనలతో కాంతచీర
కొంగు పట్టంగ యత్నించు కోడెకాడు
లేమ వెన్వెంట నుండెను, ఆమెవాని
కందకే పరువెత్తుచునుండె ముందుగాను.

ధ్యానం :
మనము పట్టియున్నట్టి తమంబుపోయె
నిన్ను జూచిన వెంటనే నిర్మలాంగి
గగన మంత నీరూపమే కాంతు నిపుడు
పృథివియంత నీ మూర్తియే పెరిగె నిపుడు.

అజ్ఞానం :
పండిత పురుషపాలనా ఫలితమే మొ
పగలు మొదలిడకే యిట్టి తగవులేని
పనులుజరిగిన సంసార భామలెట్లు
తిరుగ గలరు యీ సాగర తీరమందు.

అవశం :
అందరామె యందంబునే ఆశించి
మైమరచిరిగాని తగులు మాయకాని
ఆపువారొకరును లేక ఆమె మొదటి
తీరునే సాగిసాగి యదృశ్యయయ్యె.

నుడికారం :
అంత పెరిగి విరుగు కెరటాల తెలుపు
నురగలంట వినబడెను నుడులు కొన్ని
వర్ణ శబ్ద మధురిమతో, నర్ణవంబు
సూర్యకిరణ రజతకాంతి శుభ్రపడగ.

సత్యం :
"నిలు నిలువుమో యుషాయోష, నీదువెంట
కోటియుగములై యుంటిని, గురుతులేద
సూర్యుడను నేను, జగతిః ప్రసూతి కరుడ,
నిలచి తనివార తనువులో కలియగదవె!"

# యెంకిపాటల శిల్పవైఖరి

శ్రీ పి. గణపతిశాస్త్రి

'ఏటి కడుపున దాగి
తోట నిదరోయింది
'అలనా' నా పాదకు
'పాలనా' యనుకొంటి!
కొమ్మలో కోయిలా 'కో'యంటదే!
రాగ తనమో యేమో బాగ వోగెరుగదే!
తరిమి తరిమేశాను
తిరిగి కో! కో! యంది
ఆడించె ఆట గాపాడించె పాటగా!

ఒకనాటి సాయంత్రం కొంచెం పరధ్యానంగా ఉన్న సమయంలో నాకీ పాట వినబడింది. ఏటి కడుపున నిద్రపోయిన తోట, తరిమి వేసినా తిరిగి 'కో! కో!' అన్న కోయిల పాట మొదలైనవెన్నెన్నో మనో వీధిలో ప్రత్యక్షమై మనోజ్ఞంగా ప్రతిధ్వనించాయి. కోయిలపాటలో కొత్త దనమేమీ లేదు! ఆది కవి మొదలుకొని ఆధునిక కవి దాకా అందరు పికగీత మాధుర్యం విరహోద్దీపకంగా పేర్కొన్నారు. అయినా ఒక్కొక్క కవి వాణిలో బాగా పాతపడి పోయిన విషయమయినా ఒక అనిర్వాచ్యమయిన వైచిత్రితో సౌందర్యంతో సాక్షాత్కరిస్తుంది. అగరు ధూమమాలికలా అంతరాంతరంలో విలీనమై మైకం కలిగిస్తుంది. సాహితీ విమర్శన మార్గాలనేకం అవలంబించి ఆ అనుభూతి వివేచన కోసం మన మెన్నెన్నో విధాల ప్రయత్నిస్తాము. అయినా ఒక్కొక్కప్పుడీ అనుభూతి విస్పష్టంగా ఊహ కందక దూరదూరంగా నిలిచి పోయినట్లే భాసిస్తుంది.

## గాలి దుమారం

యెంకిపాటలలో మొదటి రచన ప్రారంభమై దరిదాపుగా నలభై సంవత్సరాలు గడిచిపోయాయి. ఆనాడీ పాటలపై అంతకుపూర్వం ఎన్నడు కనివిని ఎరగనంత గాలిదుమారం చెలరేగింది! బసవరాజు అప్పారావువంటి ఆనాటికే ఆధునికకవి 'నీవు నిత్యమువాడే భాష కాదిది; ఈభాష సాయమున సత్యాన్వేషణం చేయలేవ'ని తమతో అన్నారనీ, అటుపిమ్మట క్రమంగా ఆయన ఆ అభిప్రాయం మార్చుకొన్నారనీ స్వర్గీయులు నండూరి సుబ్బారావుగారే యెంకిపాటల మొదటి ప్రచురణ పీఠికలో పేర్కొన్నారు. గేయ రచనాఫణితిలో బసవరాజు అప్పారావు నండూరి సుబ్బారావు ఇంచుమించుగా ఒకటే పంథా అవలంబించారు. అయినా ఆయనకే ఈ మార్గంలో 'సత్యాన్వేషణ' సాగించడం దుస్సాధ్యమని తోచినప్పుడితరులకీ పాటలెంతో విడ్డూరంగా వినిపించడంలో ఆశ్చర్యం లేదు! స్వర్గీయ శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యవంటివారీ గేయధోరణి విని వేరొక కొంటెపాటతో వెటకారంగా వెక్కిరించారు. ఇక కేవల సాంప్రదాయిక విమర్శకులు కొందరీ గేయాలపై లేనిపోని దోషారోపణలెన్నో చేసి తూర్పార బట్టారు. మరి కొందరీపాటలలో అందీఅందని నిగూఢ తత్త్వాన్వేషణ కొనసాగించారు. ఇంకా కొందరలంకారశాస్త్రదృష్టితో స్వీయాపరకీయా నాయికా మీమాంస ప్రారంభించారు. అయితే ప్రాతస్స్మరణీయులు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి వంటి విద్వద్వరేణ్యులు, దేశోద్ధారకునివంటి సహృదయ సాహిత్యాభిమానులు ఈ రచనలెంతో ఆదరించి అభిమానించారు.

అలంకార శాస్త్రీయ ప్రాథమిక రస సిద్ధాంతంతో వివదించేవారెవరు ఉండరు. ఆదృక్పథం విశాల పరిధి గట్టిది. అయితే ఆ ప్రాచీన శాస్త్రానికి సంబంధించిన కొన్ని తాత్కాలిక సాంఘిక ధర్మదృక్పథాలీనాటి రచనల కంతగా సమన్వయించవు. ఇందుచేత అలంకార శాస్త్రప్రధాన సిద్ధాంతాలీ కాలంనాటి రచనల కనుగుణంగా సముచితమయిన సహృదయ దృక్పథంతో సరిదిద్దుకోవలసి ఉన్నది. ఈ సందర్భంలో ఇంకొక విషయంకూడా జాగ్రత్తగా గమనించాలి. ఎవరయినా ఒక విమర్శకుడు అలంకారశాస్త్రం కూలంకషంగా అభ్యసించి ఉండవచ్చును. కాని ఆ విమర్శకునికి తగినంత రసార్ద్రమయిన అవగాహన లేకపోయిన

మొదల సాహితీపర్యాలోచన తప్పుదారిపట్టే అవకాశాలెక్కువ. ఏతావతా కేవలం అలంకార శాస్త్ర సూత్రాలు కలిపేసి సంతమాత్రాన ప్రయోజనమేమీ లేదని స్పష్టపడింది. యెంకిపాటలలో ప్రాచీనులు కొందరు చేసిన విమర్శన లీదేధోరణిలో సాగిపోయాయి.

ప్రతికొత్త తరంలోను ప్రాచీన సాహితీసృష్టిపై వినూతన దృష్టి ఏర్పడడం సహజం. యెంకిపాటల రచన ప్రారంభమై ఇంచుమించుగా ఒకశతం గడిచిపోయింది. ఆనాటి వాదోపవాద ధూళీ సంరంభం మన కీనాడు కొంచెం వింతగా కనిపిస్తుంది. సమకాలిక సాహిత్యపర్యాలోచనలో కొంత సమ్యగ్దృష్టి లోపించడం సహజమని కూడా అనిపిస్తుంది. ఈనాడీ పాటలలో కొన్ని అధునాతనాంధ్ర సాహితిలో శాశ్వతంగా స్థిరపడిపోయాయి. మరికొన్ని పాటలలో ఆనాడు పేర్కొన్నంత అనౌచిత్యం గాని, గొప్పదనం గాని లేదని కూడా అనిపిస్తుంది.

## జానపద ధోరణి

ఎంకి పాటలు మొత్తంమీద రెండు వర్గాలుగా విభజించుకోవచ్చును. ఈ గేయాల మొదటి ప్రచురణ 1925లో వెలువడింది. ఆ తర్వాత మరికొన్ని కొత్త పాటలు చేర్చి కవి తిరిగి ద్వితీయ ప్రచురణ ప్రకటించారు. ఈ నూతన గేయాలలో ఇతఃపూర్వం రచించిన పాటల దృష్ట్యా కొన్ని కొత్త ధోరణులు తలలెత్తాయి. మొట్టమొదట రచించిన యెంకిపాటలు సాంప్రదాయికమయిన జానపద గేయ ధోరణిలో సాగిపోయాయి. అంటే, కవి మన జానపదగేయ పద్ధతి పూర్తిగా పుణికి పుచ్చుకొన్నారని వేరిక్కడ నిరూపించవసరం లేదు. మొదటి యెంకిపాటల భాషలోను, భావవ్యక్తీకరణంలోను జానపద గేయచ్ఛాయ లక్కడక్కడ చూచాయగా మాత్రమే స్ఫురిస్తున్నాయి. 'సత్తెకాలపు యెంకి' దీని కొక చక్కని తార్కాణం:

"నీతోటె వుంటాను నాయుడు బావా!
నీ మాటె యింటాను నాయుడు బావా!"
"సరుకు లేమి కావాలె సంతన పిల్లా!"
"నువ్వు
మన్సుమిడిసి మనసియ్యి నాయుడు బావా!"
"పక్కదనము కేమిత్తు సంతనపిల్లా"
"నువ్వె సల్లగుండు పద్దాక
నాయుడు బావా"
"యేడనే నీ కాపుర మేగా సెల్తరు పిల్లా!"
"నీ నీడలోనె మేడకడతా నాయుడుబావా!"
"నీ తోటే వుంటాను నాయుడు బావా!"
నీ మాటె యింటాను నాయుడు బావా!"

మన జానపదగేయాలలో యెంకి నాయుడు బావల వంటి నాయికా నాయకులు కొందరు కనిపిస్తారు. "నీ నీడలోనె మేడకడతా నాయుడు బావా!" వంటి జానపదుల ఆర్ద్ర భావాలెన్నెన్నో గోచరిస్తాయి. కాని 'యెల్తురు పిల్లా!' వంటి సంబోధన లా పాటలలో చాలా తక్కువ. ఎంకి నాయుడు బావల మధ్య మనసుపడి నిలుచున్న కవి మనకిక్కడ స్పష్టంగా సాక్షాత్కరిస్తున్నారు! అయితే మొదటి ప్రచురణ పాటలలో అంతటా కవి చిత్రించిన యెంకినాయుడు బావల సరళ ప్రణయ స్వరూపం అధునాతనాంధ్ర కవిత కొక అపూర్వ లావణ్య రాశి చేకూర్చింది. అన్నెము, పున్నెము ఎరగని అమాయికులయిన ఆ జంట భద్రాద్రి ప్రయాణము, తిరుపతి యాత్ర, యెంకి ముచ్చటలు, ఆ మెరవలపు, ఏనాటికైనా తెలుగుజాతి నిండుగుండెలో నిలిచిపోవాలిన కమనీయ చిత్రణాలు.

"నన్నిడిసిపెట్టెల్లినాడే నారాజు
మొన్న తిరిగొస్తనన్నాడే!
నీలు తేబోతుంటె
నీతోడె ఓలమ్మ
నావెంట యెవరోను
నడిసినట్టుంటాది!
అద్దములో సూత్తుంటె
అది యేటో సిగ్గమ్మ
నావెనక యెవురోను
నవ్వినట్టుంటాది!
నన్నిడిసి పెట్టెల్లి నాడే!"

ఈ విధమయిన సుకుమారమయిన అనురాగ భావ మణి చిత్రణతో నండూరికవి నేటికాలపు ప్రేమకవిత కొక అమూల్యరత్నహారం సంతరించారు.

## ప్రకృతి చిత్రణం

'యెంకి' సోయగం అభివర్ణిస్తూ కవి ఒకచోట ఇలా అన్నారు:

'సూపుతో మాటాడి
వూపిరితో తెనిగించు;

కను బొమ్మతో నవ్వి
మనసు కరిగించు!'

ఈ ప్రేమభావ వ్యక్తీకరణలో నేమి, ప్రకృతి సౌందర్య చిత్రణలో నేమి ఈ కవి చూపుతో మాటాడి ఊపిరితో తెనిగించగలంతటి దిట్ట!

'అంపల్లె, బొమ్మల్లె
అందాల బరిగల్లె
సుక్కల్లె నా యెంకి సురిగిపోయిందంట!'
'కన్నమంటా యేగు
గాలి కెగబోసింది.'
'ఆకాశ మాపోరస
అవులింపినకేయి.'
'యేటికసుపునదాగి
తోట నిదరోయింది.'
'ఎంకి పూగెను కొమ్మవుయ్యాల! చంద్ర
వంకపూగెను బొమ్మ ఉయ్యాల!
ఏటిపై కొమ్మనూ
యెలయెంకి అనురించె
నీట బొమ్మ ఉయ్యాల
నెలవంక వలయించె'
'యెలుతురంతా మేసి
యేగు నెమరేసింది'

పై ఉదాహరణలో 'యెలుతురంతా మేసి యేగు నెమరేసింది' అన్న ఈ పంక్తి చూచిన తరవాత మనలో లోపలి మనస్సులో మహేంద్రజాల మేదో జరిగినంతటి విచిత్రానుభూతి సాక్షాత్కరిస్తుంది! ఇటువంటి సున్నితమైన ప్రకృతి సౌందర్యచిత్రణం వీరిపాటలలో చాలాచోట్ల ఒక మెరుపులా మెరిసిపోతుంది! 'యెంకి పయనం'లో కవి ఎంతో సహజంగా స్ఫురింపజేసిన ప్రకృతిరూపచిత్రణ మన హృదయంలో ఎన్నటికి వన్నెతరగని విచిత్రానుభూతిలా నిలిచిపోతుంది!

'పడుకుంటె నాకెటో భ్రమ పుట్టినాదీ!
కడుపులో సెయ్యేసి కలిపేసినాదీ!
ఎడతెగని జలమంట!
నడమ నో పడవంట!
పడవెక్కి నాయెంకి
పయనమయ్యిందంట!
నీటిగాలికి యెంకి
పైటెగురు తాదంట!
పడిపోయినట్లైనో! పడ వెల్లినాదంట.

## కొత్తపాటలు: తాత్త్వికచింతన

కొత్తపాటలలో కొన్నిటిలో ఎంకి నాయుడు బావల జానపద స్వరూపాలు బాగా మరుగున పడి పోతాయి. ఈ కొత్తపాటల రచనలో కవిలో కొంత 'తాత్త్వికచింతన' బయలుదేరి క్రమక్రమంగా దృఢపడింది:

"పూవు నేనైతె నీవలపు నేనాదు!
పూని నన్నె జగమంత ధ్యానింపజేతు!
నేను కోయిలనైతె నీరాగమాదు!
దిశలహో నిన్నె కీర్తింపగా జేతు!
రాయి నేనైతె నీ ప్రాణమ్మునాదు!
ముజ్జగము రా నిన్నె మొక్కగా జేతు!
నీవు నేనైతె నిను నీలోనె కందు!
నేను నేనుగనుంటె నీలోనె యుందు!!'

ఈపాట చదివేసరికి మనకు కవిలోని కవిత్వశక్తి క్రమక్రమంగా సన్నగిల్లినదని అనిపిస్తుంది. మొదటి పాటలలో 'యెంకినాయుడుబావలు'గా విస్పష్టంగా నిలిచినవ్యక్తులిద్దరు ఈపాటలో కేవలం వ్యక్తులై "నీవునేనులు"గా మారిపోయారు. పైగా ఇవి జానపదుల హృదయాలలో రేకెత్తే భావాలు కావు. నిజానికి కొత్తపాటలలో చాలా చోట్ల కవి కవిగా మాత్రమే మన ఎదట నిలబడుతున్నారు. యెంకి చాలాచోట్ల కేవలం ఊహాసుందరిగానే గోచరిస్తుంది. ఇంకొకచోట కవి తానీశ్వరుడయినట్లే భావిస్తున్నాడు:

'ఈ సందె కీయంద మెవ్వరిడిరోయీ!'
'ఆకాశమున విల్లు! అంకాన యెంకి'
'రేయి ముచ్చటల కెలరేగి రెవరోయీ!
'నెలవంక దరిముక్క చిలిపి నా పక్క!'
'పగలు రే లెడబా టెరుగక గెవ్వరోయీ!'
'శంకరుని సతి అచట ఇంకెవ్వరిచట!'

'తాత్త్విక చింతన' బాగా ప్రబలిన ఈ గీతంలో మనకు మొట్టమొదటి పాటలలోని 'వెచ్చదనం'గాని వైచిత్రిగాని గోచరించదు. కవి శక్తివంతులు కనక కొంత మర్యాదగా బయటపడ్డారని మాత్రమే అనుకుంటాము. ఈ సందర్భంలో అభిజ్ఞానశాకుంతలంలో దుష్యంతునిసూక్తి స్ఫురణకు వస్తున్నది. 'వయం తత్త్వాన్వేషాన్మధుకర హతాః. త్వంఖలుకృతీ!' దుష్యంతుడిది శకుంతల సమక్షంలో తుమ్మెద నుద్దేశించి అన్నమాట. 'మధుకరా! నీవ నేక విధాలుగా శకుంతలానుభూతి మారగొన్నావు! తత్త్వాన్వేషణలోపడిన మా కీఫలితం దక్కలేదు!' అని దీని తాత్పర్యము. కేవలం ఆదర్శాన్వేషణలో పడిన ప్రేమకవితలో ప్రగాఢమయిన శృంగారానుభూతి కుష్కించిపోతుంది. అసలీ శృంగారానికి తత్త్వాన్వేషణకు బాగా చుక్కెదురు! ఈ ధోరణిలో కవి రచించిన పాటలన్నిటిలోను మనకంతగా 'వెచ్చదనం' స్ఫురించదు! కవి రచనాశక్తి మాత్రమే కొంతవరకు మాట దక్కించినదని అనిపిస్తుంది. ఈ ధోరణి గేయాలలో ఈ పాట కొంత ఎన్నదగిన రచన!

'కోటి గొంతులు కలిసి
పాటపాడే తీరు
వెలుగు నీడల నడుమ
నిలిచి ఆలింతు
ఏటి మిలమిలలోన
తోట నవనవలోన
వెలుగు నీడల పొత్తు
తెలిసి పాలింతు
ఎంకెవ్వరని లోక
మెపుడైన కలిపితే
వెలుగు నీడల వైపు
వేలు చూపింతు!'

అయితే ఈ కొత్త పాటలన్నీ ఇలాంటివి కావు! మొత్తంమీద ఎంకి పాటలన్నిటిలోను గొప్పవనదగిన ఏడెనిమిది ఉత్తమ గేయాలీ విభాగంలో నే కనిపిస్తాయి.

ఇది ఇటువంటి ఉత్తమ సరణిలో సాగిన రచన :

కొండ తిరిగీ కోన తిరిగీ
చీర చెరగున కూరిచితిరా!
గరికపూలా కంఠమాలా!
ఆవునడిగీ అడివి నడిచీ
పూలగిన్నెల పొంగుపరచిన
గుమ్మపాలు కొమ్ముతేనే!
చాయ వెన్నెలా
లోయ బయలా
పచ్చిక మెత్తల పానుపుపైన
'కో కో' యంగుకో యావరా!

కాని ఈ పాటలలో ఎంకి నాయుడు బావల జానపదస్వరూపం ఛాయా మాత్రంగానే భాసిస్తుంది. తెరమరుగులో స్వచ్ఛము సంపూర్ణము పరిణతము అయిన కవి ప్రేమకవిత మాత్రమే కనిపిస్తుంది. ఇందువల్లనే జానపద వ్యావహారిక భాష స్థానంలో క్రమక్రమంగా గ్రాంథిక భాష ప్రవేశిస్తుంది. 'గుండె గొంతుకలోన కొట్లాడుతాది' అని ప్రారంభమైన యెంకిపాట చిట్టచివరికి కేవలం గ్రాంథిక ధోరణిలో ముగిసిపోతుంది.

'సాగరుని సల్లాపమేలా!
చందురుని యుల్లాసమేలా!
సైకతంపు విలాసమేలా!
లోక మిక నేలా!'

ఈ పాట చదివినప్పుడు మొదటి పాటలలోని అకృత్రిమ సౌందర్యమే మనకెంతో వింతగా స్ఫురిస్తుంది. యెంకి నాయుడుబావల సరళ జానపదానురాగమే ఎంతో హృదయంగమంగా ఉన్నదని అనిపిస్తుంది.

నండూరి కవి ఒక్క యెంకిపాటలేగాని వేరే రచనలేవీ సంతరించుకోలేదు. వీరి ఛందోమార్గంలో చెప్పుకోదగినంత వైవిధ్యం కనిపించదు. గేయాల కవసరమైన పదాల విరుపులూ సాగింపులూ లేకపోతే కొన్ని పాటలు కొంచెం కుంటినట్లు వినిపిస్తాయి. కేవలం ఛందోదృష్టితో పరిశీలిస్తే కొన్ని పాదా లసంపూర్ణంగా ధ్వనిస్తాయి. సంగీతంతో మేళవించినప్పుడే ఈ పాటలకొక విధమైన సంపూర్ణత్వం సిద్ధిస్తున్నది. గేయ సంపుటి కిది కొంతవరకు సహజమే! గొంతు ముడి విప్పి నండూరి సుబ్బారావుగారీ పాటలు పాడుతున్నప్పుడు విన్నవారా మధురానుభూతిని ఎన్నటికీ మరిచిపోలేరు!

ఒక్క గీతికతోనయినా ఒక జాతిగొంతులో శాశ్వతంగా నిలిచిపోగల కవితాశక్తిగలవారు చాలా అరుదుగా కనిపిస్తారు. నండూరి కవితలో అంతగా వైవిధ్యం లేకపోవచ్చును. గేయాల ఉదాత్తస్థాయి కొత్త పాటలలో కొన్నిచోట్ల కొంత మందగించినట్లు స్ఫురించవచ్చును. అయితే మొత్తంమీద తమపాటల పేటికతో ఈ కవి అధునాతనాంధ్ర సారస్వతంలో అజరామరులయినారు.

కొందరు కవుల కడుగడుగునా అదర మెదురవుతుంది. అటువంటివారి ఆత్మప్రత్యయం క్రమక్రమంగా బాగా బలపడుతుంది. అయితే నండూరి కవికి మొట్టమొదట కొంత బలీయమయిన ప్రతివిమర్శ ఎదురయింది. అయినా ఈ కవిలో ఆత్మవిశ్వాస మెన్నడూ సడలలేదు. ఎంకిపాటలలో కవి చాలాచోట్ల సున్నితమయిన వ్యంగ్యధోరణితో తమ గేయ ప్రాశస్త్యం ధ్వనించారు. ఈ ధ్వనిలో అత్యుక్తిపూరితమయిన అహంభావం గాని ఆవేశోన్మాదం గాని స్ఫురించవు. కవికి సహజమయిన గాంభీర్యం మాత్రమే గోచరిస్తుంది. ఈ క్రింది పాటలో కవినోట వెలువడిన భవిష్యద్వాణి అక్షరాలా యథార్థమని కాలమే రుజువుపరిచింది.

'సాటేలా! నీకు మాటేలా!
సిన్నతన మేలా! సిగ్గేలా!
ఆ సీమ ఈ సీమ అందచందాలు
తిన్నంగ నినుసూసి దిద్దుకొంటారు!
ముందు మన పాపణ్ణి
కింద దిగనీరు
ఎంకికోవంటారు!
ఎత్తుకొంటారు!
గొంకొక్క దేవతై
యేలిసె నంటారు!
ఇంటింట పెడతారు!
ఎంకి నీపేరు!

ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక

# సాహితీ సుగతుని స్వాగతం

"ఏమిటి చదువుతున్నావు? కాదంబరా?" అన్నారు, మైసూరు ప్రాంతంలోని నా బంధువులొకరు ఏదో నవల చదువుతున్న నన్ను చూచి. "కాదంబరి కాదు. నవల." అన్నాను. "అదేనయ్యా! నవలనే కాదంబరి అంటాము మేము. మరాఠీలు, గుజరాతీలు అలాగే అంటారు" అన్నారు ఆయన.

కల్పనలకు కల్పలత అయిన కాదంబరి నవల వంటిదే మరి! కాదంబరినే నవలకు పర్యాయపదంగా వాడుకుంటున్నారు కన్నడులు, మరికొందరూ. ఎంత బాగుంది! — అనుకున్నాను. కాదంబరిని నవలగా భావించినందునే కాబోలు శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు 92ఏళ్ళ క్రితమే (1867) దాని నుంచి మహాశ్వేతావృత్తాంతం గ్రహించి, నవలగా వ్రాశారు. కొక్కొండవారెందుకు? కళాపూర్ణోదయం నవల — పద్యనవల — కాదూ సంభావ్యతా సంభావ్యతల ప్రసక్తి లేకుండా కల్పనను ఇతివృత్తంతో నడిపించడమే నవల ప్రధాన లక్షణమనుకుంటే! దాని అనుబంధంగా కనిపించే వెంకటాచార్యుని 'భద్రరాజపుత్ర చరిత్ర' మరొక పద్య నవల కాదూ? 19 వ శతాబ్దం పూర్వార్ధంలోని మారుపెద్ది చెంగల్వరాయకవి "చారుశీలావిలాసం", శాంతిభద్రాద్రి రామశాస్త్రి "చిత్రసీమ" ఇలాటి పద్య నవలలే కావూ?

ఇంతెందుకూ? ఇతివృత్తంతో కల్పనాగతి, పాత్రోన్మీలనం, రూపకరామణీయకం, మనస్తత్వ విశ్లేషణం, అన్నింటికీ పైచేయిగా సమకాలిక ప్రజాజీవిత ప్రతిబింబీకరణమూ, సందేశ నిర్వాదనమూ వంటి లక్షణాలతో నవల అని నేడు మనం అంటున్న సాహిత్యప్రక్రియ మాత్రం మనకు ఆంగ్ల సంబంధంతో వచ్చిందనడం నిస్సంశయం. ఆ ప్రక్రియలో మొదటిది మనకు 'మహాశ్వేత'. (ఇది తర్వాత కొంత వైజయంతిలో ప్రచురితమైనట్లు శ్రీ నిడదవోలు వెంకటరావుగారు తెలుపుతున్నారు.) రెండవది నరహరి గోపాలకృష్ణమశెట్టి శ్రీరంగరాజచరిత్ర (1872). ఈయన చిన్నయసూరికి సమకాలికుడు. తనకాలంలో వైస్రాయిగా ఉన్న లార్డ్ మేయో ప్రోత్సాహంతో దేశభాషలలో నవలోదయించిందని, ఆ ప్రోత్సాహంతోనే ఈ శ్రీరంగరాజచరిత్ర కల్పనను, సమకాలిక సాంఘిక పరిస్థితులచిత్రణంతో మేళవించి వ్రాశానని ఈయన ఆ పుస్తకంపీఠికలో వ్రాసుకొన్నాడు. సోనాబాయి అనే విజయనగర రాజకన్యకను చిన్నతనంలో లంబాడీలు ఎత్తుకొనిపోవడం, ఆమె అడవిలోనే వారితోపాటు పెరుగుతుండగా, విజయనగర చక్రవర్తి శ్రీరంగరాయలు ఒకనాడు వేటకుపోయి ఆమెనుచూచి మోహించడం, కాని, లంబాడీకన్య అని సంకోచిస్తుండగా, రాజకన్యక అని తెలిసి అద్భుతపడి పరిణయమాడడం — ఇది దీని కథాసారాంశం.

ఆటుతర్వాతిదే శ్రీ కందుకూరి వీరేశలింగంగారి 'రాజశేఖర చరిత్ర' (1878). మరి "నేనే మొదటినవల వ్రాసితిని" అని ఆయనా, నేనే మొదటినవల వ్రాశానని శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారూ చెప్పుకున్నారే ముక్తకంఠంతో. ఏమిటిగతి? — అని ప్రశ్నిస్తారు కదూ? అంతకుముందువి నవలలు కావనుకున్నారు కాబోలు వారు! కనుకనే తామే ప్రవర్తకులమని చెప్పుకున్నారు ఆ శాఖకు.

ఏదేమైనా పాశ్చాత్యదేశాలలో [illegible] శతాబ్దాలకు పైగా పరిణామం చెందిన నవల మన దేశంలో ఒక్క శతాబ్దంలోపునే వికసించింది. కాని, ఒకతరంవరకూ దానిగతి కేవలం ఉబుసుపోక. నిజానికి నవలకు కావ్యగౌరవం సంతరింపచేసినవారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ అడివి బాపిరాజు, శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగార్లు అని అనడం అతిశయోక్తి కాదు. అప్పటి నుంచి నవల నానాముఖాలుగా, నానారూపాలుగా — ఒకవైపు జాతీయదృష్టి, మరొకవైపు సంఘసంస్కరణ సంకల్పం, వేరొకవైపు ప్రాచీన వైభవ ప్రతిపాదనదీక్ష ఇలా — ప్రస్థానం సాగించింది. ఈలోగా స్వాతంత్ర్య సమరమూ సమాప్తిచెందింది. స్వాతంత్ర్య సంసిద్ధి అనంతరమూ వివిధేతివృత్తాలతో ఈ ప్రక్రియ సాగింది. ఆంగ్ల విద్యాప్రభావం, పట్టణమనస్తత్వంమూలంగా బయలుదేరినవి — తెరచిరాజు, ప్రజలమనిషి, చివరకు

మిగిలేది, కీలుబొమ్మలు వంటివీ ఉన్నాయి వాటిలో; ఆంధ్రప్రాంతానికో, భారతదేశానికో పరిమితం కాక మానవజీవితాన్ని, తనను ఎదుర్కొంటున్న సన్నివేశాలలో మానవుని విక్రియను, మనస్తత్వాన్ని చిత్రించే 'అల్పజీవి'వంటివీ ఉన్నాయి. ఈలాటివాటిలో రచయిత మస్తిష్కంలో మొలుచుకువచ్చిన భావాలను యథాతథంగా చిత్రించే ప్రయోగాలు చేశాడు.

నవల నానాముఖాలుగా వెలసినా, జాతిజీవిత ప్రతిబింబం కాగలిగిందా? నవలలో దీనికి ఎంతో అవకాశం ఉందికదా? ఆ అవకాశం పూర్తిగా వినియుక్తమైందా? ఇతర సాహిత్య ప్రక్రియలు-కథ, కవిత—లాగ వేయిరేకులుగా వికసించిందా? కథలాగ కవితలాగ ఉత్తమస్థాయిని అందుకోలేదనే చెప్పడం అసంగతం కాదనుకుంటాను.

నవల కథలాగ ఉదాత్తస్థాయిని అందుకోటం ఎలాసాధ్యం? కథకు మనదేశంలో దాదాపు మూడు వేల సంవత్సరాల జాతకం స్పష్టంగాఉంది. గౌతమబుద్ధునిపుణ్యాన ఆయన పూర్వ జన్మలకథలూ మనకు దక్కాయి. జాతకం కట్టడానికి సాధ్యం కాని మన విజ్ఞాన భాండాగారమైన వేదంలోని కథలను ప్రత్యేకంగా జ్ఞాపకం చేసుకోనక్కరలేదు. నేటి పెక్కుసాహిత్య ప్రక్రియలకు - కావ్య, నాటక, ఆఖ్యానాదులకు - మూలకందమైన బృహత్కథకు పుట్టినిల్లు మన తెలుగునాడే. కనుకనే కథాకథనం మనసొమ్ము. నాటకాలను కూడా కథలుగా పిండికొట్టినవాళ్లం మనం. దీనికి తోడు పాశ్చాత్య పద్ధతిని కూడా పుణికి పుచ్చుకున్నాము. చిన్నకథకు వన్నె దిద్దుకున్నాము.

అంతేకాక, కథనొక చిన్న సన్నివేశంతో మలచుకోవచ్చు. నవలకు కావలసింది సన్నివేశ బాహుళ్యం. అలాటి సన్నివేశాల బాహుళ్యం కలవిగా మనజీవితం, సంఘం ఆత్యంతికంగా మారాయా? రాజకీయరంగంలో వచ్చినమార్పు చల్లగా వచ్చింది—దాని వేడిగాని, వెలుగుగాని మనకు సోకనే లేదు. భౌతికంగా పరిస్థితులు మారాయా? ఆ మార్పు రావడానికి పరిశ్రమాభివృద్ధి అవసరం. అది తగినంత జరిగిందా? భౌతిక పరిణామం కలిగినప్పుడే జీవితం లోను సంకీర్ణత, వైవిధ్యం పొడసూపుతాయి.

ఇక కవిత అందామా—అదీ మనసొత్తే. సుందర ముక్తకాలు—గాథాసప్తశతి—దొర్లింది మనగడ్డపైన. రెండు వేలేండ్లుగా కవితా సంప్రదాయం వేయిపాయలుగా పారింది ఈ గడ్డమీద. దీనికితోడు భావావేశంతో పొంగే గుండె ఉంది మనకు. మరి దీని ఉదాత్తత నవలకు రావటం ఎలా?

ఇక మనకు రచయితృవర్గం ఎంతఉంది గనుక? ఎంత అభివృద్ధి చెందింది గనుక? ఈ రచయితృవర్గం తన వైయక్తిక చిత్తవృత్తినే ప్రధానంగా ప్రతిబింబింపజేస్తున్నంతవరకు నవల మన జీవితంలోని, సంఘంలోని విస్తృతిని ఆకట్టుకోగలుగుతుందా? మనకున్న నవలాకారులలో చెప్పుకోదగ్గ పెద్దలు ఐదారుగురు. వీరిలో ఒకరిద్దరు చారిత్రక నవలా రచయితలు. వారి రచనల్లో చాలాచోట్ల వారికాలపు వాతావరణం ప్రస్ఫుటిస్తుందికాని ఇతివృత్తం కాలపుది కాదు. సాంఘిక నవలా రచయితలలో సమకాలీన వస్తువును గ్రహించే వారు ఇద్దరు ముగ్గురే. కనుక మనం వైవిధ్యం అభిలషించడం, అభ్యూహించడం కష్టం. వీరందరూ తమ నవలల్లో ఒక్కొక్క రచనా విధానాన్ని ప్రయోగాత్మకంగా చూపడానికి ప్రయత్నించినట్టు కనిపిస్తుందేకాని, జాతి సమగ్ర జీవిత చిత్రణకు పూనుకున్నట్టు తోచదు.

నవల వికాసం రుద్ధం కావడానికి మరొక కారణమూ ఉంది. మన పాత జీవిత వ్యవస్థ కూలిపోయింది. సమష్టి కుటుంబ పద్ధతి సమసిస్తూఉంది. విశ్లథమార్గం, వైయక్తిక జీవితం అల్లుకొంటున్నాయి. నూతనవ్యవస్థ—పారిశ్రామికీకరణం పాశ్చాత్యదేశాలలోలాగ జరుగలేదు. పరిశ్రమలున్నచోట్ల ఉన్న కొద్దిపాటి సంకీర్ణ జీవితమూ ప్రతిఫలించడంలేదు నవలల్లో.

యుగధర్మమనేది సర్వకాలీనం. నేటి నవలల్లో చాలవాటిల్లో రచయితలు తమ మనఃప్రవృత్తిమార్గంలోనే విహరించడంగాను, చారిత్రక విషయాల క్రోడీకరణంగాను ఈ యుగధర్మం భాసిస్తున్నదనవచ్చు. మన రచయితల దృష్టి సమకాలీన జీవితంపై తగినంతగా ప్రసరించకపోవడమే దీనికంతా కారణం.

అలా ప్రసరించిఉంటే, పాశ్చాత్య నవలాకారులు పనిగట్టుకొని వ్రాశారా, చర్చించారా అన్నట్టున్న సాంఘిక సమస్యలను చర్చించేవారే. సాంప్రదాయికంగావచ్చిన, వస్తున్న పురుషార్థాలనే చర్చించారు గాని, కులమతాలశృంఖలాలు తెంచి కిందికులంవారు

పెద్దకులంవారిని పెండ్లాడి విజయం సాధించాలనే సంగతిని ఆలోచించక పోయేవారం!

ఇంతమాత్రాన ఇటీవలవచ్చిన నవలలలో 'నాగరక' దృష్టి, మానవజాతి సాన్నిహిత్యాకాంక్ష లేవని కాదు. శ్రీ అడవి బాపిరాజుగారి 'నరుడు' అలాంటి దృష్టిలాహిత్యానికి ఒక అపవాదం. ఒక హరిజనబాలుడు తనకు అర్థంకాని కులమత వ్యవస్థాపంజరాన్ని ఛేదించుకోవడానికి చేసిన మహాప్రయత్నం ఈ చిన్న నవలలో వర్ణితమైంది. ఆ బాలుడు క్రమంగా — ఈ ఘర్షణలోనే పెరుగుతూ, పోరాడుతూ తుదకు ఒక ఆంగ్లోఇండియన్ కన్యను పెండ్లాడుతాడు. పైకులాలతో అతనికి పరిణయం చేయించే ధైర్యం శ్రీ బాపిరాజుగారికి లేకపోయిందేమో!

ఇంతకుముందే నేను సూచించినట్లు శ్రీవట్టికోట ఆళ్వారుస్వామిగారు "ప్రజలమనిషి"లో తెలంగాణాలో నిజాం, జాగీర్దారకింద నలిగిపోయిన సన్నకారు రైతుల జీవితాన్ని, అప్పటి దేశకాలపరిస్థితులను చాలవరకు ప్రతిబింబింపజేశారు; పరిష్కారమార్గాలు చర్చించారు.

శ్రీ శారదగారొక హోటలు సర్వరు. ఈయనలో అంతర్నిహితమైన రచనాశక్తి అకస్మాత్తుగా ఉద్బుద్ధమైంది; పెక్కుకథలు, నవలలు రచించారు. అట్టడుగునఉన్న సంఘం మానసిక పరిస్థితిని పరిపూర్ణ పాటవంతో చిత్రించే తీవ్రమైన రచన ఈయనది. "మంచీ-చెడూ" అనే నవలలో ఒక యువతి గత్యంతరంలేక వృద్ధునికి భార్యగా అంటగట్టబడుతుంది. అతను మరణించగానే ఆమె పతితురాలై వాడమనిషి దుస్థితికి దిగజారుతుంది. ఆమె జీవితాన్ని రచయిత ఉన్నదున్నట్లుగా, "బహిరంగా" తెలియజేయడమే రచనలో విశిష్టత.

ఈయన మరొక నవల "అపస్వరాలు". దీనిలో దొంగనోట్లు ముద్రించడం, పండితులైనవారుకూడా బ్రాకెట్లు ఆడడం మొదలయిన విషయాలు వర్ణించబడ్డాయి. వరదరాజు అనే రౌడీ క్రమంగా కరకుదనంపోయి ఆర్ద్రహృదయుడుగా పరివర్తన చెందుతాడు.

శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి 'అల్పజీవి' విశ్వజనీనమైన అపూర్వనవల. దీనిలోని అల్పజీవి సుబ్బయ్య. భయానుమానాలు మొదలయిన అవలక్షణాలు మూర్తీభవించి అతిసామాన్యుడైన సుబ్బయ్య, అనుభవం పొందను పొందను గడిచేరి నిలవకొక్కక్షనే అంతర్యుద్ధపు చిత్రమిది. ఏ దేశకాలాలకూ కట్టుబడనిపాత్ర సుబ్బయ్య.

శ్రీ భాస్కరభట్ల కృష్ణారావుగారి "వింతప్రణయం" 'నాగరిక'లోకానికి ప్రతిచ్ఛాయ అయిన నవల. దీనిలోని పాత్రలందరూ స్థిరదృఢభావాలు కలవారు; తమలోని దుష్ప్రవృత్తులనుకూడా బహిరంగపరచుకొని చర్చించుకొనే నిబ్బరం కలవారు. నాగరికులనబడేవారి 'డొల్ల'ను బట్టబయలు చేయడం రచయిత ప్రధాన లక్ష్యం.

శ్రీ జి. వి. కృష్ణారావుగారి "కీలుబొమ్మలు" నేటి గ్రామజీవితానికి ఫోటో. గ్రామకక్షలు రాజకీయ పార్టీల మారుపేరుతో, పేలి ముసుగుతో చేసే దురంతాల పర్యవసానం దీనిలో రూపుకడుతుంది.

ఓనమాలు, జగన్నాథరథచక్రాలు అనే నవలలు దళితవర్గాల పోరాటచిత్రణాలు.

ఏమైనా విద్యావంతమైనవర్గం, పరిశ్రమలూ, నూతన జీవిత విధానం అభివృద్ధి అవుతున్నవి గనుక ముందు ముందు "నాగరికమైన" (Sophisticated) నవలలు తలెత్తగలవనే భావుకుల అభ్యూహ.

—రామచంద్ర

# కలగూరగంప

## పల్లవుల శిల్పశైలి

శ్రీ ఆమంచర్ల గోపాలరావు

గత సంచికలో శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారు "పల్లవులు" అను శీర్షిక క్రింద, మహాబలిపురం శిల్పములను పరీక్షించి, కొన్ని అంశములను పేర్కొని, పల్లవులు పహ్లవులేనని, వారు విదేశీయులే అయి ఉండవలెనని వ్రాశారు. నిజంగా శిల్పమందు శైలి జాతిని, కాలమును తప్పక సూచిస్తుందని, వేరు ఆధారములు ఏవీ లేనప్పుడు, దొరికిన ఆధారములు ఇదమిద్ధమని తేల్చలేనప్పుడు, శిల్ప శైలియే, జాతి, కాలముల నిర్ణయమునకు ప్రబల ప్రమాణము కాగలదని, మహా పండితుల వాక్యము. అయినప్పటికీ, శిల్ప శైలికిని, భావాంకురములకును (*Motifs*) చాల వ్యత్యాసము కలదు. భారతశిల్పమందైనేమి, అనేక ఇతర శిల్పములందైతే నేమి, సర్వకాలములందును సంపూర్ణముగా దేశీయేతరములకు సంబంధించిన భావాంకురములు కొన్ని గోచరిస్తాయి. ఇందుకు కారణము, నాటికీ, నేటికీ మానవ నైజమునకు సహజమయిన దేశసంచార కాంక్ష. అనేక కారణములవలన మానవుడు దేశములను పర్యటనం చేస్తాడు. తాను చూచిన, అనుభవించిన, నేర్చుకొన్న, కొత్తవిషయములను తన దేశస్థులకు ఎరుకపరచుటకు కృషిచేస్తాడు. ఇంతేకాక, విదేశాలలో వింతలయిన తన దేశవిషయములను నేర్పుటకు తంటాలుపడతాడు. ఈ కారణంగా కళలో సయితం, సర్వకాలాల్లోను, సర్వదేశాలలో, అనేక విజాతీయ భావాంకురాలు గోచరించడం జరుగుతుంది. అందుచేత కొలది భావాంకురాలను గమనించి, శిల్పము విజాతీయ మయినదని చెప్పడం చాల సాహసమే కాక పొరపాటనికూడా అనవచ్చు.

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి మహాబలిపుర శిల్పములలో గమనించినవి కొన్ని భావాంకురాలు. ఇవి మూడు.



నాగార్జునకొండలో ఒక స్తంభములోనిశిల్పం. ఎడమ చేతిలో ఉన్నది మేక కొమ్ము.

1. "గంగావతరణ శిల్పచిత్రములో దిగువ ఒక జటామకుటధారి చేతిలో 'కార్నుకోపియా' అనే లేడికొమ్ము ఆకారపు పాత్రను ధరించాడు," ఆ

శిల్పమందు "కొర్న్యుకోపియా" వలె కనుపించునది పాత్రకాదు. బహుశా శిల్పములను పరీక్షింపక ఛాయా చిత్రములను మాత్రమే పరీక్షించిన, అది పాత్రవలె కన్పడవచ్చును. ఆ జటామకుట ధారి భగీరథ తపం ఫలితంగా వచ్చిన దివ్యగంగలో తన వస్త్రమును తడిపి, పిండుకుంటున్నాడు. ఆ శిల్పమును చూచిన, ఈ విషయము నిస్సందేహం కాగలదు. అయినప్పటికీ, "కొర్న్యుకోపియా కూడా" మన శిల్పములకు క్రొత్తకాదు. పల్లవ శిల్పములకు దాదాపు మూడువందల సంవత్సరములకు పూర్వమే వెలసిన నాగార్జునకొండ శిల్పములందు ఈ రూపము కనుపించును. పండిత లాంగ్‌హర్స్టుగారు ఈ రూపము డైనొసిస్‌ను నిర్దేశించును అని అన్నారు. 'సెలేనస్' చిత్రమేమోనని నేను అనుకొన్నాను. ఆ చిత్రమందు రూపొందిన ఆ వ్యక్తి కొర్న్యుకోపియాను, చెవిదగ్గరగా ఉంచుకొన్నట్లు కనిపిస్తాడు. ముసలితనంవల్ల వచ్చిన చెవిటిబాధతో, ఇతరులు చెప్పిన మాటలు స్పష్టంగా వినడానికి ఇది సహాయంగా ఉన్నట్లు, నాడు దేశమందు ఇట్టివి అందు



ఉంగరాల కేసరాలున్న అమరావతి సింహం.

కొరకుగా వినియోగమవుతున్నట్లు ఆ చిత్రంనుంచి తెలియగలదు "కొర్న్యుకోపస్" అనగా మేకకొమ్ము.



రింగు రింగుల జుట్టున్న అమరావతి బుద్ధ శిరస్సు.

2. "పల్లవులు శిల్పించిన సింహాప్రతిమలు రింగు రింగులుగా తీర్చి ఉంటుంది. ఇది గాంధార బుద్ధునిరీతి" అని వారన్నారు. నిజంగా ఇది గాంధార బుద్ధుల రీతి కానేకాదు. గాంధారబుద్ధులందు జుట్టు జుట్టుగాను ఉష్ణీషం ఒకముడిగాను స్పష్టంగా కనపిస్తుంది. బౌద్ధులు బుద్ధులకు బోధిసత్వులకు ముప్పైరెండు మహాపురుష లక్షణములను నిర్వచించారు. అందు ఉష్ణీషం ఒకటి. ఉష్ణీషం అనగా శిరస్సుపైభాగం ఎత్తుగా ఉండటం. ఇది గాంధార బుద్ధ శిల్పములం దగుపడు ముడి గాదు. ఈ ఉష్ణీషం సంపూర్ణ హైందవ సంప్రదాయములను వ్యక్తపరచు మన ఆంధ్ర బుద్ధరూపములందే చక్కగా అనుభావితమైనది.

శిరస్సుపై జుట్టు కుడివైపుకు రింగులుగా తిరిగి ఉండుటకూడ ఆముప్పదిరెండు మహాపురుషలక్షణములం

దొకటి. అమరావతి బుద్ధులందు ఈ లక్షణము స్పష్టముగా కానవస్తుంది. నిజంగా శిల్పమందు ఈ రింగుల జుట్టు, వట్టిజుట్టు నేగాక, మహాయోగుల శిరస్సులందు విచ్చుకొన్న సహస్రారమును సూచించునని కొందరి పండితుల అభిప్రాయం.

ఇట్టి రింగులు తిరిగిన జూలు ఏ అమరావతీ శిల్పములందు తాము చూడలేదని గోపాలకృష్ణమూర్తి గారన్నారు. వారు తొందరలో చూచియుండకపోవచ్చును. అయినా ముఖ్యమయిన అమరావతీ శిల్పములన్నీ లండను నగరంలో ఉంటంచేత అందరూ ఆ శిల్పములను పూర్తిగా చూడనవకాశము లేదు. ఇది నిజంగా మన ఆంధ్రమున కెంతయో దురదృష్టము. చిత్రశిల్పములలో (Relief sculptures) నిర్దేశించిన సింహరూపములజూలు, అమరావతీ శిల్పములందు సమాంతర రేఖలుగా కన్పడును. కాని ఒక పూర్ణశిల్పము (sculpture in the round) నందు సింహపు జూలు రింగురింగులుగానే, పల్లవసింహముకువలెనే వారు నిర్దేశించిరి. నిజంగా బుద్ధునే నిర్దేశించు సింహరూపమునకు బౌద్ధశిల్పులు ఆ వాడు ఇట్టి రింగుల జూలు కల్పించడం సమంజసమే. బుద్ధునివలెనే ఆ సింహము సహితం ఒక మహాయోగి. అగరీతిని పల్లవులు కొలుచు దేవి వాహనముయిన సింహము, సామాన్య వనరాజ సింహము కాక మహాయోగిగానే ఉండవచ్చును. ఇందు విచిత్రమేమి లేదు. ఈ రింగుల జుట్టు, చిరకాల స్వదేశ సంప్రదాయమే కాని వేరు కాదు.

8. "కొన్ని శిల్పములకు కొమ్ముల కిరీటాలున్నవి." ఈ విషయం పొరపాటున నేను గమనించలేదేమోనని తిరిగి మొన్న మహాబలిపురం వెళ్ళి అన్ని శిల్పములను విడిగా గమనించి వచ్చాను. ఏ కిరీటమునకు కొమ్ములు లేవు. కాని కిరీటం ప్రక్కల చిత్రంగా రేకులను అమర్చినట్లు వారు శిల్పించారు. తర్వాత వచ్చిన కరండమకుటమునకీ రేకులు భావనాంకురములని చెప్పవచ్చును. కాని ఈ రేకులను కొమ్ములని వారెట్లు భావించారా! అని నాకు అనుమానం కలిగింది. నిజంగా కొన్ని ఫోటోగ్రాఫులలో అది కొమ్ములవలె కన్పడు అవకాశం కలదు. అలాగే, గవర్నమెంటువారు ప్రచురించిన గైడులో అచ్చయిన చిత్రములందు అవి కొమ్ములలాగానే వున్నవి. కాని మహాబలిపురంలో వున్న పల్లవశిల్పములందు కిరీటకములకు కొమ్ములు లేవు.



ముడితో ఉన్న గాంధార బుద్ధవిగ్రహం శిరస్సు.

శ్రీ గోపాలకృష్ణమూర్తి గారన్నట్లు మొహెంజోదారో హారప్పలందు కాక, మరెక్కడా ఇట్టి కొమ్ములను మనదేశ శిల్పులు నిర్దేశించలేదని అనుకొనవక్కరలేదు. 1944వ సంవత్సరంలో అహిచ్ఛత్రమందు బయలుపడ్డ శిల్పములందు ఇట్టి కొమ్ములున్న శిల్పం ఒకటి ఉన్నది. ఈ శిల్పంకూడా అయిదు ఆరు శతాబ్దములందు నిర్మితమయినదే.

నిజంగా ప్రాచీన శిల్పసంపద యంతయు నేడు మనకు లేదు. అందులో చాలభాగం శిథిలమయింది. ఉన్న కొంచెం కూడా సంపూర్ణంగా పరీక్షించడానికి ఒక జీవితం చాలదేమో అనిపిస్తుంది. అటువంటప్పుడు ఏ ఒక్క రూపమో, భావనాంకురమో "మన ప్రాచీన శిల్పములందు లేదు. నేను చూడలేదు" అని చెప్పడం చాలసాహసమేమో అని అనిపిస్తుంది. నిజంగా మన మెరుగని ఒక నవీనరూపం మన శిల్పాలలో కనిపించినప్పుడు కళాకారునికి పండితునికి చాల ఆనందంగా ఉంటుందనుకుంటాను.

శైలి ననుసరించి జాతిని నిర్ణయించవచ్చునని చెప్పాను. పల్లవ శైలియందు ముఖ్యంగా కనుపించునది రూపములను పొడుగించుట. (Elongation of form ) దీనివల్ల మానవరూపములందు, శక్తి మున్నగు



అహిచ్ఛత్రంలో లభించిన మృణ్మయశిల్పం.

వది (Energy, Force) స్పష్టముగా ప్రబలముగా గోచరిస్తాయి. ఈ శైలి సంపూర్ణ ఆంధ్రము. అమరావతి, నాగార్జునకొండ శిల్పములందిది స్పష్టంగా కనపిస్తుంది. పల్లవ శిల్పంలో బాహుగ్గా నాజూకుగా శక్తివంతంగా కనుపించే దివ్యమానవరూపాలు, కాలం గడచుకొలది, పొట్టిగా, మొరటుగా తయారయి, తమ సహజ సౌందర్యాన్ని ప్రతిభను, క్రమంగా ద్రావిడ శిల్పంలో అదృశ్యమయినవి. పల్లవశైలి నిజంగా ఆంధ్ర శైలి. ఈ శైలి అంకురం ఆంధ్ర గర్భమయిన అమరావతే.

## వేదకాలంలో అశ్వశాలలు

ఋగ్వేదంలో యుద్ధాశ్వాలు, గుఱ్ఱాలు పూన్చిన యుద్ధరథాల ప్రస్తావన ఉంది. కాని అశ్వికదళాల ఏర్పాటు, అలాటి దళాల శిక్షణకు అశ్వశాలలనిర్మాణం వేదకాలం తర్వాతనే అయివుంటుందని పలువురు పండితులు అభిప్రాయపడుతున్నారు. అశ్విక దళాల ఏర్పాటు మనకు చారిత్రకంగా తెలిసినంతవరకు క్రీస్తుకు ముందు 12వ శతాబ్దిలోనే తొలిసారిగా అస్సీరియాలో జరిగిందనడం వాస్తవమే. క్రీస్తుకుముందు 20వ శతాబ్దిలో యుద్ధరథాలు (ఈజిప్టుపై హిక్సోస్ దాడి చేసినప్పుడే) ఉన్నట్టుకూడా ప్రమాణాలుండడం నిజమే. కాని గుఱ్ఱాలు లాగే యుద్ధరథాలు వేదకాలంలో ఉన్నప్పుడు అశ్వశిక్షణశాలలు కూడా ఆకాలంలో ఉండియుంటాయికదా!

కనుక, అశ్వశిక్షణ, ఆ కారణంగా అశ్వశాలలూ వేదకాలపు భారతీయులకు తెలుసుననుకోనడానికి తగిన కారణాలున్నాయి. మిటన్నీ తెగలో భారతీయుల పేర్లుండడం అందరికీ తెలుసు. కిక్కులీ అనే పేరు గల ఒక మిటన్నీ తెగవాడు హిట్టైట్ రాజులకోసం 'అశ్వశిక్షణ'పై ఒక చిన్న పుస్తకం వ్రాశాడు. ఇతని మాతృభాష హుర్రైట్. ఇది 1938లో ప్రచురించబడింది. ఇది క్రీస్తుకుపూర్వం 14వ శతాబ్దిలో రచితమై ఉంటుందని పండితుల అభిప్రాయం. దీనిలో ఐకవర్తన్న, తేరవర్తన్న, పంజవర్తన్న, సత్తవర్తన్న, నావర్తన్న—అనే పదాలు (సెమెటిక్ భాషలకు ఎంతమాత్రమూ సంబంధం లేనివి) కనిపిస్తున్నాయి. ఇవి అశ్వక్రీడలను తెలిపే ఏకవర్తనం, త్రివర్తనం, పంచవర్తనం, సప్తవర్తనం, నవవర్తనం—అనే సంస్కృత పదాల అపభ్రష్టరూపాలనడం నిశ్చయం. అంటే వేదకాలపు భారతీయులు గుఱ్ఱాలకు శిక్షణ నివ్వడం మాత్రమే కాక అశ్వక్రీడలను కూడా అభివృద్ధిపరచుకొన్నారన్నమాట. ఆ క్రీడలను తెలిపే పారిభాషిక పదాలను ఇతరదేశాలవారు కూడా గ్రహించారంటే, వాటి వ్యాప్తి ఎంతటిదో మనం గ్రహించవచ్చు. దీనిని బట్టి మనం వేదకాలంలో అశ్వశాలలు కూడా వున్నవని ఒప్పుకోనక తప్పదు. అక్కాడియన్ లిపిలోని నూజీల పుస్తకాలలో సంస్కృత భాషలోని అశ్వపర్యాయ పదాలు కనిపిస్తాయి. వీటిని వ్యాఖ్యానించడం కష్టమే అయినా, కొన్ని గుఱ్ఱాలకు విశేషణంగా వాడిన బభ్రున్ను/పభ్రున్ను, బభ్రున్ను/పింకరున్ను, జిర్రమన్ను/జిర్రన్ను—వంటి పదాలు బభ్రు, పింగళ, జీర అనే సంస్కృత పదాల అపభ్రంశం కావచ్చు.

(అన్నల్స్ ఆఫ్ ది భండార్కర్ ఓరియంటల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్‌లోని విక్టోర్ పిసానీగారివ్యాసం నుంచి—1958.)

# గ్రంథవిమర్శనము

## విగ్రహవ్యావర్తని

తథాగతుడైన గౌతముడు ధర్మ ప్రవచనం చేస్తున్నపుడు నాల్గు ఆర్యసత్యాలను అష్టాంగిక మార్గాన్ని, నిర్వాణాన్ని చెప్పి పరమార్థం ఏమిటో చెప్పకపోవడంవల్ల బౌద్ధంలో ఈ గోలఅంతా వచ్చి పడినట్లు కన్పిస్తుంది. అంతేగాక ఔపనిషదమైన తత్వ విజిజ్ఞాసకు పూర్తిగా వ్యతిరేకంగా ధర్మ జిజ్ఞాసను సాగించడం ఇందులో గోచరిస్తుంది. సూత్త పిటకంలో నేమి, ఇంకా ఇతర గ్రంథాలలో నేమి (మిలిందపన్హా) ఆత్మనుగురించిన ప్రశ్నలు వస్తాయి. భగవంతుడైన బుద్ధుడు ఎట్లా ఈ ప్రశ్నకు సమాధానం చెప్పడానికి నిరాకరిస్తాడో ఇతర గ్రంథాలలోగూడా అట్లాగే నిరాకరించడంవుంది. కొన్నిచోట్ల "నేను చెప్పాను. ఇది విశ్వసించు" అన్న ధోరణిలో రథం నడుస్తుంది. ఆతర్వాత రథం దృష్టాంతం వస్తుంది. "రథం వున్నది. అది శతాంగం. అందులో ఒక్కొక్క అంగాన్ని తొలగిస్తే ఏమి మిగిలింది. ఏమీ లేదు." ఈ ధోరణిలో అనాత్మవాదస్థాపనం జరుగుతుంది. అయితే పిటకాలలో పరమార్థ విజిజ్ఞాస వుండదు. నీతివాదం వుంటుంది. గౌతముడు నీతివాది. తాత్వికుడు కాదేమో ననిపిస్తుంది. ఆతర్వాత వచ్చిన బౌద్ధులకు అందులో తత్వ ప్రాతిపదికలను కుదర్చవలసి వచ్చేసరికి, ఆ బౌద్ధం బహు అవతారాలు ఎత్తింది. అందులో హీనయానం మొదటి అవతారం. రెండో అవతారం మహాయానం. ఇప్పుడు విగ్రహవ్యావర్తని గ్రంథకారుడైన నాగార్జునాచార్యులవారు ఈ మహాయాన బౌద్ధులలో మాధ్యమికుడు. శూన్యవాది.

ఆచార్య నాగార్జునుడు చెప్పిన శూన్యవాదానికి మాధ్యమికవాదం అన్న పేరు ప్రశస్తిలోకి వచ్చినా, దీనికి అద్వయవాదమని, సర్వధర్మ శూన్యవాదమని, ప్రతీత్య సముత్పాద వాదమని అజాతివాదమని పేర్లు వున్నాయి. అయితే మాధ్యమిక వాదం అన్న పేరు దీనికి మిగిలిపోవడానికి ఒక కారణంవుంది. శాక్యపుత్రీయుని ఆది బౌద్ధంలో బహుశాఖలు వున్నట్లే, ఆ అనంతరం వచ్చిన శూన్యవాదంలో గూడా శాఖలు ఏర్పడ్డాయి. ఇందులో మొదటి శాఖను పుద్గలశూన్యవాదం అంటారు. (ఈ పుద్గల శూన్యవాదాన్ని ఇంగ్లీషులోనికి Pluratism అని తర్జుమాచేశారు. చూ. షర్ బర్ త్స్కీగారి Buddbsuc logic పీఠిక) ఈ పుద్గల శూన్యవాదంలో తిరిగి రెండు ఉపశాఖలు ఏర్పడ్డాయి. ఈ ఉపశాఖలలో అతివాదులను సర్వాస్తివాదులని, మితవాదశాఖను వాత్సీపుత్రీయులని అంటారు. ఆతర్వాత సర్వధర్మ శూన్యతావాదం బయలుదేరింది. ఇందులో గూడా రెండుశాఖలు బయలుదేరాయి. ప్రాసంగికులు; స్వాతంత్రికులు అని. ఇందులో నాగార్జునాచార్యులవారు ప్రాసంగికశాఖకు చెందినవారు. భావ్యాది ఇతర తాత్వికులు స్వాతంత్రికులు. ఈ రెండుశాఖలను కలిపి మాధ్యమిక శాఖ అంటారు. ఇందుకు కారణంఇది. నాగార్జునుని అనంతరం, "ఆయనతర్క బలం క్రిందలోకువ" అయిపోయి బౌద్ధులలో ఎవ్వరూ కొత్త విషయాన్ని చెప్పలేకపోయారు. అక్కడితో నూతన బౌద్ధతత్వవ్యాప్తి ఆగిపోతుందా అనిపించింది. ఇట్లా కొంతకాలం గడిచినతర్వాత ఇద్దరు మహాపురుషులు గుప్తరాజులకాలంలో అవతరించారు. ఒకడు అసంగుడు, రెండవవాడు వసుబంధువు. వీరు ఈ శూన్యవాదంలో మూడోశాఖను నెలకొల్పారు. వీరిశాఖను బాహ్యార్థ శూన్యవాదం అంటారు. (ఇంగ్లీషులో దీనిని Ideialism అంటూ తర్జుమా వెలయించారు. చూ. షెర్ బర్ త్స్కీ Buddhistic logic —పీఠిక) తిరిగి ఇందులో రెండుఉపశాఖలు బయలుదేరాయి. మొదటిశాఖను స్థాపించినవారిని (అసంగుడు, వసుబంధువు) ఆగమానుసారులని అంటారు. రెండోశాఖను న్యాయవాదమని పేరు. మహాతార్కికులైన దిఙ్నాగుడు ధర్మకీర్తి ఈ శాఖకు ప్రవర్తకులు. ఏవంవిధమైన బౌద్ధ ధర్మంలో నాగార్జునాదులు శూన్యవాదం మధ్యమ స్థానంలో

ఉన్నది కనుక అశూన్యవాదానికి మాధ్యమిక వాదం అని పేరువచ్చింది.

ఈ మాధ్యమిక ప్రాసంగిక బౌద్ధతత్త్వ ప్రవర్తకులలో నాగార్జునులు ప్రథములు. తరువాత ఆచార్య చంద్రకీర్తి. [అద్వైతములో గౌడపాదునకు శంకరుని వలె, సర్వ ధర్మశూన్యవాదంలో నాగార్జునులకు చంద్రకీర్తి.] గౌడపాద కారికలకు శంకరుడు భాష్యము వెలయించినట్లు ఆచార్య నాగార్జునినిమూల మాధ్యమిక కారికలకు చంద్రకీర్తి ప్రసన్నపదా నామక వ్యాఖ్యానము వెలయించాడు. ఇదిగాక చంద్రకీర్తి స్వయముగా మధ్యమకావతారం అన్న గ్రంథాన్ని కూడా రచించాడు. నాగార్జునుల వారు కూడా ఈ తమ తత్త్వాన్ని ప్రపంచిస్తూ శూన్యతా సప్తతి, యుక్తిషష్టిక, విగ్రహ వ్యావర్తిని, వైదల్య సూత్రము, వ్యవహారసిద్ధి...అన్న గ్రంథాల రచించారు. ఈ గ్రంథములలో విగ్రహ వ్యావర్తినిని డాక్టరు జి.వి. కృష్ణరావు గారు ఆంధ్రభాషలోనికి అనూదితం చేశారు. ఈ గ్రంథమును గూర్చిన సమీక్షయే ఇప్పుడు జరుగుతున్నది.

మూలమున ఈ విగ్రహ వ్యావర్తిని 72 శ్లోకముల గ్రంథము. దీనిని అనువదించడంలో పీఠికతో సహా కృష్ణరావుగారు 208 పుటల గ్రంథం రచించారు. ఈ 208 పుటలలోను 133 పేజీలు ప్రస్తావన. తక్కినది మూలమునకు అనువాదము, వ్యాఖ్యానము. మూల శ్లోకములను వీరు గీత పద్యములలోనికి, ఆటవెలదులలోనికి, కందములలోనికి అనువదించారు. వ్యాఖ్యానం, వచనంలో చేయించారు. పూర్వముకూడా తాత్త్విక గ్రంథములను తెలుగులోనికి అనువదించడం వుందిగాని, ఇట్లు పద్యాలుగా అనువదించడం వున్నట్లు లేదు. నేను చూచినంతలో ఆ పూర్వపు అనువాదకులు మూలమును ఇచ్చి, అందులో ప్రతి శ్లోకమునకు ప్రతి పదార్థదండాన్వయ తాత్పర్య విశేషములు వ్రాయడం వుంది. పురాణపండ మల్లయ్యశాస్త్రిల వారు శాంకరశారీరక భాష్యమునకు తమ అనువాదమునంతను వచనములోనే వెలయించిరి. మంత్రి లక్ష్మీనారాయణశాస్త్రి గారు పంచవిద్యారణ్యుని వేదాంత పంచదశిని సంస్కృత వ్యాఖ్యాన సమ్మతముగా టీకా తాత్పర్య విశేష వివేచనంగా 1896 ప్రాంతంలో తెల్గులోకి తెచ్చారు. ఇవి కొన్ని ఉదాహరణలు నామటుక్కు నాకు ఇది సవ్యమైన అనువాద పద్ధతి అనిపిస్తున్నది. శాస్త్రగ్రంథములను ఇట్లా తర్జుమా చేస్తేనే బాగుంటుందని, ఇప్పుడు డాక్టర్ కృష్ణరావు గారి అనువాదాన్ని చదివిన అనంతరం అనిపించింది. కారణం:

విగ్రహవ్యావర్తిని మూలగ్రంథంలో మొదటి శ్లోకం ఇది:

"సర్వేషాం భావానాం
సర్వత్ర న విద్యతే స్వభావశ్చేత్,
త్వద్వచన మస్వభావం
న నివర్తయితుం స్వభావ మలమ్.

దీనికి డాక్టర్ కృష్ణరావు తర్జుమా ఇది.

"సర్వభావసమితి సర్వత్రనిఃస్వభా
వమ్మ యయిన, నిః స్వభావ మగుచు
నరలు మీ వచస్సు స్వాభావ్య వినివర్త
నక్రియా సమర్థమ్ము కాదు.

పండితులైనవారు ఈ రెంటినీ పోల్చి చూచుకుని, అహో! అంటారు. సామాన్యులయిన తెలుగువాండ్రకు ఇది అర్థం కావాలంటే, ఏ ద్వితీయ చంద్రకీర్తో వచ్చి, టీకా తాత్పర్యాలు వ్రాయాలి.

మచ్చుకు ఇంకో శ్లోకం: మూలంలో 4 వ శ్లోకం ఇట్లా వుంది:

ప్రతిషేధః ప్రతిషేధ్యోఽ
ప్యేవ మితిమతం భవేత్తి దసదేవ,
ఏవం తవ ప్రతిజ్ఞా
లక్షణతో దూష్యతే న మమ.

డాక్టర్ కృష్ణరావు గారి అనువాదం:

ప్రతిషేధ ప్రతిషేధ్యం
బు తెలుప నిట్టిదమటంచు బోధనసూపిన నౌ
చితి కదిదూరం బిటు మీ
ప్రతిజ్ఞ లాక్షణికదోష పరతంబో వున్.

దీన్ని పండితులు పరిశీలించాలి. మూలంలో లేని మాటలు పద్యంలోకి వచ్చిపడ్డాయి. "బోధనసూపుట" "ఔచితికిదూరము" మొదలైనవి. ఇక్కడ నాది ఒక్క మనవి: అయ్యా! ఇది శాస్త్రగ్రంథం; కవిత్వం కాదు. శాస్త్రగ్రంథానువాదంలో, ముఖ్యంగా నాగార్జునాచార్యునివంటి మహాతార్కికుని గ్రంథానువాదంలో, జాగ్రత్త చాలా అవసరం. అదీకాక మూల శ్లోకం ఎట్లావుంది! దానికి అనువాదమైన పద్యం ఎట్లా

వుంది! అందుకే పండితుల పరిశీలనం అవసరం అన్నారు.

మూల గ్రంథానువాదాన్ని పరిశీలిస్తూపోతే చాలా గ్రంథం అవుతుంది. కాబట్టి పీఠికలో ప్రవేశించి, అది ఎల్లావుందో చూపించి, సమీక్ష ముగిస్తాను.

ఈ ప్రస్తావన మూలమాధ్యమిక కారికలో ప్రణామశ్లోకంగావున్న—

అనిరోధం అనుత్పాదం అనుచ్ఛేదం అశాశ్వతం,
అనేకార్థం అనానార్థం అనాగమ మనిర్గమం.
యః ప్రతీత్య సముత్పాదంతం వందే వదతాంవరం

అన్న శ్లోకానికి అనువాదం మత్తేభవృత్తంలో "అనిరోధంబయి, అప్రభావమయి" అంటూ "వరోపశమమై జానొందు భద్రమ్ము జూపినసంబుద్ధునకున్ బ్రువాణపతి కర్పింతున్ నమోవాకముల్" అనిగాగల పద్యానువాదంతో ప్రారంభమౌతుంది. (వదతాంవరం అనే సంస్కృత మూలానికి బ్రువాణపతి అని అనువాదం. ఓహో! బాగుంది!) ఆ తర్వాత నాగార్జునుని జీవిత చరిత్ర, ఆయన ఆంధ్రుడేనని నిరూపణ.

నాగార్జునులు వేదలిగ్రామవాసులు. ఆ గ్రామం ఎక్కడవుందో పరిశోధకులు తేల్చాలని డాక్టర్ కృష్ణరావుగారు కోరుతున్నారు. నాకు తెలిసినంతలో గుంటూరుమండలం సంగతి నాకు తెలియదు. కృష్ణాజిల్లాలో వడాలి అన్న గ్రామం వుంది. "వేదలి" వడాలిగా మారటం—డలయోరభేదః—శబ్ద విజ్ఞానశాస్త్ర వ్యతిరేకం కాదనుకుంటాను. అందుచేత వడాలియే పూర్వపు వేదలి అయితే నాగార్జునాచార్యుల వారు కృష్ణాజిల్లా వారైవుండివుంటారు. కృష్ణదాటితే నాగార్జునకొండ వచ్చేస్తుంది గాబట్టి ఇది దూరంగూడా ఏమీ కాదు. నాగార్జునుని కృతులు, మాధ్యమిక వాదము (మాధ్యమికం అనడం పొరపాటని కృష్ణరావుగారు) ప్రతీత్య సముత్పాదముగతి, కాలము, ఆత్మ, తథాగతుడు, స్వభావము, విపర్యాసము, దృష్టి, నిర్వాణము మొదలైన ధర్మాలను గురించి పరీక్ష [నాగార్జునమాధ్యమిక కారికల్లో ఇటువంటి బహుధర్మాల పరీక్షే] జరుగుతుంది. ఆ గ్రంథంలో ప్రతిప్రకరణంలోని ఒక్కొక్క ధర్మాన్ని (బౌద్ధంలో ప్రత్యయాదికాలను ధర్మాలంటారు) తీసుకొని, దానిని గూర్చి పరీక్ష జరుగుతుంది. ప్రత్యయపరీక్ష, గతాగత పరీక్ష. చక్షురాదీంద్రియ పరీక్ష, ధాతుపరీక్ష—ఇల్లా], కొంత నాగార్జున చంద్రకీర్తులను అనుసరించి, కొంత స్వకపోల కల్పితంగాను సాగుతుంది. ఆ పిమ్మట శూన్యవాదాన్ని గూర్చి నైయాయిక, వైశేషిక, భాట్ట, అద్వైతీత్యాదివాదులు చెప్పిన విగ్రహ పరిశీలనం (విగ్రహం అంటే దూషణం, అంటే ఖండన, పూర్వపక్షము—అని చంద్రకీర్తి భాష్యము] జరుగుతుంది. ఈ వాదం పారమిత ధర్మంపేరున బౌద్ధులు చెప్పే నీతివాద ప్రాశస్త్యంకూడా అభివర్ణితమౌతుంది. ప్రపంచోద్ధరణకు, ధ్యేయమార్గంగా బౌద్ధులంతా పారమితాలను ఒప్పుకుంటారు. ప్రతిబోధిసత్త్వుడు ఈ పారమితాలను సాధించే బుద్ధుడవుతూ వచ్చినట్లు కథలు వున్నాయి. ఇంతకీ ఇది నీతివాదం. ఏదో ఒకశీలాన్ని లేక వ్రతాన్ని పట్టుకొని పూర్తిగా ఆచరించడం సత్యహరిశ్చంద్రుడు కథలాగా. వైదికులుగాని, తదితరులుగాని ఇందులో ఆమోదించంది ఏమీ లేదు. పైగా ఇది క్రొత్తదికాదు. వేదాల్లోకూడా ఇది వుంది. కాని ఇందులో (అంటే బౌద్ధంలో) నామధేయం మారింది, నీతి మొదలైన మాటలతో వ్యవహరించింది, ఇక్కడ పారమితమైంది. (నిజానికి ఇటువంటి వ్రతపాలనం విషయంలో జైనులను చెప్పి మరొకరిని చెప్పాలి.) క్లుప్తంగా ఈ ప్రస్తావనయొక్క మూస ఇల్లావుంది.

ఈ ప్రస్తావనలో తక్కిన విషయాలను అట్లా వుంచి, నైయాయిక వైశేషికేత్యాదివాదులు చెప్పిన విగ్రహాన్ని, కృష్ణారావుగారు ఖండనభాగాన్ని మాత్రం ఇక్కడ కొంచెం పరిశీలించవలసివుంది. భాట్టమతిమనగా, కుమారిలభట్టుగారిమతము మా నాకు కొంచెం అనుమానంగా వుంది. పంచదశీత్యాది గ్రంథాలలో భాట్టమతం ఖండనవుందిగాని, అక్కడ కుమారిలుని ప్రసక్తిగాని, ఆయన పూర్వ మీమాంసా తత్వప్రసక్తిగాని వున్నట్లు కన్పించదు, అది సరే. కుమారిలభట్టు తన శ్లోక వార్తికంలో శూన్యవాదాన్ని నిరాలంబ ప్రకరణంలో ఖండిస్తాడు. నిరాలంబ వాదం నాగార్జుననిదా? అసంవృతి, సత్యము, పరమార్థము అన్నవి మూడువర్గాల శూన్యవాదులకు వున్నాయి. అసంగ వసుబంధుల శూన్యవాదాన్ని బాహ్యార్థ శూన్యవాదాన్ని మాత్రమే నిరాలంబవాదం అంటారు. [చూ: షర్బర్ట్స్కీ (Buddhistic logic)] కుమారిలుడు ఖండించింది ఈ శూన్యవాదాన్ని అనుకుంటాను. పండితులు ఈవిషయాన్ని పరిశీలించగలరు.

తర్వాత బ్రహ్మసూత్ర శంకరభాష్యంలో—బ్ర. సూ. భా. 2 పా. 5 అధి. 31 సూత్రం...ఈ

సూత్రం—క్షణిక త్వాచ్చ—అన్నది—శూన్యవాది పక్షాన్ని గూర్చి వున్న కొన్ని వాక్యాలను ఉట్టంకించి (తెలుగులో) ఆ వాక్యాలమీద వాచస్పతి మిశ్రుని వివరణముతో సహా. కృష్ణారావుగారు విమర్శించారు. శాంకరభాష్యం మూలంలో వున్న వాక్యాలకు వీరు వెలయించిన తర్జుమా ఇది : "శూన్యవాది పక్షమెల్ల ప్రమాణములచే నిరాకృతము గావున తన్నిరాకరణమునం దనాదరము చేయుచున్నాను. అన్యతత్త్వము నధిగమింపక సర్వప్రమాణ సిద్ధమగు నీ లోకవ్యవహారమును ప్రతిషేధింప శక్యము కాదు. ఏలయన మిథ్యను ప్రతిషేధించుట తదధిష్ఠానమగు సత్యము నామోదించుటయే యగును (అపవాదము లేనప్పుడు ఉత్సర్గము ప్రసిద్ధమగుచున్నది)." అసలు సంస్కృతిమూలంలో ఇట్లా వుంది:

"శూన్యవాదిపక్షస్తు సర్వప్రమాణ విప్రతిషిద్ధ ఇతి తన్నిరాకరణాయ నాదరః క్రియతే। నహ్యయం సర్వప్రమాణసిద్ధో, లోకవ్యవహారోఽన్యత్తత్త్వ మనధిగమ్య, శక్యతేఽపహ్నోతు మపవాదాభావే ఉత్సర్గ ప్రసిద్ధేః।"—ఈ భాష్యానికి శ్రీ పురాణపండ మల్లయ్య శాస్త్రులవారు ఇట్లా అనువాదం వెలయించారు: "శూన్యవాదిపక్షము సర్వప్రమాణ విరుద్ధముగాబట్టి తన్నిరాకరణమునకు వేరుగా సూత్రారంభము చేయబడలేదు. అపవాదము లేనియెడల ఉత్సర్గము సిద్ధించుటవలనను, సర్వప్రమాణసిద్ధమగు నీలోకవ్యవహారము వేరొకతత్త్వము నంగీకరింపక యపహ్నవింప శక్యము కాదు." సంస్కృతంలో ఈ భాష్య భాగంమీద వెలసిన వ్యాఖ్యానాలలో కూడా—"శూన్యేతి—అదః పృథక్ సూత్రారంభః న క్రియతే। ఏతాన్యేవ తన్మతి నిరాసార్థత్వేనాపి, యోజయంత ఇత్యర్థః।" అని వుంది. ఈ అన్నింటి అర్థం ఏమిటంటే శూన్యవాదాన్ని గురించి అనాదరం చేసింది శంకరుడు కాదు; సూత్రకారుడు; ఆవాదం సర్వప్రమాణ విరుద్ధంగాను వున్నది. గనుక సూత్రకారుడు నిరాదరణ చేశారు అని శంకరుడు అంటున్నాడు. అందుచేత సుగత ధర్మఖండన విభాగంలో బ్రహ్మ సూత్రాలలో ఈ శూన్యవాదానికి వేరే సూత్రం అంటూ లేదు. పోతే శంకరుడు దీన్ని - ఈ శూన్యవాదాన్ని - నిరధిష్ఠాన వాదాక్రింద తేల్చివేశాడు. దీన్ని గూర్చి కొంతచర్చ తైత్తిరీయ భాష్యంలో 'అసన్నేవ స భవతి!' అరవఅధ్యాయ మంత్ర భాష్యంలో వుంది.

ఇంకా శంకరుని గ్రంథాలలో చాలాచోట్లవుంది. పంచదశిలో విద్యారణ్యుడు శూన్యవాదాన్ని నిరధిష్ఠాన విభ్రాంతి అన్నాడు. కృష్ణారావుగారు కొంచెం జాగ్రత్త పడివుంటే శంకరభాష్యం తర్జుమాలో పొరపాటు జరిగేదికాదు.

కృష్ణారావుగారు వ్రాసిన ప్రస్తావనలో, అసలు శూన్యవాదంతో ఏమాత్రం సంబంధంలేని అంశాలు గూడా కొన్ని దొర్లాయి. నాగార్జునుడిది సాపేక్షవాదం అని, అందువల్ల ఆయన ఐన్‌స్టీన్ గారి Relativity సిద్ధాంతాన్ని ముందుగానే ఊహించారని కృష్ణారావుగారు అంటున్నారు. ఈ వాదం పాశ్చాత్తు వేదాలలో అణ్వస్త్ర ఉదజని అస్త్రాల రహస్యాలు ఇమిడే వున్నాయని వాదన చెప్పినట్లువుంది. నాగార్జునులు వాడిన సాపేక్షం అనేమాటకు, పరతంత్రము, వ్యావహారికము, సంవృతి మొదలైన అర్థాలుగూడావున్నాయి (చూ. Prof Suzuky-లంకావతార సూత్రం.) వ్యవహారంలో ఈ సర్వము అస్వతంత్రమని పరస్పరాపేక్షం అని భారతీయ తాత్వికులంతా అమోదిస్తూ నేవున్నారు. ఈ అర్థం ఉపనిషత్తులలో గూడా వుంది. అయితే ఇదే ఐన్‌స్టీన్ పండితుని Relativity సిద్ధాంతానికి దారితీసింది అనటం సహేతుకం కాదు. అసలు ఐన్‌స్టీన్ గారి సిద్ధాంతానికిన్నీ, నాగార్జునుల "సాపేక్ష"వాదానికిన్నీ ఏమీ సంబంధంలేదు. ఆ వాదాన్ని గురించిన పెద్ద గ్రంథాలను చదవకపోయినా, Oxford మొదలైన ఏ ఇంగ్లీషు నిఘంటువును చూచుకున్నా, ఈవిషయం తెలుస్తుంది. అట్లాగే కమ్యూనిష్టులుగూడా ఆస్తికులేనని, నాస్తికులమని చెప్పుకోనగలరా? అనేత్యాద ప్రసక్తులు ఈ గ్రంథంయొక్క ఫక్కీకి తగివుండలేదు.

ఈ 182 పేజీల ప్రస్తావన చదువుతూవుంటే చాలాబాగా వుందనిపిస్తూ వుంటుంది. అంతా చదివిన తర్వాత శూన్యవాదాన్ని గురించి ఇందులో ఏమి చెప్పారు? అని ప్రశ్నించుకుంటే—నా మట్టుకు

నాకు, చెప్పకద్దూ!—ఏమి చెప్పారురా? అన్న ప్రశ్నే ఉదయించింది. కారణం ఏమిటో మాత్రం తెలియడంలేదు. ఆ దోషం ప్రస్తావనలో ఉపయోగించిన గద్యభాషలో వున్నదో, లేక శూన్యవాదము లోనే వున్నదో అర్థము కావడములేదు. పఠితలు అవధి కానివారు గనుక, వారిని మాట అనడానికిలేదు. వారికి అర్థం కావడంకోసమే గదా గ్రంథాలు వ్రాసేది. ఆ దృష్టి పెట్టుకున్న పక్షంలో ఈ గ్రంథరచన సరళంగాసాగి, అందరికీ అర్థమయ్యేటట్లుగా తయారయ్యేది.

ఇంకో విషయం; దేశములో బహుమంది పండితులు వున్నారు. వారిని గౌరవించుట మనవిధి. ఆ పండితులతో మనకు సరిపడునా, పడదా అన్నది వేరే విషయం. కాని వారి పాండిత్యాన్నిబట్టి వారిని మన్నించక తప్పదు. మన దేశములోని మహా పండితులలో రాహుల్ సాంకృత్యాయనులు ఒకరు. వారిని అందరు మహాపండిత రాహుల్ సాంకృత్యాయనులనే అంటారు. సాంకృత్యాయనులు బహు భాషావేత్తలు, బౌద్ధమునకు ఆయన చేసినసేవ అపారము. కృష్ణరావు గారు తమ ఈ గ్రంథములో ఆయనను శ్రీ ఆర్. సాంకృత్యాయన్ అనిమాత్రం ఉట్టంకించారు. ఇది పొరపాటున జరిగిందనుకుంటాము. ఇటువంటి విషయాలను అల్లా వదిలివేసినా, ఒక తాత్వికరచన చేస్తున్నప్పుడు వ్రాయరానిపద్ధతి వాక్యాలుకూడా ఇందులో కొన్ని వున్నాయి. ఉదాహరణకు—"తత్వమిట్లున్నది. మనమేమి చేయగలమని కూర్చున్నచో అన్నభిక్షుకులను అపేక్ష్య భిక్షుకు లవలసివచ్చును." మొదలైనవి. పైగా ఇందులో ఎంత తల పగలగొట్టుకున్నా ఎట్లా ఏర్పడ్డాయో తెలియనిమాటలు కొన్ని వున్నాయి. ఉ=జాజాత్స; కొన్ని కొత్త నుడికారములు కన్పిస్తున్నాయి: ఉ=గోళ్లను గోకళ్లను బలికినది.

ఈ గ్రంథం వెల: రూ. 6-50. ప్రాప్తిస్థానం. రచయిత, తెనాలి కళాశాల, తెనాలి; సాహితీ నికేతనము, తెనాలి.

"హారీత శివశర్మ":

## జర్నలిజం

"ఆధునికాంధ్ర సాహితీ ప్రపంచంలో పత్రికలు ప్రత్యేకత గలవి. పత్రిక లీనాడు ప్రజాసామాన్యమునకు, ప్రభుత్వమునకు నడుమగల యొక వంతెన వంటివి. సాహిత్యశాఖ లన్నిటిలో నింతటి శక్తిమంతమైన శాఖ మరి యొకటి లేదు." అన్నారు సుప్రసిద్ధ విమర్శకులు శ్రీ నిడదవోలు వేంకటరావు గారు.

పత్రికలు మన జీవితంలో నే భాగమైపోయాయి. విదేశాలలో వలెనే అవి మన దేశంలోనూ బలమైన ఆయుధాలుగా రూపొందుతున్నాయి. కనుకనే పత్రికలను "ఫోర్త్ ఎస్టేట్" అన్నారు. ఇది పత్రికా రచన ప్రాముఖ్యాన్నీ చెప్పకనే చెబుతున్నది. అలాటి పత్రికా రచనను గురించి ఇతర వృత్తులు వారు, ఆ వృత్తిలోని వారు తెలుసుకోవడం అవసరం.

"జర్నలిజం" అనే ఈ పుస్తకం ఆ అవసరాన్ని తీరుస్తున్నది. పత్రికా రచనను తెలిపే మొదటి తెలుగు పుస్తకం ఇదే. దీనిని శ్రీ నర్రావుల సుబ్బారావు గారు రచించారు. పుటలు: 130, వెల: 1-75, ప్రతులకు: కిసాన్ పబ్లికేషన్స్, బుర్రిపాలెం పోస్టు, తెనాలి.

శ్రీ సుబ్బారావుగారు ఈ పుస్తకంలో పత్రికా రచన అంటే ఏమిటి, పత్రికా రచయిత అర్హతలు, పత్రికలభాష, వారపత్రికలు, కంపోజింగు రూము, వార్తలు, తాజావార్తలు, వార్తల విభజన, విలేకరి, ఇంటర్వ్యూ, ఇంటర్వ్యూ పరికరాలు, వార్తలకూర్పు, వర్ణన, వార్తా సంస్థలు, మన దేశంలో వార్తా సంస్థలు, స్థానిక వార్తాసంస్థలు, ఉపసంపాదకుడు, హెడ్ లైన్స్, వ్యాసాల శీర్షికలు, లీడ్స్, సంపాదకుడు, స్పోర్ట్స్, స్థానిక వార్తలు, వ్యాపార ప్రకటనలు, పుస్తక సమీక్ష, ప్రచారం—పౌర సంబంధాలు, ప్రభుత్వం-ప్రజలు, పత్రికా రచనలో స్త్రీలు, భారతదేశంలో పత్రికల పుట్టుపూర్వోత్తరాలు, తెలుగు పత్రికాలోకం పుట్టుపూర్వోత్తరాలు, ప్రెస్ కమీషన్—మున్నగు శీర్షికలక్రింద పత్రికా రచనకు సంబంధించిన పెక్కు విషయాలు క్షుణ్ణంగా చర్చించి వివరించారు.

తెలుగు పత్రికాలోకం పుట్టుపూర్వాలు— అన్న శీర్షికక్రింద వివరించిన విషయాలలో కొన్ని సవరించుకోవలసి ఉంటుందని భావిస్తున్నాను. "1827 లోనే తెలుగులో పుస్తకాలు ముద్రించబడ్డట్టు తెలుస్తూ ఉంది." (పుట-118) అన్నారు—1807 కే క్రైస్తవపాదిరీలు తెలుగులో తమ మతపు కరపత్రాలు, న్యూటెస్టమెంట్,

వ్యాకరణం ప్రచురించారు. 1817 లో బ్రౌను పండితుని తెలుగు వ్యాకరణం ముద్రితమైంది.

"18[illegible]6 లో తొలుదొల్త ఏ. పి. పార్థసారథి నాయుడుగారు కేవలం వార్తలతో ఒక వార పత్రికను మద్రాసునుండి ప్రచురించడం మొదలుపెట్టారు. "ఆంధ్ర ప్రకాశిక" పేరుతో తెలుగుదేశం నలుమూలలా తిరుగుతూ ఉండేది ఈ పత్రిక"—(పుట-119) అన్నారు.—ఆంధ్ర ప్రకాశిక అప్పటికి నిర్దుష్టమైన వార పత్రిక అనడం నిస్సందేహం. కాని అది "తొలుదొల్తి"దికాదు. "వర్తమాన తరంగిణి" అనే వార పత్రిక 1842 నాటికే (బ్రౌను పండితుని కాలంలో) ఉన్నది.

"1920 లో ప్రస్తుతం ఉన్న భారతి వెలువడింది" (పుట-122) అన్నారు.—భారతికి ఇప్పుడు 36 వ సంవత్సరం. ఇది అచ్చు పొరపాటు అయి ఉంటుంది.

ఉస్మానియా విశ్వ విద్యాలయం జర్నలిజం శాఖాధ్యక్షులు శ్రీ యస్. వి. కె. మూర్తిగారు ఈ పుస్తకం తొలి పలుకులలో అన్నట్లు పత్రికా రంగంలో ప్రవేశించాలని అభిలషిస్తున్న వారికి ఎంతో ఉపయోగకరమైన ఈలాంటి పుస్తకం రచించినందుకు శ్రీ సుబ్బారావుగారు అభినందనీయులు.

## దూత మత్తేభము

"మాఘే మేఘే గతం వయః" అన్నాడు మహా వ్యాఖ్యాత మల్లినాథసూరి. మేఘ సందేశం రెండు సర్గల లఘు కావ్యమే అయినా, రసనిర్భరం గనుక వ్యాఖ్యానించడంలో మాఘమంత శ్రమ కలిగించిందన్నమాట. ఇది వ్యాఖ్యానానికే పట్టినప్పుడు అనువాదానికి గట్టి కావడంలో ఆశ్చర్యమేముంది?

ఇంతవరకు దీనికి తెనుగులో ఎన్నో పదులు అనువాదాలున్నాయి. ఇది ఇటీవల వెలువడిన అనువాదం. అనువాదకులు శ్రీరాయప్రోలువారు. అనువాదం మత్తేభ వృత్తాలలో నడవడంవల్ల, కారుమబ్బులు కరి బృందాలను తలపించడంవల్ల 'దూత మత్తేభము' అనే శీర్షిక సుందరంగాను, సముచితంగాను ఉన్నదనే అనవచ్చు.

యతిప్రాసా కవితా కామినికి యమపాశాల వంటివన్నారు అత్యాధునికులు. కనుకనే కాబోలు ఈ మత్తేభాలన్నీ ఆయసపాశాలు తెంచుకొనేందుకు ఉరికాయి. యతిప్రాసలు బంధాలు గనుక, వాటికోసం కవి వ్యర్థపదాలు, అర్థవాదాలు ప్రయోగించవలసి వస్తుంది గనుక కవితా కమనీయత కలుషమౌతుందని వారివాదం. నిజమే. దీనిలో కొంత బరువు లేకపోలేదు, కాని అనిర్బంధాలతో, బందెలతో అందచందాలు తేవడమనేదే మహా కార్యం. స్వయం సంయమనంలోను, ఆత్మ నిగ్రహంలోను కదా ఉన్నది సొంపు! ఈపాశాలు తెంచుకొని తెగబడినా సొగసు రాకపోవడం ఈ రచనలో పలుచోట్ల కనిపిస్తుంది; మూల విధేయతా కొరవడింది. స్థాలీపులాక న్యాయంగా కొన్ని పద్యాలు చూడండి.

కశ్చిత్కాంతా విరహగురుణా
స్వాధికారాత్ప్రమత్తః
శాపేనాస్తంగమిత మహిమా
వర్షభోగ్యేణ భర్తుః. 1—1

అధికారంబున నేమరిల్లి ప్రభు
శాపగ్రస్తుడై యక్షుడొ
క్కడు, కాంతా విరహార్తితో, జనక
కన్యాస్నాన పుణ్యోదకం
బుల ఛాయాతరు వీథులన్, నవయు
చుండెన్ రామగిర్యాశ్రమం
బులలో, ప్రజ్ఞలు క్రుంక, భోగ్యమగు
వర్షాంతంబు వీక్షించుచున్.

(వర్ష భోగ్యేణ—అన్న మాటను భోగ్యమగు వర్షాంతంబు అని అనువదించడంవల్ల అర్థం కుంటు పడింది. భోగ్యమైనది శాపం గాని వర్షాంతంబు కాదు.)

ధూమజ్యోతి స్సలిల మరుతాం
సన్నిపాతః క్వ మేఘః
సందేశార్థాః క్వ పటుకరణైః
ప్రాణిభిః ప్రాపణీయాః,
ఇత్యౌత్సుక్యా దపరిగణయన్
గుహ్యకః తం యయాచె
కామార్తాహి ప్రకృతి కృపణాః
చేతనా చేతనేషు. 1—5

జలవాతంబులు వహ్ని ధూమములు
రూపుంగొన్న మేఘుండిదె
క్కడ? ప్రాణేంద్రియ భద్రపాటవ
సుసాధ్యంబైన సందేశ మె
క్కడ? నంచెంచడు యక్షు డుత్సుకత

పేర్మిన్; చేతనా చేతనాం
తర సంమూఢులుగారె కాముకు
 లపస్మారస్వభావాపసల్.

(సందేశార్థాః క్వ పటుకరణైః ప్రాణిభిః ప్రాపణీయాః—అన్నదానికి ప్రాణేంద్రియ భద్రపాటవసుసాధ్యంబైన సందేశమెక్కడ? అన్న అనువాదం, పాఠకులకు కూడా భద్రపాటవసుసాధ్యంగానే ఉంది. దీనికి 1926 లో బందరు నోబెల్ కాలేజి పండితులు శ్రీ శిష్టా నరసింహశాస్త్రి గారి అనువాదం:

పొగ సలిలంబు వహ్నియును
 బొంపిరివోవుచు వాయు విన్నియున్
సొగసుగ జేర మేఘముగు
 జూన్ప వచించు టదేడ యింద్రియా
వగతి జెలంగు చేతన వి
 భావ్యము వార్త యదేడ కాముకుల్
వగ వడుగంగ జూతురు వి
 పన్నతతో జడచేతనంబులన్.

యతిప్రాసలు లేక షట్పదిలో 'సంపత్' చేసిన అనువాదం:

ధూమమ్ము జ్యోతిస్సు సలిలమ్ము పవనమ్ము
చేరపి రూపుగొందు మేఘుండు తానేడ?
పటుకిరణచేతన ప్రాపణీయములైన
సందేశము లవేడ అని పరిగణింపక యి
యక్షుడౌత్సుక్యమున యాచించె మేఘుని
కాముకులగువారు సహజముగ సెల్లపుడు
చేతనా చేతనములందు కృపణులు కారె!)

బర్హేణేవ స్ఫురిత రుచినా
 గోపవేషస్య విష్ణోః. 1-15

......గోపవేషంబుతో
శిఖిపింఛచ్ఛవి నుజ్జ్వలించు
 అసిత శ్రీవిష్ణులీలాంశలన్.

(అసిత శ్రీ విష్ణువు ఎవడో? ఇక్కడ మేఘానికి సంక్రమించింది నెమలిపించంతో ముద్దులొలికే కృష్ణుని ముచ్చటైన రూపమే. లీలాంశలు కావు.)

రిక్తస్సర్వో భవతి హి లఘుః
 పూర్ణతా గౌరవాయ. 1-20

అట్టులెగా రిక్తుడు సర్వలాఘవుడు
 స్థేయుష్వమి పూర్ణుండగున్

(లేమి లోకువకు, కలిమి పూర్ణతకు కారణమౌతుందనే చక్కని భావానికి ఇదా అనువాదం?)

స్త్రీణామాద్యం ప్రణయవచనం
 విభ్రమో హి ప్రియేషు. 1-29

...చేష్టితం
బులెగా నెచ్చెలు లిష్టవల్లభుల
 పట్లన్ చూపు భావార్ద్రముల్.

(ప్రియులకు ప్రియురాండ్రు చేసేవిలాసాలే మొదటి ప్రణయవచనం అన్నది మూలభావం. ఆద్యం అనేది అనువాదంలో చాలముఖ్యం.)

ప్రాప్యావంతీ ముదయన కథా
 కోవిద గ్రామవృద్ధాన్. 1-31.

అటుపై చేరుము వత్సరాజ
 కథవార్తాభిజ్ఞులౌ గ్రామవృద్ధులు

(ఉదయనకథా కోవిద గ్రామవృద్ధులన్న మాటలోని బరువు వత్సరాజకథ వార్తాభిజ్ఞులౌ గ్రామవృద్ధులు అనేమాటలో ఉందా?)

తోయోత్సర్గ స్తనిత ముఖరో
 మాస్మభూః విక్లబాస్తాః. 1-41

...కుండెలో
తల గర్జింపకుమా కృశోదరలు
 శాలీన త్రపా భీరువుల్.

(వైక్లబ్యంలో త్రపాప్రసక్తి ఉండదు. దీనికి 'సంపత్' అనువాదం 'ఉరిమి వర్షింపకుము వారు భయవిక్లబలు'. ప్రాచీనుడైన కొటికెలపూడి వెంకట కృష్ణకవి అనువాదం:

అత్తరి వర్షగర్జిత
టోపము మాని మాపు టుక
 డుం భయచిత్తలు కారె కామినుల్.)

గత్యుత్కంపా దలక పతితైః
 యత్ర మందారపుష్పైః
పత్రచ్ఛేదైః కనక కమలైః
 కర్ణ విభ్రంశిభిశ్చ,
ముక్తాజాలైః స్తనపరిసర
 చ్ఛిన్న సూత్రైశ్చ హారైః
నైశో మార్గః సవితు రుదయే
 సూచ్యతే కామినీనామ్. 2-11

రవి రాకన్ పొసగట్టు జాడ
 లలకాంతప్రస్త మందారముల్